

శ్రీ ఆద్య జగద్గురు శంకరాచార్య విరచిత

# విజ్ఞాన నౌక

## విషయ సూచిక

### శ్రీమచ్ఛంకరాచార్యరచితము

# విజ్ఞాన నౌకా

## (స్వరూపానుసంధానమ్)

### మంగళాచరణము

అతికల్యాణరూపత్వాత్ నిత్యకల్యాణసంశ్రయాత్ ।
స్మర్తౄణాం వరదత్వాచ్చ బ్రహ్మ తన్మంగళం విదుః ॥

తా॥ అతిశయ కల్యాణ స్వరూపు డగుటచేతను, శాశ్వతకల్యాణమునకే ఆశ్రయ మగుటచేతను, స్మరించువారికి వరముల ననుగ్రహించుటవలనను, పరబ్రహ్మమును మంగళముగా తెలియుచున్నారు.

శ్లో॥ అశుభాని నిరాచష్టే తనోతి శుభసంపదమ్ ।
స్మృతిమాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగళమ్ విదుః ॥

తా॥ ఏ పరిపూర్ణపరబ్రహ్మము తనస్మరణమాత్రముచేత అధికారపురుషుల యొక్క, సర్వానర్థముల నివృత్తి జేయునదియును, సకలసుఖ సంపదలను విస్తరిల్ల జేయునదియు నగుచున్నదో, ఆ బ్రహ్మమును వేదవేత్తలు మంగళరూపముగా తెలియుచున్నారు.

శ్లో॥ ఓంకారశ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా ।
కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికా వుభౌ ॥

తా॥ సృష్ట్యాదియందు బ్రహ్మముయొక్క కంఠమును భేదించుకొని ముందుగ ఓంకారమును, అథయను శబ్దమును పుట్టెను. కాన ఈరెండు శబ్దములును మంగళకరము లయినవి, ప్రసిద్ధములై యున్నవి.

శంక:- మూర్ఖులైనను ప్రయోజనము లేని పనిని చేయరు. మంగళాచరణము వలన కలుగు ఫలమేమో వివరింపుడు?

సమా:- ప్రారంభించిన గ్రంథము నిర్విఘ్నముగ కొనసాగుటకును, గ్రంథకర్త

యెడ నాస్తికత్వభ్రాంతి లేక జిజ్ఞాసువులు గ్రంథపఠనమున ప్రవర్తించుటకును, పూర్వపు ఋషుల సంప్రదాయకాచారమును పాలించుటకొరకును, శిష్యులకు శిష్టాచారము నేర్పుటకును, అవశ్యము మంగళాచరణ మొనర్పదగియున్నది.

నారాయణః = నరస్యేదం ఆరం అవతారేషు నారం వపురయత
ఇతి నారాయణః-నరసంబంధమైన శరీరము నారము.
అవతారములయందు నరశరీరమును బొందువాడు. అయగతౌ,
నారా ఆపః అయనం స్థానం యస్య సః- నారమనగా జలము.
అది స్థానముగా గలవాడు, నరసమూహో నారం తస్యాయనమితి వా,
తదయనయస్యేతివా-నరసమూహమునకు స్థాన
మయినవాడు లేక నరసమూహమును నివాసముగా గలవాడు.
రాశ్శబ్దాః అయంతే నిర్గచ్ఛంతే యస్మాత్స నారాయణః-
రాయణా దన్యః అరాయణః-అరాయ గో న భవతీతి నారాయణః-
శబ్దగమ్య ఇత్యర్థః-ఎవనివలన శబ్దములు బయలువెడలుచున్నవో
అతడు నారాయణుడు. రాయణుడు గానివాడు అరాయణుడు
అరాయణుడు గాని వాడు నారాయణుడు. అనగా శబ్దగమ్యుడు
నారాయణుడు (అమరకోశము- గురుబాలప్రబోధిక)

ఆ మంగళము 1. ఆశీర్వాద 2. నమస్కార 3. వస్తునిర్దేశ రూపభేదములచే త్రివిధమై యున్నది. అందు నమస్కార లక్షణరూప మగు టీకాకారుని మంగళశ్లోక మారంభింపబడుచున్నది.

## నారాయణ ప్రశంస

శ్లో॥ నారాయణం నమస్యామి మోహాంధతిమిరాపహమ్ ।
ప్రకాశం ప్రకాశ్యానాం శుద్ధబుద్ధస్వరూపిణమ్ ॥

తా॥ నారాయణునకు నమస్కరించుచున్నాను. అతడెట్టివాడు- మోహాంధ తిమిరమును నశింపజేయువాడు ప్రకాశ్యవస్తువులకు ప్రకాశకుడు మరియు శుద్ధ బుద్ధస్వరూపుడు

వివరణః- నారాయణ పదమునకు అర్థమేమి? "ఆపో నారా ఇతి ప్రోక్తాః" యని మనువాక్యము. నారములనగా నీరు. ఆనీరు ఆశ్రయముగా గలవాడు అనగా జలశాయి కాబట్టి నారాయణుడని పిలువబడెను. ఆదినరసంభూతుడగు హిరణ్యగర్భుడు నారమని చెప్పబడును. హిరణ్యగర్భుడనగా బ్రహ్మదేవుడు. అతడు నాలుగు ముఖములు గలవాడు. విసర్గరూపమగు సృష్టికి కర్త. అట్టి బ్రహ్మను తన నాభికమలము నందుండి జనింపజేసి ఆతనికి తానె ఆశ్రయుడైయుండుటం బట్టి నారాయణుడని చెప్పబడెను. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం" అని వేదముకూడ చెప్పినది. మరొక్క విధమున నారమని జీవసముదాయమునకు కూడపేరు. వాటి నాక్రమించి వ్యాపించి యుండుటంబట్టి నారాయణుడని పేరు సిద్ధించినది 'అరా'అనగా ఇరుసు. సంసారచక్రమునకు ఇరుసువంటిదగు మాయ 'అరాయణ' మనబడును. అట్టి మాయకు అతీతుడగుటంబట్టి ఆతడు నారాయణుడు. ఇట్లు వివిధవ్యుత్పత్తుల మూలమున నారాయణ పదమునకు సార్థకత కలదు.

ఆ నారాయణు డెట్టివాడు? మోహాంధతిమిరమును పరిహరించువాడు, గాఢమగు మోహము చీకటివలె ఆవరణమును కల్గించునదియై యున్నది. అట్టి మోహమును వృత్తివిశిష్ట చేతనరూపముచేత నశింపజేయువాడు నారాయణుడని అర్థము.

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥**
**తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥** (భగవద్గీత 10-10-11)

సతత యుక్తులై ప్రీతిపూర్వకముగ భగవంతుడనగు నన్ను భజించువారల ననుగ్రహించి వారి వారి యంతఃకరణములందె నివసించుచున్నవాడనై జ్ఞానదీప ప్రకాశమున అజ్ఞానమను చీకటిని పారద్రోలుచున్నానని భగవంతుడగు కృష్ణుడు భగవద్గీతయందు చెప్పియున్నాడు.

ఇచ్చట అజ్ఞానమును చీకటియనియు, జ్ఞానమును దీపమనియు పోల్చి చెప్పియున్నాడు. అజ్ఞానము చీకటివలె ఆవరణస్వభావము గలది. చీకటివలన త్రాడు సర్పముగను, స్థాణువు చోరుడుగను తోచునట్లు అజ్ఞానప్రభావమున నిత్యముక్తుడు

అసంగుడు, నిర్వికారుడునగు ఆత్మ బద్ధుడుగను సంసారిగను వికారిగను తోపట్టుచున్నాడు. నిజమునకు శుద్ధకూటస్థుడగు ఆత్మయందు తోచెడి ఆ బంధము కేవల అవిద్యాదోషముచే తోచెడిదియు, మిథ్యామాత్రమును, అధ్యాస రూపమునై యున్నది. దోషము లేక అధ్యాస యేర్పడదు. ఎట్టి హేతువు లేకున్నను అధ్యాసయందు అవిద్యాదోష మవశ్యముండును. అందుచే సర్వదోష నిలయమగు అజ్ఞానము చీకటివలె ఆవరణము కల్గించునదియై యున్నది. దీనినిబట్టియే అజ్ఞానమునకు చీకటిని పోలిక నిచ్చియున్నారు. అట్లె జ్ఞానమును దీపముతో ఉపమించినారు. ఇంటిలోని చీకటి కేవలదీపముతో తప్ప మరేయితర సాధనముల ద్వారా నశింపజాలని యట్లు హృదయగతమగు అజ్ఞానముకూడ కేవల జ్ఞానము చేతనే నాశమొందగలదు.

దీపమునకు నూనె వత్తి మొదలగు సామగ్రులు అవసరమైనట్లు జ్ఞానము నకును భక్తి శ్రద్ధాదు లవసరము. దీపము తానుండు ఇంటిలోని చీకటిని మాత్రము పోగొట్టజాలును. కాని ప్రక్కయింటి చీకటిని పోగొట్ట జాలదు. అట్లే వృత్తి జ్ఞానముకూడ తాను అధిష్ఠించిన అంతఃకరణమందలి అజ్ఞానమును తొలగింప జాలునేకాని యితరపురుషుల అన్యాంతఃకరణము లందలి అజ్ఞానమును తొలగింప లేదు. ఈ హేతువులను బట్టి జ్ఞానమును దీపముతో పోల్చిరి. నారాయణుడు వృత్తిని ఆరోహించి అజ్ఞానతిమిరమును అపహరించుచున్నాడని ఫలితార్థము.

ఈ అజ్ఞాన మెవ్వరిని ఆవరించుచున్నది? అజ్ఞానము, ఆవరణము, విక్షేపము మొదలగు అవస్థలన్నియు ఆభాససహిత అంతఃకరణమునకు చెందినవి. కూటస్థుడగు ఆత్మకు ఎట్టి అవస్థయు లేదు. ఆతడు నిర్వికారుడు. అయినను ఆచార్యులు పలువురు అజ్ఞానమును స్వాశ్రయము, స్వవిషయమునని నిర్వచించి యున్నారు. ఆపక్షమున అజ్ఞానము శుద్ధచైతన్యమునె ఆశ్రయించి శుద్ధచైతన్యమునే విషయీకరించినది. బ్రహ్మముయొక్క సామాన్యరూపమగు సత్తును, చిత్తును అజ్ఞానమునకు ఆశ్రయ మనియు, విశేషరూపమగు ఆనంద అద్వైతములు అజ్ఞానమునకు విషయ మనియు, మఱికొందఱాచార్యులు నుడివిరి.

మరికొందరు అజ్ఞానమునకు జీవుడు ఆశ్రయ మనియు, బ్రహ్మము విషయ మనియు తెలిపియున్నారు.

కొందరు ఏకజీవవాదమును అంగీకరించి ఏకాజ్ఞానమును చెప్పిరి. కొందరు నానాజీవవాదమును గ్రహించి అజ్ఞానముయొక్క నానాత్వమును ప్రతిపాదించిరి. కొందరు నిరంశ అజ్ఞానమును, కొందరు సాంశ అజ్ఞానమును పేర్కొనిరి.

ఇట్లు అజ్ఞానముయొక్క ఆశ్రయ, విషయ, విచారములందు వివిధమతములను ఆచార్యులు ప్రకటించిరి.

ఏది ఎట్లున్నను అజ్ఞానముయొక్క అభిమాని చిదాభాసుడే. "నేను బ్రహ్మము నెఱుగ" ననెడి బ్రహ్మాత్మల ఏకత్వజ్ఞానము స్ఫురించని లక్షణము గల అజ్ఞానము సాభాసాంతఃకరణమునందే వెల్లడియగుచున్నది. అజ్ఞానము సుషుప్తియందు కొందరు లేదన్నను బీజరూపమై గుప్తమై గర్భితమై యున్నది. అది అకించిత్కరము (ఏపని చేయుటకును అసమర్థము). అంతఃకరణమునందు అభివ్యక్తమైన అజ్ఞానమే తన అధిష్ఠానమగు ఆత్మను ఆవరింపగల్గుచున్నది. ఆ ఆవరణముకూడ ప్రతీతి మాత్రమెగాని సత్యమునకు లేదు.

సూక్ష్మముగ విచారించిన ఆత్మ అజ్ఞానముకంటెను విలక్షణము. సదా ఆవరణ రహితుడు, నిత్యముక్తుడు, సమస్తమునకు సాక్షి. ఆదిత్యవర్ణుడగు ఆచేతనాత్మ తమస్సునకు పరుడు అని శ్రుతిస్మృతు లుగ్గడించినవి. తమదృష్టికి గల మేఘావరణమును సూర్యునియం దారోపించునట్లు మూఢులు ఆత్మను ఆవరణ సహితముగ బంధసహితముగ తలంచుచున్నారు. హస్తామలకుని మాట చొప్పున నది బుద్ధిదోషమెగాని, వాస్తవముగ కూటస్థుడగు ఆత్మయందెట్టి దోషమును సంభవింప వీలులేదు.

మరియు ఆనారాయణుడు ప్రకాశ్యవస్తువులకు ప్రకాశకుడు. ప్రకాశింప జేయబడునది ప్రకాశ్య మనబడును. ప్రకాశింపజేయునది ప్రకాశక మనబడును. అవ్యక్తము మొదలు భూమివరకు కారణకార్య రూపమగు భూతభౌతిక సమస్త ప్రపంచమును దృశ్యమగుటంబట్టి ప్రకాశ్య మనబడును. దానిని ప్రకాశింపజేయు స్వయంజ్యోతిః స్వరూపమగు ప్రత్యగభిన్న పరమాత్మ ప్రకాశ మనబడును. బాహ్య ఘటాది పదార్థములను సూర్యచంద్రాదులు ప్రకాశింపజేయుదురు. అయినను

ఆ సూర్యాదిప్రకాశములు పరిచ్ఛిన్నములు. ఆజ్యోతులకు కూడ జ్యోతి చైతన్యాత్మయే. ఆచిత్స్వరూపుడగు నారాయణునివలననే సూర్యాదులు ప్రకాశించు చున్నారు. **"తస్య భాసా సర్వమిదం విభాతి"** (కఠ)యనియు, **"జ్యోతిషామపి తజ్జ్యోతిః"** (గీత) అనియు శ్రుతిస్మృతు లావిషయమును నిర్ధారించుచున్నవి. ఆచైతన్యజ్యోతి అగ్నివలె దీప్తి రూపము కాదు. అది జ్ఞప్తిరూపము. ఇంతకూ నిష్కర్ష యేమనిన అంతర్బాహ్యము లందలి సర్వదృశ్య పదార్థములనూ, సూర్యాది జ్యోతులను సైతము ఏకచిదాత్మ నారాయణుడే ప్రకాశింపజేయుచున్నాడు.

**మం॥ నారాయణ పరో జ్యోతి రాత్మా నారాయణః పరః ।**
**నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః ।**
**నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః ॥** (మంత్రపుష్పము)

తా॥ నారాయణ పరబ్రహ్మము శ్రేష్ఠమగు జ్యోతిస్స్వరూపము. నారాయణుడే పరమాత్మ. నారాయణుడే వేదాంతవేద్యమగు పరబ్రహ్మము. నారాయణుడే శ్రేష్ఠమైన పరతత్త్వము, ధ్యానించువాడును, ధ్యానమును నారాయణ పరబ్రహ్మమే. తదన్యము లేదు.

**మం॥ యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా ।**
**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః ॥** (మంత్రపుష్పము)

తా॥ ఈ జగత్తునందు ఏ కొంచెమైనను చూడబడుచున్నదో, వినబడు చున్నదో- అది అంతయును, దానికి లోపలను వెలుపలను అంతటను నారాయణ పరబ్రహ్మమే వ్యాపించియున్నది.

ఆ నారాయణుడు శుద్ధుడు. అవిద్యాది మలరహితుడని యర్థము. మల మనిన పాపమునకు కూడపేరు. శాస్త్రములందు రాగాది మానస దోషములను మల మని పేర్కొనుట గలదు. ఇవియన్నియు అవిద్యయందంతర్భూతములు. అవిద్యను నిషేధించినంత ఈ మలము లన్నిటి నిషేధము తనంతట చేకూడును. ఈకారణమును బట్టి నారాయణుడు శుద్ధుడు.

నారాయణుడు బుద్ధుడు. బుద్ధుడనిన జ్ఞానస్వరూపుడు అని యర్థము.

అంతేగాని జ్ఞాన గుణము కలవాడని కాదు. గుణమునకు ఉత్పత్తి వినాశము లుండును. ఈ జ్ఞాన మట్టిది కాదు. అది నిత్యము, ప్రకాశస్వరూపుడగు సూర్యునివలె ఉష్ణస్వరూపుడగు అగ్నివలె పరమాత్ముడు జ్ఞానస్వరూపుడు. అతని జ్ఞానప్రకాశ సహాయమున జడములగు ఇంద్రియములు తమ తమ విషయములందు ప్రవర్తించుచున్నవి.

ఆక్షేపము:- బుద్ధిని విజ్ఞానస్వరూపమని శాస్త్రములు చెప్పినవి. దానిచేత ఇంద్రియములు ప్రవర్తించినవని యేల చెప్పరాదు?

సమా: బుద్ధికూడ విజ్ఞానస్వరూపము కాదు. అది సత్త్వగుణము యొక్క కార్యము. చేతన ప్రతిబింబమును బుద్ధి గ్రహించి తాను స్వయముగ జ్ఞానవంతముగ దోచును. ఈ దృష్టితో విజ్ఞానమనుపేరు తాను పొందినది. బుద్ధి జడరూపము. కావున దానియందు జ్ఞానముండుటకే వీలులేని యపుడు విశేషజ్ఞానరూపమగు విజ్ఞాన మెట్లు సంభవించును? కృష్ణ సాన్నిధ్యమున అర్జునుని సామర్థ్యమునుబోలి చేతనరూప మగు ఆత్మయొక్క సన్నిధానమున బుద్ధి తాను జ్ఞానయోగ్యతను పొందినది. మరియును బుద్ధి క్రమముగ నొకటివెంట నొకటిగ విషయములను ప్రకాశింప జేయును. ఆత్మ పైక్రమమునకు చిక్కక విషయ పదార్థము లన్నింటిని ఒక్కుమ్మడి ప్రకాశింపజేయును. బుద్ధి చేతన ప్రకాశమును అపేక్షించి తాను ప్రకాశించును. ఆత్మ యితరమైన దేనినీ అపేక్షింపకయే స్వయముగ వెలుగును. ఈ కారణములను బట్టి బుద్ధి జ్ఞానస్వరూపము కాకపోయినను, గౌణముగ విజ్ఞాన శబ్దము ప్రయోగింపబడినది. ఆత్మయే ముఖ్యజ్ఞానస్వరూపము. ఈ విధమగు విశేషణములతో విశిష్టుడగు నారాయణునకు నా అభేదరూప నమస్కారములు.

### "నమః" శబ్దమునకు గల విశేషార్థము.

శ్లో॥ తుభ్యం మహ్యమనంతాయ మహ్యం తుభ్యం శివాత్మనే।
నమో దేవాధిదేవాయ పరాయ పరమాత్మనే॥ (పరాపూజ)

'అహం' పదలక్ష్యార్థమగు ప్రత్యక్స్వరూపుడనగు నేనును, బ్రహ్మపద లక్ష్యార్థ మగు పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపుడవగు నీవును అనంత స్వరూపులమే.

ఉభయులము శివస్వరూపులము. అనగా పరమకల్యాణ స్వరూపులము. కనుక దేవాది దేవుడవును, సర్వశ్రేష్ఠుడవును నగు నీకు నమస్కారమని చెప్పినపుడు పరమాత్మ స్వరూపుడనగు నాకును నమస్కారము చెప్పినట్లే యగును. అనగా అహంకారము నేను కాదని బాధింపబడినప్పుడు శేషించిన ప్రత్యక్ స్వరూప మగు తాను బ్రహ్మ మగునని భావము. **"తన్నమ ఇత్యుపాసీత నమ్యంతేఽస్మై కామః తద్బ్రహ్మేత్యు పాసీత బ్రహ్మవాన్భవతి"** (తైత్తి భృగు-10 అను)= బ్రహ్మమును "నమః" అని ఉపాసన చేయువాని సర్వకామనలు నమస్కార మొనర్చును. "నమః" అనుదానిని బ్రహ్మమని ఉపాసించువాడు బ్రహ్మజ్ఞు డగును.

"నమః" శబ్దమునకు నమస్కారమను అర్థము సర్వజనవిదితము. అయినను మరికొన్ని నిగూఢములైన అర్థములును కలవు. అవి యేవనగా?

1. ఓ నారాయణ పరబ్రహ్మమా! 'మా' అనగా మాయ. అది నీకు లేకుండుట చేత 'నమః' అనబడుదువు. మరియు 'మా' అనగా లక్ష్మి. (ఇందిరా లోకమాతా మా రమా అని అమరకోశము) ఇక్కడ 'మా' శబ్దమునకు లోకమాతయు, జగత్కర్త్రియునగు ప్రకృతి అని అర్థము- అఖండానందైక రసపరబ్రహ్మమునందు ఈమాయ లేకుండుటవలన "న+మా = యస్య సః నమః" అనగా మాయ ఎవరికి లేదో అతనికి "నమః" అనిపేరు కలదు.

**"అవ్యక్తాత్ పురుషః పరః పురుషాన్నపరం కించిత్"** (కఠ1-3-11) "అవ్యక్తము కంటె పరమై పురుషుడనెడు పరమాత్మ కలడు. అతనికంటె అతీతము ఏదియు లేదు". అందువలన నారాయణ స్వరూపుడవగు నీవు "నమః" అనబడుదువు. దీని ఫలమేమనగా నీకంటె అన్యమేమియు లేదు అని నేను తెలిసికొనినపుడు నేను నీలోనే అంతర్భూతము కనుక "నమః" అనబడుదువు. దీని ఫలమేమనగా- నీకంటె అన్యము ఏమియు లేదు అని నేను తెలిసికొనినపుడు నేను నీలోనే అంతర్భూతము కనుక "నమః"= నేనును అవిద్యారహితుడునై అఖండాద్వితీయ పరబ్రహ్మ స్వరూపుడ నగుదును

2. నమః- మన్‌ధాతువునకును పరిణామము అని అర్థము. న+మః =

పరిణామము లేని నీవు నిర్వికారుడవు. నిరాకారుడవు. కనుక నిత్యుడవు. పరిపూర్ణుడవు. అట్లే ఆత్మవిచారణ చేసి దేహాత్మభావన విడిచినచో దేహత్రయ రహితుడనై నిరుపాధికుడుగా మిగిలిన నేను ఘటాకాశ మహాకాశములవలె నీవే నేను. కనుక న+మః = పరిణామము లేనివాడను. అందువలన నిత్యపరిపూర్ణుడ నగుదును.

3. "మా"ధాతువునకు మానము. అనగా కొలత, పరిమితి అని అర్థము. ఫలమని చెప్పబడు చిదాభాసాంతఃకరణవృత్తికి పరబ్రహ్మస్వరూపుడవగు నీవు విషయము కాదు. కాబట్టి అప్రమేయుడవు. కనుక న+మః = మానరహితుడవు, మరియు దేశ కాల వస్తు పరిచ్ఛేదము లేని పరిమాణ రహితుడవు. కనుక నీవు పరిపూర్ణు డవు. నన్ను నేను అవిద్యాబలమున "అనయేః" పరిచ్ఛిన్నుడనని అనుకొన్నను మీ అనుగ్రహమువలన "నమః" పరిమాణము లేనివాడనని తెలిసికొనుటచే నేను కూడ పరిమాణము లేని పరిపూర్ణుడ నైతినని "నమః" శబ్దమునకు భావార్థము కలదు.

"**నమః = ప్రహ్వీభావః- అస్త్వితి శేషః ప్రహ్వీభావశ్చ స్వాత్మనః పరమేశ్వరైకత్వేన సమర్పణమ్**"- అని (లఘుతత్త్వసుధావ్యాఖ్యలో) జీవబ్రహ్మైక్యాత్మకాభేదగర్భ నమస్కారమే వర్ణితమై యున్నది. మరియు

శ్లో॥ **ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే ।**
**వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః ॥**

(దక్షి. స్తో. వ్యా. 1-80)

**"ఇదం నమ" ఇత్యస్య ఆత్మసమర్పణం ప్రహ్వీభావం వివక్షన్. ఆత్మేతి మూర్తి త్రయకృత పరిచ్ఛేదశంకావ్యావృత్తయే "వ్యోమవద్వ్యాప్త రూపాయేతి"-** ఈ విధముగా **స్వాధ్యస్తమాయా కల్పితగురుదేవతా-** ఆత్మమూర్తులలో ఘటమఠాదులలో నఖండాకాశమువలె స్వాప్నిక గురుదేవతాత్మోపాధులలో అఖండ ప్రత్యగాత్మవలె వెలుగొందు అఖండాద్వితీయాత్మయందు జీవబ్రహ్మైక్యాత్మక-అభేదగర్భ నమస్కారమే వర్ణితమై యున్నది.

శ్లో॥ **సర్వభూతాంతరస్థాయి నిత్యయుక్తచిదాత్మనే ।**
**ప్రత్యక్ప్రతన్యరూపాయ మహ్యమేవ నమో నమః ॥**

**తుభ్యం మహ్యమనంతాయ మహ్యం తుభ్యం చిదాత్మనే ।**
**నమో మహ్యం పరేశాయ నమస్తుభ్యం శివాయ చ ॥**

ఈ విధముగ వరాహోపనిషత్తులో మాయాంతఃకరణోపాధిక మాయా మయ నమస్కార్య నమస్కర్తృభేదము సమ్యగ్దర్శనములో నగోచరమై గురువు, శిష్యుడు, నారాయణుడు అని కల్పితోపాధిత్రయములో నేకరూపముగ గోచరించు నొకే యొక అఖండాద్వితీయ చిదాత్మవస్తువే నమస్కారార్థమనెడి భావ మా సమ్యగ్దర్శనములో గోచరించుననియు, నదియే యభేదగర్భ నమస్కార మనియు గుర్తింప వగును. ఇట్టి సమ్యగ్దర్శనాత్మకమగు నభేదగర్భనమస్కార రహస్యము ఉత్తమ సాధనకునకు సద్గుర్వనుగ్రహైక సమధిగమ్యమే యని తెలియదగును.

అవతారిక:- ఇట్లు గ్రంథారంభమున మంగళ మొనర్చి యికపై నవశ్లోకాత్మక మగు విజ్ఞాననౌకకు వివరణము వ్రాయబడుచున్నది.

**గ్రంథారంభము:-** ఇది విజ్ఞాననౌక, సంసార సముద్రమును దాటించు ఓడ. సద్గురుడను నావికుని ఆశ్రయించి పునఃపునః దీనిని మననము చేసి దీని తాత్పర్యమునకు అనుకూలమగు వృత్తిని సంపాదించినవారు అనాయాసముగ భవ సాగరమునుండి గట్టెక్కగలరు. సంసారమును సముద్రరూపముగ శాస్త్రములు పోల్చిచెప్పినవి. ఇందు జన్మ జరా మృత్యు రూపమగు జలము గలదు. రాగద్వేషాదులు మకరమత్స్యములు, శోకము- బడబానలము, సుఖదుఃఖాకార వృత్తులు తరంగములు, భ్రమలు- సుడిగుండములు, ఈజనన మరణ రూప సంసార సముద్రమునకు ఆవలి దీవి పరబ్రహ్మము. దానిని పొంది తిరిగి సంసార సముద్రమున పడుటలేదు. అందుకే **"న స పునరావర్తతే"** (ఛాం 8-15=1) అని శ్రుతి పల్కినది. **"యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ"** (భ.గీ.15-6)= దేనిని పొంది మరల తిరిగిరారో అదియే నాపరమ ధామమై యున్నదని గీత చెప్పినది. సర్వశ్రుతిస్మృతి సిద్ధాంతరూపమగు ఇట్టి విజ్ఞాన నౌక జిజ్ఞాసువులకు తప్పనిసరి విచారింపదగియున్నది.

## అనుబంధచతుష్టయము

1. అధికారి 2. సంబంధము 3. విషయము 4. ప్రయోజనము- ఈ నాల్గింటిని అనుబంధమను పేర పిలిచెదరు.

**1. అధికారి:-** మలవిక్షేపదోషములు లేక వివేకాది సాధనములు నాల్గింటితో కూడి అజ్ఞానప్రభావముతో స్వరూపజ్ఞానము మాత్రము లేనివాడు ఈ గ్రంథము నకు అధికారి. ఈ అధికారినిగూర్చిన వివరములు ప్రథమశ్లోక వివరణమున తెల్లము కాగలవు.

**2. సంబంధము:-** ఈ గ్రంథమునకును, బ్రహ్మమునకును ప్రతిపాదక ప్రతిపాద్యభావము కలదు. అట్లే గ్రంథమునకును, జ్ఞానమునకును జనక జన్య భావమును, గ్రంథమునకు అజ్ఞానమునకును నివర్తక నివర్త్యభావ సంబంధమును కలదు. ఇంకను ప్రయోజనమునకును, అధికారికిని ప్రాప్యప్రాపకభావ సంబంధము కలదు. తక్కిన సంబంధములనుకూడ ఇట్లే ఊహించునది.

శంక:- బ్రహ్మము వాక్కుకు విషయము కాజాలదని శ్రుతి చెప్పినది. అటులైన మీరు చెప్పు ప్రతిపాదక ప్రతిపాద్యభావ సంబంధమెట్లు పొసగును?

సమా:- సూచీకటాహ న్యాయము ననుసరించి చెప్పబడినది. శబ్దము శక్తి వృత్తి వలన బ్రహ్మము నెరిగింప లేదనుట నిజమే అయినను లక్షణావృత్తివలన బోధింపగలదు. దీని ప్రక్రియ ఐదవశ్లోక వివరణమున తెలియజేయబడును, లక్ష్యము యొక్క జ్ఞానము లక్షణయొక్క రూపము శక్యార్థసహాయము లేక సిద్ధింపవు. అందుచే అధ్యారోప అపవాదన్యాయమును బట్టి బ్రహ్మజ్ఞానము శబ్దముచే సిద్ధింపగలదు. కావున ప్రతిపాదక ప్రతిపాద్య భావసంబంధము చెప్పబడినది.

**3. విషయము:-** జీవబ్రహ్మల ఏకత్వము ఈ గ్రంథమునకు విషయము

శంక:- జీవుడు రాగాదిక్లేశములతో కూడియుండువాడు. క్లేశరహితుడగు బ్రహ్మముతో వానికి అభేదము ఎట్లు చేకూరును?

సమా:- అవును. అంతఃకరణవిశిష్టునకు బ్రహ్మముతోడ ఏకత్వము

సిద్ధింపదు. కాని అంతఃకరణభాగమగు విశేషణమును వదలినచో చేతనభాగమగు విశేష్యమునకు బ్రహ్మముతోడి ఏకత్వము పొసగును. ఎందుకనిన రాగాదిక్లేశములు విశేషణధర్మములు. విశేష్యరూపమున నుండు సాక్షి సర్వక్లేశ రహితుడుగనె ఉన్నాడు. అతనికి బ్రహ్మముతో సదా అభేదమే పొసగియున్నది. సర్వవేదాంతము లీవిషయము నంగీకరించుచున్నవి.

**4. ప్రయోజనము:-** పరమానందప్రాప్తియు సమూలముగ అనర్థనివృత్తియు గ్రంథముయొక్క ముఖ్యప్రయోజనము. జ్ఞానము అవాంతర ప్రయోజనము.

శంక:- పరమానందము జీవస్వరూపమని వేదములు చెప్పినవి. తిరిగి పరమా నందప్రాప్తిని చెప్పుట అసంగతము.

సమా:- పరమానందము జీవస్వరూపమే అయిఉన్నను అజ్ఞానకాలమందది ప్రకట మగుట లేదు. అందుచే కంఠచామీకర న్యాయమువలె ప్రాప్తికి తిరిగి ప్రాప్తి చెప్పబడినది. జ్ఞానకాలమందే ప్రకట మగుచున్నది.

ఇది అనుబంధముయొక్క సామాన్య నిరూపణము. ముందు చెప్పిన అధికార లక్షణమందు కొంత జిజ్ఞాస కలుగుట సహజము. మలవిక్షేపదోష నివృత్తికి సాధనము లెవ్వి? నాల్గు సాధనము లనిన నేవి? ఆనాలుగు సాధనములను సాధింప దగు ఉపాయ మెద్ది? అజ్ఞాన మెట్లు తొలగును? అజ్ఞాననివృత్తి వలన అధికారికి కల్గు లాభమేమి? ఈప్రశ్నలకు ప్రథమశ్లోకవివరణ సందర్భమున సమాధాన మివ్వబడును.



## మొదటి శ్లోకం

ఈ మొదటిశ్లోకమున ఆచార్యులవారు అధికారికి వలయు సాధనములను పేర్కొనుచు తమ అనుభవమును సైతము నుడువుచున్నాడు.

మూ॥శ్లో॥ **తపోయజ్ఞదానాదిభిశ్శుద్ధబుద్ధి**
**ర్విరక్తో నృపాదౌ పదే తుచ్ఛబుద్ధ్యా ।**
**పరిత్యజ్య సర్వం యదాప్నోతి తత్త్వం**
**పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ 1**

టీక॥ తపోయజ్ఞ దానాదిభిః = తపస్సు, యజ్ఞము, దానము మున్నగు నిష్కామకర్మానుష్ఠానము చేత, శుద్ధబుద్ధిః = దోషరహిత (పరిశుద్ధ)మైన బుద్ధి గలవాడై, నృప+ఆదౌ = రాజు, చక్రవర్తి మొదలైన, పదే = పదవులందు, తుచ్ఛ బుద్ధ్యా = అనిత్యములు కాన తుచ్ఛములని నిశ్చయించిన బుద్ధిచే, విరక్త = వైరాగ్యము కలిగినవాడై, సర్వం = సమస్త మనోరాజ్యమును, పరిత్యజ్య = పూర్తిగా విడిచిపెట్టి, యత్ = ఏ, తత్త్వం = పరమార్థతత్త్వమును, ఆప్నోతి = పొందుచున్నాడో, తత్ = ఆ, నిత్యం = నిత్యమును, పరం = సర్వోత్తమమును అగు, బ్రహ్మ+ఏవ = బ్రహ్మమే, అహం = నేను, అస్మి = అగుచున్నాను.

తా॥ తపో యజ్ఞ దానాదికములచే పరిశుద్ధమగు బుద్ధి కలిగి దాని మూలమున రాజరికము మొదలుకొని పదవు లన్నిటియందును విరక్తుడైనవాడు సమస్త మనోరాజ్యమును వదలి నిత్యరూపమును, సర్వోత్తమమును అగుట ఏ పరబ్రహ్మ తత్త్వమును పొందుచున్నాడో అదియే నేనై యున్నాను.

## తపశ్శబ్దముయొక్క అర్థము

నిజవర్ణాశ్రమ ధర్మానుష్ఠానము తపస్సనబడును. అందు బ్రాహ్మణాది నాల్గు వర్ణములయొక్కయు, బ్రహ్మచర్యాది నాల్గు ఆశ్రమములయొక్కయు ధర్మములు మన్వాదిశాస్త్రములందు ప్రసిద్ధములై యున్నవి. ఇంద్రియసంయమమునుకూడ

తపస్సందురు. కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రత పాలనమును తపస్సే. అట్లే వైరాగ్యమును, విచారమును తపస్సని చెప్పుట కలదు. ఇట్లు తపశ్శబ్దము వివిధార్థములందు వర్ణింప బడియున్నది. ఇంతేగాక గీతయందు సాత్త్విక రాజస తామస భేదములచే తపస్సు చెప్పబడినది. అందు సాత్త్వికతపస్సు ఆచరణీయ మైనది. అదియు శారీరవాఙ్మయ మానసిక భేదములచే త్రివిధము.

## యజ్ఞ పదమునకు అర్థము

ఈశ్వరార్పణబుద్ధిచే సర్వాంగయుక్తముగ చేయబడు పూజను (యజనమును) యజ్ఞమందురు. అది శ్రౌతస్మార్త భేదముతోడను, అధికారిభేదమునను, ముఖ్య గౌణభేదములతోను నానాప్రకారములై యున్నది. బృహస్పతిసవన రాజసూయ వైశ్య స్తోమాదికములను శ్రౌతయజ్ఞములను బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు యథా క్రమముగ నాచరింతురు. దేవయజ్ఞ, ఋషియజ్ఞ, పితృయజ్ఞాది పంచమహా యజ్ఞములు స్మార్తయజ్ఞములు. అవి గృహస్థు డైనవానికి నిత్యము చేయదగినవి. అట్లే దర్శపూర్ణ మాసాది యజ్ఞములు వాన ప్రస్థునకు యోగ్యములు. మరియు ద్రవ్యయజ్ఞ, తపోయజ్ఞ, యోగయజ్ఞ, స్వాధ్యాయయజ్ఞ, జ్ఞానయజ్ఞాది గౌణ యజ్ఞములు గీతయందు చెప్పబడినవి. అవి వారివారి అధికారానుసారమున అన్ని ఆశ్రమములవారును ఆచరింపదగినవి.

## దానశబ్దమునకు అర్థము.

దానము సాత్త్విక రాజస తామస భేదములచే మూడు విధములని భగవంతుడు చెప్పియున్నాడు. అందు ముముక్షువులు సాత్త్వికదానమునే సమాశ్రయింపవలెను. ఉత్తమదేశమున, ఉత్తమకాలమున, ఉత్తమపాత్రయందు ఏ కొంచె మివ్వబడినను అది సాత్త్వికదానమని చెప్పబడును. అది అన్నదానము, వస్త్రదానము, హిరణ్యదానము, గోదానము మొదలగు ద్రవ్యసాధ్యములగు దానములను యథాసాధ్యముగ నెల్లరును ఆచరింపదగియున్నది. దానయోగ్యులగు పాత్రలను గూర్చియు, వారి భేదమును గూర్చియు, శాస్త్రములు విరివిగ చెప్పి యున్నవి. అన్నిదానములందును అన్నదానము శ్రేష్ఠము. అన్నదానమునకు అధికార

వివక్షత లేదు. ద్రవ్యదానమునందు మాత్రము పాత్రాపాత్ర విచార మవసరము. తపస్సు, యజ్ఞము, దానములను గూర్చిన వ్యాఖ్యానము ముగిసినది.

## ఆదిపదమునకు అర్థము

ఆది శబ్దమువలన ఇచట చెప్పబడని, మరియు నితరసర్వ కర్మములును, సగుణోపాసనయు గ్రహింపదగియున్నవి. నిత్యనైమిత్తికకర్మలు పాపములను నశింప జేయుటకు సాధనములు. గంగాది తీర్థస్నానాదికములు చిత్తశుద్ధి నాపాదించునవి. గురుపాదోదకము పరమతీర్థమని చెప్పబడును. సప్తసాగర పర్యంతమగు వివిధ తీర్థములందు మునుగుటవలన గలిగెడి ఫలము గురుపాదోదక తీర్థఫలమునందలి వేయింట నొక భాగమునకు సాటిరాదని శాస్త్రములందు విశ్రుతము. ఇంతేగాక సత్యము, క్షమ, యింద్రియ నిగ్రహము, సర్వభూతదయ, ఆర్జవము మొదలగు సద్గుణములు ఆంతరతీర్థములు. ఇవియన్నియు సర్వవర్ణాశ్రమములకును సాధారణ మగు ధర్మములు. ఇట్టి సత్కర్మములను మరియు పరమేశ్వరధ్యాన రూపమగు ఉపాసనయును చేయదగియున్నది యని ఆది పదమున ఆచార్యుల వారు సూచించి యున్నారు. ఈశ్రౌతస్మార్తరూపమగు తపో యజ్ఞ దానాదికముల అనుష్ఠానముచే బుద్ధి శుద్ధము కాగలదు. నామస్మరణచే మలదోషము తొలగును. ఉపాసనవలన చిత్త చంచలమను విక్షేపదోషము నివర్తించును.

శంక:- కర్మవలన పితృలోకప్రాప్తియని వేదము చెప్పినది. అందుచే కర్మ వలన అంతఃకరణశుద్ధి యేర్పడు ననుట సరిగాదు.

సమా:- సకామబుద్ధితో చేసిన కర్మలవలన ఉత్తమలోకప్రాప్తియని వేదము చెప్పినది. ఆమాట నిష్కామకర్మలను గూర్చికాదు. మరియు **'ధర్మేణ పాప మపనుదతి'** అను శ్రుతి వాక్యమునుబట్టి ధర్మానుష్ఠానముచే పాపరూపమలము తొలగునని తీర్మానము. కావున తపో యజ్ఞ దానాది కర్మములు నిష్కామబుద్ధి కల వానికి అంతఃకరణశుద్ధి కల్గించుటకు సాధనములై యున్నవి. **"యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం"** అని భగవద్గీతకూడ ప్రతిపాదించినది. అంతః కరణశుద్ధిచే జ్ఞానమును, జ్ఞానమూలమున మోక్షమును చేకూరును.

శంక:- జనకాదులకు కర్మమువలననే సంసిద్ధియని గీతాశాస్త్రము చెప్పినది. అందుచే ముముక్షువులగు వారికి కర్మములవలనే మోక్షము చేకూరుచుండ జ్ఞానముతో పనియేమి?

సమా:- వేదము **"న కర్మణా న ప్రజయా"** యని కర్మములవలన మోక్షము లేదని స్పష్టముగ చెప్పినది. శాస్త్రమునందు చెప్పిన సంసిద్ధి శబ్దమునకు అర్థము అంతఃకరణ శుద్ధియెగాని మోక్షము కాదు.

మరియు కర్మములవలన కలుగు ఉత్పాద్య ప్రాప్య సంస్కార్య వికార్య రూప ఫలములు అనిత్యములై యున్నవి. అట్లే మోక్షము కూడ కర్మఫలముగని అంగీకరించినచో అదియు అనిత్యమె కాగలదు. ఏకభావికవాదులను కొందరు కర్మవాదులు కామ్యనిషిద్ధములను విడిచి నిత్యనైమిత్తిక కర్మల ననుష్ఠించుటచే మోక్షము కల్గు ననియు, పునర్జన్మ కలుగదనియు చెప్పుదురు. కాని వారివాదము భాష్యమునందును నైష్కర్మ్యసిద్ధియందును ఖండింపబడినది. కాబట్టి ముముక్షువులు కర్మవలన చిత్త శుద్ధినెకాని మోక్షమును పొందలేరు. అందుచే మరొక్క శాస్త్రమునందు **"చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే"** (వివేక. 11) అని చెప్పబడినది. కర్మయోగి శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధీంద్రియముల చేతను చేయు కర్మము చిత్త శుద్ధిని కలిగించుచున్నది. కర్మము లన్నియు అంతఃకరణశుద్ధికె హేతువులని శాస్త్రము పేర్కొన్నది. చిత్తశుద్ధిమూలమున వివిదిషత్వము సిద్ధించును. అంతట వైరాగ్యము చేకూరును. క్రమముగ సాధన చతుష్టయ సంపత్తి కలుగును. అంతట తత్త్వజ్ఞానమును ఆపై మోక్షమును లభించును.

పూర్వము చెప్పిన తపోయజ్ఞదానాది కర్మములు వివిదిషత్వమునకు హేతువులని వేదమె చెప్పినది. **"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన"** (బృ-ఉ-6-4-22)= బ్రాహ్మణుడు యజ్ఞమువలనను, దానమువలనను, తపస్సువలనను, అనాశకము వలనను వివిదిషు డగుచున్నాడు. (తెలియవలెనను ఇచ్ఛను వివిదిష యందురు) నిషిద్ధానిషిద్ధములను సేవింపక యుండుట అనాశక మనిపేరు లేదా అహింసావృత్తికి పేరు అనాశకము. యజ్ఞాదుల

అర్థము వెనుకనె చెప్పబడినది. ఇట్టి కర్మము వివిదిషతకు కారణమై యున్నది. ఈశ్వరుడు ఎవనియెడ ప్రసన్ను డగునో వానికి వైరాగ్యమనెడి ఫలము చేకూరును. ఈశ్వరార్పితముగ చేసిన కర్మములయొక్క ఫలము వైరాగ్యమేనని వ్యాసులవారు సెలవిచ్చియున్నారు. జిహాస యనుమాటకు అర్థము వైరాగ్యము, ఈ లోకము యొక్క, పరలోకముయొక్క భోగములు దుఃఖ దాయకములని తలంచి వాటి యందలి త్యాగబుద్ధియె జిహాస యనబడును.

శంకః- అందరు భోగములనె అపేక్షింతురు. కాబట్టి భోగముల నన్నింటిని వదలుట శక్యమైనపని కాదు.

సమాః- నిజమే, మలినమగు అంతఃకరణముతో కూడియుండుటం బట్టి మూఢులు విషయభోగములను త్యజింపనొల్లరు. కాని శుద్ధచిత్తులగు ముముక్షువులు భోగాశయములను వీడగల్గుదురు. ఈ విషయమున **"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్"** (ముండక) అని శ్రుతికూడ కలదు. బ్రహ్మజిజ్ఞాసువు కర్మరచితములగు స్వర్గాదిలోకములను విమర్శించి వైరాగ్యమును పొందుచున్నాడని దాని యర్థము. ఈ వైరాగ్యమును పొందుటయె నిజమునకు ఈశ్వరానుగ్రహమునకు ఫలము. భోగైశ్వర్యములను పొందుట యీశ్వరానుగ్రహఫలము కాదు. ఇంతకూ నిష్కర్ష యేమనిన యీశ్వరార్పిత కర్మములవలన చిత్తశుద్ధి యేర్పడును. తదుపరి వైరాగ్యము కలుగును.

## వైరాగ్యవర్ణనము

"విరక్తో నృపాదౌ" అని మూలమున చెప్పబడినది. అనగా రాజు మొదలుకొని బ్రహ్మపర్యంతములైన వివిధ పదవులయందు తుచ్ఛత్వనిశ్చయము చేసి శుద్ధ చిత్తు డగు జిజ్ఞాసువు విరక్తు డగుచున్నాడు. వైరాగ్యము ప్రకటమగు వఱకు జిజ్ఞాసువు అవశ్యము కర్మములను చేయదగియున్నది. మనస్సు దుర్వాసనలకు దూరమైనపుడు సంసారభోగములందు విరక్తి కలిగినప్పుడు బుద్ధి శుద్ధమైనదిగ తలంచవలసి యున్నది. అందుచే వైరాగ్యోదయ పర్యంతము కర్మలు కర్తవ్యములై యున్నవి. **"తావత్కర్మాణి కుర్వీత న నిర్విద్యేత యావతా"** అని భాగవతము

చెప్పినది. మరియు "సన్న్య స్య శ్రవణం కుర్యాత్" చిత్తశుద్ధియైన పిమ్మట కర్మసంన్యాసమును గ్రహించి వీతరాగుడగు జిజ్ఞాసువు వేదాంతశ్రవణ మొనర్పదగియున్నదని పైవాక్యమున కర్థము. అందుచే మలవిక్షేపముల నివృత్తి పర్యంతము కర్మోపాసనారూపమగు బహిరంగసాధనములు కర్తవ్యములు. అటుపై కర్మత్యాగమున అంతరంగ సాధనముల నాశ్రయించి తత్త్వ జ్ఞానమును సంపాదించవలెను.

శంక:- జీవించి యున్నంతవరకు అగ్నిహోత్రాది కర్మల నాచరింపవలెనని వేదము శాసించినది. అందుచే కర్మములను త్యజింప నెవ్వనికిని వీలులేదు. మరియు జ్ఞానకర్మములు రెండును చేరి మోక్షమునకు కారణమని చెప్పుదురు. శ్రుతిస్మృతులందు పలుచోట్ల సముచ్చయము ప్రసిద్ధమై యున్నది. ఇన్నింటిని బట్టి కర్మము సదా కర్తవ్యమై యున్నది.

సమా:- జీవిత పర్యంతము కర్మములనె ఆచరింపదగియున్నదని బహిర్ముఖత్వము కలిగియున్న వారికి కర్మములందు ప్రవృత్తి కలుగుటకై వేదము చెప్పినది. చిత్తశుద్ధిని పొందినవారిని గూర్చి నివృత్తి మార్గమే శ్రుతి చెప్పినది. అదియునుగాక జ్ఞానకర్మములకు విరోధము సహజము కాబట్టి ఆ రెంటికిని సముచ్చయము పొసగుట కల్ల. ఆ సముచ్చయ వాదమున సూత్రకారులగు వ్యాసులును, భాష్యకారులగు శంకరులును పలుతావుల ఖండించియున్నారు. మరియు రామగీతయందును సముచ్చయవాద ఖండనము స్పష్టము. అయితే శ్రుతిస్మృతులందు కానవచ్చు కర్మ జ్ఞానసముచ్చయము సమసముచ్చయము కాదు. క్రమసముచ్చయము.

ఇట్లు క్రమముగ నిష్కామకర్మఫలమువలన చిత్తశుద్ధి, చిత్తశుద్ధి వలన వివిదిష, అనగా విషయవైరాగ్యము, అంతట సాధన చతుష్టయము సిద్ధించును. అపై జిజ్ఞాసువు కర్మత్యాగము నొనర్చి తత్త్వవిచారము చేయదగియున్నది.

**"అథాతో బ్రహ్మజిజ్ఞాసా"** యనెడి వ్యాస సూత్రమునుబట్టి సాధన చతుష్టయ ప్రాప్తికి పిదప ఉత్కటమగు జిజ్ఞాసతో బ్రహ్మవిచారము చేయదగియున్నది. ఈ సాధన చతుష్టయము ఈశ్వరార్పిత కర్మమువలనను, ఈశ్వరానుగ్రహము వలనను సిద్ధించును. వర్ణాశ్రమ ధర్మపరిపాలనమువలనను, తపస్సువలనను, సర్వభూత

దయాలక్షణము వలనను, పరితోషణ ధర్మమువలనను పురుషులకు వైరాగ్యాది సాధన చతుష్టయము సిద్ధించునని మరొక్కశాస్త్రము నుడివినది.

## సాధన చతుష్టయ వివరణము

1. వివేకము 2. వైరాగ్యము 3 శమాదిషట్సంపత్తి 4. ముముక్షుత్వము.

### 1. వివేకము

ఆత్మ నిత్యుడు, సుఖస్వరూపుడు. అతనికి భిన్నమగు దృశ్య జగత్తంతయు అనిత్యమును దుఃఖరూపమునై యున్నది. ఇట్లు తెలిసికొనుటకు వివేక మనిపేరు. ఈ వివేకమువలన వైరాగ్యము పుట్టును. అనిత్యమని దుఃఖరూపమని నిశ్చయించిన వస్తువులందు హేయబుద్ధి, త్యాగబుద్ధి సంభవించుట సహజము. ఎండ మావుల యందలి నీటిని, విషమిశ్రితాన్నమును మిథ్యయని, దుఃఖప్రదమని తెలియుటచే వాటియందేర్పడు హేయబుద్ధివలె విషయభోగములందు కూడ నానాదోషములను దర్శించుటచే జిహాస జనించును.

### 2. వైరాగ్యలక్షణము

బ్రహ్మలోకపర్యంతము కానవచ్చు వివిధభోగభోగ్యములను కాకమలము వలె శునకవమనమువలె త్యాగము చేయు ఇచ్ఛను వైరాగ్య మందురు. ఈవైరాగ్యము నిర్మలమని, తీవ్రతరమని, వశీకారమని ముత్తెఱగు. దీని విశేష స్వరూపమును, హేతువును, ఫలాదులను మరియు అవాంతర వైరాగ్యభేదములును మున్ముందు వివరింపబడును.

### 3. షట్సంపత్తి వివరము

1. శమ 2. దమ 3. ఉపరతి 4. తితిక్షా 5. శ్రద్ధా 6. సమాధానములు-షట్సంపదలు.

**శమము:-** వాసనాత్యాగమే శమమని చెప్పుదురు. సూక్ష్మసంస్కారములనె వాసన లందురు. వాటిని తిరస్కరించుటయే వాసనాత్యాగము. వ్యాకరణపద్ధతిలో శమ

మనిన చిత్తోపశమమునకు పేరు. దీనికి శాంతి యనుపేరు స్మృతి చెప్పినది. మనో నిరోధమే శమమని శాస్త్రములు చెప్పినవి. నిరోధమనిన సంయమము.

**దమము:-** బహిర్ముఖములగు ఇంద్రియములను నిగ్రహించుటను దమమని చెప్పు దురు. యోగశాస్త్రమందు దీనిని ప్రత్యాహారమని చెప్పుదురు. శ్రుతియందు దీనికి దాంతి యనిపేరు. ఇంద్రియ నిరోధము మనోనిరోధమున కధీనము. రథమునకు పూన్చిన గుఱ్ఱములు పగ్గములచే నిరోధింపబడుచున్నవి. శరీరము రథమనియు, ఇంద్రియములు గుఱ్ఱములనియు, మనస్సు పగ్గమనియు, బుద్ధి సారథి యని శ్రుతి చెప్పినది. దక్షుడగు సారథి పగ్గములను బిగియబట్టి కుడి యెడమలకు తూగిపడు గుర్రములను చక్కని క్రమమార్గమున నడిపించునట్లు వివేకయుక్తమగు బుద్ధి మనస్సును నిరోధించి యింద్రియములను విషయము అందు దొర్లిపడనీక మోక్ష మార్గమున నడిపించుచున్నది.

**ఉపరతి:-** విషయములనుండి విముఖమగు వృత్తి ఉపరతియని చెప్పబడును. విషయములందును, వాటి సాధనములగు కాంతాదికములందును అత్యంత తిరస్కార మేర్పడుట ఉపరతి యనిపించుకొనును. లేదా సాధనసహితమగు కర్మ సన్న్యాసము ఉపరతి నాబడును.

**తితిక్ష:-** శ్రవణాది సాధనములం దేర్పడు చలి ఎండ ఆకలి దప్పి మొదలగు ద్వంద్వ బాధల వలన కలగుండుపడక వాటిని సహించుట తితిక్ష యనబడును.

**శ్రద్ధ:-** వేదవాక్యములందు, గురువాక్యములందు విశ్వాస ముంచుటను శ్రద్ధ యందురు. సత్యత్వబుద్ధియె విశ్వాసము నాబడును. జిజ్ఞాసువు శ్రద్ధను అవశ్యమార్జింప వలెను. **"శ్రద్ధాభక్తి ధ్యానయోగాదవేహి"** శ్రద్ధాభక్తిధ్యానయోగముల మూలమున తెలియదగియున్నదని జ్ఞానప్రాప్తికి శ్రద్ధను విధించియున్నారు. **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"** శ్రద్ధావంతుడు జ్ఞానమును పొందుచున్నాడని భగవద్గీతకూడ పేర్కొన్నది.

**సమాధానము:-** చిత్తమును శుద్ధబ్రహ్మమందైనను, శ్రవణమందైనను స్థాపించుట సమాధాన మందురు. ఆధానమనిన స్థాపించుట. సమ్యక్ ఆధానము సమాధానము సమాధానము కల్గినవానికి సమాహితుడను పేర వేదము సంబోధించినది.

## 4. ముముక్షుత్వ లక్షణములు

పరమానందరూప బ్రహ్మప్రాప్తియు, కారణసహిత జగదనర్థ నివృత్తియూ, మోక్షమని చెప్పబడును. దానిని గూర్చిన యిచ్ఛయే మోక్షేచ్ఛ యని లేదా ముముక్షుత్వమని  చెప్పబడును. ఆముముక్షుత్వము 1. మంద 2. మధ్యమ 3. తీవ్ర భేదములచే మూడువిధములు. అందు తీవ్రేచ్ఛచే వెంటనే ఫలము లభించును. ఆయిచ్ఛ మంద మధ్యమ మైనచో గురుసేవాదికములవలన వారి ప్రసాదమువలన పరిపక్వమై క్రమముగ ఫలించును.

ఈ నాల్గుసాధనములతో గూడియుండినవాడు జ్ఞానాధికారి యనిపించు కొనును. వాడె సన్నిష్ఠుడు నాబడును. అవి సిద్ధించనివాడు సన్నిష్ఠుడు కాజాలడు. ఇట్లు అన్వయవ్యతిరేక విచారమువలన సాధన చతుష్టయమును సంపాదించుటకు జిజ్ఞాసువు కడంగవలెను.

ఇట్లు సన్నిష్ఠ డగువాడు చక్రవర్తి పదము మొదలుకొని హిరణగర్భుని ఐశ్వర్యము వరకు గల సకల సంసార సుఖములను తుచ్ఛమని నిరసించును.

శంక:- ఈ లోకవిషయములను తుచ్ఛమనుట చెల్లును. కావున త్యజింపను కూడ తగియున్నవి. కాని హిరణ్యగర్భుని భోగైశ్వర్యములు ఉత్కృష్టము లైనవి. వాటిని తుచ్ఛ మనుట గాని త్యజించుట గాని తగదు.

సమా:- ఈ లోకమువలె పరలోకముకూడ కర్మరచితమై యున్నందున క్షయశీల మైనదే యని శ్రుతిలిఖితము. ఆబ్రహ్మభువనాది లోకములు పునరావృత్తి సహితములని స్మృతికూడ చెప్పినది. **"సర్వమేవ దుఃఖం వివేకినః"** యని పతంజలి సర్వభోగములును వివేకులకు దుఃఖరూపములే యని చెప్పినాడు. ఇంద్రలోకము నందలి మహాదుఃఖములకంటె ప్రజాపతిలోకమందలి దుఃఖములు మరింత హెచ్చు లని ఒకానొక శాస్త్రవచనము. ఇట్లు పలువిధ ప్రమాణములనుబట్టి దృష్టాదృష్ట భోగము లన్నియు దూషితములై యున్నవి. అందునను జలాంశరూపమగు విషయము మహాదుష్ట మైనది.

మృగజలము ఎదుట స్పష్టమై యున్నను దానిని మిథ్య అని నిశ్చయించి యుండుటంబట్టి అందలి నీటికొరకై ప్రయత్నించుట లేదు. అట్లే జగత్తు ప్రత్యక్షముగ తోచుచున్నను బ్రహ్మమునందు కల్పితమైనదిగ ఎఱింగిన విద్వాంసునకును దానియందు పురుషార్థబుద్ధివలన ప్రవృత్తి యేర్పడదు. త్రాడునందు సర్పమువలె అమలావ్యక్తరూప బ్రహ్మమునందు జగత్తు మిథ్య యనియు, వస్తుతః లేనిదనియు తెలియుటచే ప్రత్యక్షముగ కానవచ్చుచున్నను విశ్వమునకు విలయ మేర్పడుచున్నది. ఇట్లు శుద్ధబుద్ధియు విరక్తుడు నగు అధికారి తత్త్వజ్ఞానమువలన సర్వవిధిప్రత్యయ గోచరప్రపంచమును అధిష్ఠానబ్రహ్మము నందు బాధాలక్షణ పరిత్యాగమున ఏతత్త్వమును పొందుచున్నాడో అట్టి త్రికాలా బాధ్య పరబ్రహ్మము నేనే అయి ఉన్నాను.

ఇచ్చట అధికారికి తత్త్వప్రాప్తి చెప్పబడినది. అనారోపిత వస్తువునకు తత్త్వ మనిపేరు. అదియే బ్రహ్మమని చెప్పబడును. ఆబ్రహ్మప్రాప్తి యనిన నాకంటె బ్రహ్మము వేరుగ లేదు. అదియే నే ననెడి సాక్షాత్కారము. దానిచే అనర్థనివృత్తియు పరమానందప్రాప్తియు చేకూరుచున్నది. ఆ విషయమున **"బ్రహ్మవిదాప్నోతి పరం తరతి శోకమాత్మవిత్"** అనెడి శ్రుతులు ప్రమాణములై యున్నవి.

శంక:- స్వర్గాదులు అప్రాప్తములు. వాటిని పొందుటయనిన సంగతమై యున్నది. కాని నిత్యప్రాప్తమై యున్న బ్రహ్మప్రాప్తి పొందుటయని చెప్పుట యెట్లు సంగతము?

సమా:- కరకంకణన్యాయమున దశమపురుష దృష్టాంతమువలె ప్రాప్తికి కూడ ప్రాప్తి తగియున్నది. ఇందు అసంగత మేమియు లేదు.

ఈశ్లోకమున నాల్గవచరణమునందు చెప్పిన **"పరం బ్రహ్మ నిత్యం తదే వాహమస్మి"** యనెడి వాక్యముచే ఆచార్యులవారు తమ అనుభమును గోచరింప చేసి మహావాక్యముయొక్క అఖండార్థమును జిజ్ఞాసువులకు గుర్తింపజేయుచున్నారు.



## రెండవ శ్లోకము

**అవతారిక:-** మొదటి శ్లోకమునందు అధికారికి కల్గు పరమతత్త్వప్రాప్తిని గూర్చి చెప్పియున్నారు. అదియు గురూపదేశ పూర్వకముగ శ్రవణ మనన నిది ధ్యాసనలచే ఏర్పడును. అటుగానిచో పరమతత్త్వప్రాప్తి సంభవింపనేరదు. ఆ గురుభక్తి పూర్వక జ్ఞానసాధనములనే ఈరెండవ శ్లోకమున పేర్కొనుచున్నారు.

మూ॥శ్లో॥ దయాలుం గురుం బ్రహ్మనిష్ఠం ప్రశాంతం
సమారాధ్య భక్త్యా విచార్య స్వరూపమ్ ।
యదాప్నోతి తత్త్వం నిదిధ్యాస్య విద్వాన్
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి ॥ 2

టీక॥ దయాళుం = కరుణామయుడును, బ్రహ్మనిష్ఠం = బ్రహ్మనిష్ఠా గరిష్ఠ డును, ప్రశాంతం = ప్రశాంతుడును అగు, గురుం = గురువును, విద్వాన్= విద్వాంసుడు, (వేదాధ్యయన సంపన్నుడగు శిష్యుడు) భక్త్యా = నిండుభక్తిచేత, సం+ఆరాధ్య = బాగుగా సేవించి (సంతోషపరచి), స్వరూపం = బ్రహ్మ స్వరూపమును విచార్య విచారించి. నిదిధ్యాస్య = నిదిధ్యాసమున (బ్రహ్మనిష్ఠ యందు) నిలిచినవాడై, యత్ = ఏ, తత్త్వం = పరమాత్మస్వరూపమును, ఆప్నోతి= పొందుచున్నాడో, తత్ = ఆ, నిత్యం = నిత్యమైన, పరం = సర్వశ్రేష్ఠమైన, బ్రహ్మ+ఏవ= బ్రహ్మమే అహం = నేను, అస్మి = అగుచున్నాను.

తా॥ దయామయుడును, బ్రహ్మనిష్ఠుడును, ప్రశాంతుడును నగు గురువును చక్కగ సేవించి స్వరూప విచారమువలనను, నిదిధ్యాసవలనను విద్వాంసు డే తత్త్వమును పొందుచున్నాడో, అట్టి నిత్యనిరతిశయ పరబ్రహ్మమే నేనై యున్నాను.

## గురుపదార్థ వివరణము

జిజ్ఞాసువు పరమతత్త్వప్రాప్తి కొరకు శరణు పొంది సేవింపదగిన గురువు యొక్క లక్షణమును, గురుపదమునకు అర్థమును చెప్పుచున్నారు.

గుకారము అంధకారవాచకము. రుకారము దానిని నిరోధించెడి తేజోవాచకము. ఆగుకార రుకారముల సమానాధికరణము వలన ఐక్యార్థము గలది పరబ్రహ్మమై యున్నది. గురుశబ్దమువలన నదియే తెలిసికొనదగియున్నది.

లేదా అన్నింటికంటె అధికమై యుండు వస్తువునకు గురు వనిపేరు. అట్టివాడు ఆత్మయే. అట్టి ఆత్మను పొందించువాడు కూడ గురువని చెప్పబడును.

తుచ్ఛరూపమగు అజ్ఞానము లఘువని చెప్పబడును. అలఘుత్వమును నివృత్తి చేయువాడు గురు వనబడును. ఇట్లు బ్రహ్మవిద్య నుపదేశించెడి బ్రహ్మవిదుడగు మహాత్ముడు గురువని చెప్పబడును. అతనిగూర్చిన విశేషములను చెప్పుచున్నారు.

ఆ గురువు దయాలువు. పరుల దుఃఖములను సహింపజాలమిని దయ యందురు. దానిని కల్గియుండువారు దయాలురని చెప్పబడుదురు. సర్వభూత హితుడును, బ్రహ్మవిదుడును నగు నిట్టి గురుదేవుడు జన్మ మరణ సంసార దావానలమున తప్తులగు జనులకు శాంతి నొడగూర్చును. ఆదయ కూడ నిర్హేతుక మైనది. ఇట్టి అవ్యాజదయా సముద్రుడగు గురుడు లోకమున దుర్లభుడు.

మరియు విత్తాపహారులగు గురువులు పెక్కురు గలరు. శిష్యుని హృత్తాపమును హరింప గల గురువులు లోకమున నరిదియని పరమేశ్వరుడు పార్వతితో సెలవిచ్చినాడు. నిస్పృహుడగు గురువుమూలమున తప్ప నిరపేక్ష మగు బోధ సిద్ధింపదు అని శాస్త్రములందును సుప్రసిద్ధము. అందుచే నిస్పృహుడును హితము నుపదేశించు వాడును, దయామయుడునగు దేశికునివలననే ముముక్షువునకు అభిమతప్రాప్తి చేకూఱగలదు. "ఆత్మానమేవ సర్వత్ర దయాం కుర్వంతి సాధవః" అని వేరొక్క శాస్త్రమున చెప్పబడియున్నది.

ఆ గురువు బ్రహ్మనిష్ఠుడు. అపరిచ్ఛిన్న వస్తువునకు బ్రహ్మ మనిపేరు.ఆ

బ్రహ్మమునందు స్థితి గలవాడు బ్రహ్మనిష్ఠుడు. ప్రత్యగభిన్న బ్రహ్మముయొక్క దృఢానుభవ మెవ్వని కేర్పడినదో వానికే బ్రహ్మనిష్ఠుడను పేరు తగినది. ఈ బ్రహ్మ నిష్ఠత్వలక్షణము శ్రోత్రియత్వమునకు ఉపలక్షణము. శ్రుతియందు శ్రోత్రియుడును బ్రహ్మనిష్ఠుడును అని రెండు లక్షణములు గలవాడును గురువని చెప్పబడినది. **"తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"=** ఆజిజ్ఞాసువు స్వరూపసాక్షాత్కారలక్షణ విజ్ఞానముకొరకు చేతియందేదైన నిర్మల మగు పదార్థములను గ్రహించి శ్రోత్రియుడును, బ్రహ్మనిష్ఠుడును నగు గురువు యొక్క సమీపమునకు పోవలెనని పై శ్రుతియొక్క అర్థము. ప్రమాణ కుశలునకు శ్రోత్రియుడనిపేరు. ప్రమాణమనుపేరు వేదమునకు తగినది. దాని యర్థమునందు నిష్ణాతు డగువాడు శ్రోత్రియుడని చెప్పబడును. ప్రత్యక్ష అనుమానాదికములను సైతము ప్రమాణములని చెప్పుదురు. కాని యవి ప్రమాణాభాసములు. ఎందుకనిన అవియన్నియు ప్రతిభాస మాత్రములైజ్ఞాతసత్తగల అనాత్మపదార్థములను విషయీకరించెడి జ్ఞానమునకు సాధనములు కావు. అజ్ఞాతార్థజ్ఞాపకత్వ (తెలియని వస్తువును తెలియజేసెడి) ప్రమాణలక్షణము వేదమునందే సంభవించుచున్నది. అందుచే పరమ ప్రమాణము వేదమని చెప్పబడినది. ఆవేదార్థమును చక్కగ తెలిసికొన్నవాడు శ్రోత్రియుడు నాబడును. ఇట్లు అధీతవేదుడును బ్రహ్మనిష్ఠుడును నగు వానినే గురువని శ్రుతి చెప్పినది.

వేదములను చదివిన వాడయ్యును బ్రహ్మనిష్ఠుడు కానివాడు గురువు కాజాలడు. తనతాపమును తానె తీర్చుకొనజాలనివాడు పరులతాపము నెట్లు తీర్చ జాలును? తక్కినవారికంటెకూడ శ్రోత్రియు డగువానికి తాపమధికమని ఛాందోగ్యో పనిషత్తునందు నారదుడు తన అనుభవమును చెప్పియున్నాడు. అందుచే కేవల శ్రోత్రియుడు ఆచార్యుడు కాజాలడు.

కేవలము బ్రహ్మనిష్ఠుడై వేదజ్ఞానము లేనివాడును ఆచార్యపదవికి తగడు. శిష్యుని చిత్తమందుదయించు నానాభేద భ్రమలను నివారించుటకు ఇతడు సమర్థుడు కాజాలడు. భేదములు అయిదు విధములుగను, భ్రమలు అయిదు విధములుగను నున్నవి. వాటి ఉపపాదనయు నిరాకరణమును ముందు రాగలదు. అందుచే కేవల

బ్రహ్మనిష్ఠుడును గురువు కాజాలడు. ఆ బ్రహ్మనిష్ఠుడు తాను ముక్తుడైనను, ఉత్తమసంస్కారము గల జిజ్ఞాసువు లందరికిని సంశయ పరిహార పూర్వకముగ బోధించుటకు యోగ్యుడు కాడు. శ్రోత్రియత్వ, బ్రహ్మనిష్ఠత్వ లక్షణములు రెండును చేకూరియున్నచో గురువని చెప్పనర్హుడు. వాని వలన ముముక్షువు తనవాంఛి తార్థమును సిద్ధింపజేసికొనగల్గును. నదిని దాటి గమ్యస్థానమును చేరవలెనన్న కుంటివాడైనను, గ్రుడ్డివాడైనను యోగ్యుడు కాజాలడు. కన్నులు కాళ్లను కలవాడే అందుకు తగును. అట్లే శ్రోత్రియుడును బ్రహ్మనిష్ఠుడును నగు గురువే సంసార మను నదిని గడచి పరబ్రహ్మస్థానమును గుర్తింపగలడు.

## ప్రశాంత పదమునకు అర్థము

ఆ గురువు ప్రశాంతుడు. కల్లోలము లేని బ్రహ్మనిష్ఠునకు ప్రశాంతుడని పేరు. కల్లోలమునకు (క్షోభకు) కారణములు పెక్కులు. అధ్యాత్మాదులు, విద్యా భ్యాసముయొక్క విస్మరణాదికములు, రజస్తమోగుణ సంబంధమగు కామక్రోధా దుల సంభవము, కర్తవ్యాకర్తవ్యములను గూర్చిన సందేహములు- ఇట్లు వివిధము లచే తాపము జ్ఞానహీనునకు ఏర్పడుచున్నది. బ్రహ్మనిష్ఠున కట్టి పరిస్థితి లేదు. అందుచే వాడు ప్రశాంతుడు.

అధ్యాత్మాది తాపములు ప్రసిద్ధములు. విద్యాధ్యయనమున కల్గు తాపములు- అభ్యాసము, విస్మరణము, మానభంగము, గర్వమునని నాల్గు తెరగులు. రజస్తమో గుణములవలన నేర్పడు కామాది తాపములు లోకమునందును శాస్త్రమునందును ప్రసిద్ధములు. వీటి క్షోభ లేనివాడు సుఖియై యుండగలడు. కర్తవ్యాకర్తవ్యతాపము అజ్ఞానిని మాత్రము వేధించును. జ్ఞానిని బాధించజాలదు. ఈప్రశాంతపదము వలన బ్రహ్మనిష్ఠునకు కలుగు జీవన్ముక్తి సంబంధ మగు వృత్తిజన్యవిశేష సుఖానుభూతి సూచింపబడినది. శాంతి సుఖమునకు అభి వ్యంజకము. శాంతి లేనివానికి సుఖము లేదని భగవంతుని వాక్యము. ప్రశాంతు డగువానికి ఎల్లయెడల సుఖమే తాండవించును. ఇట్లు దయాలుడు బ్రహ్మనిష్ఠుడు ప్రశాంతుడును నగు గురువే జ్ఞానదాన మొనరింప సమర్థుడు.

## గురుభక్తి

ప్రేమ విశేషమునకు భక్తి యనిపేరు. ఆరాధించుట యని సేవించుట యని, అర్థము. ప్రేమసహితముగ గురువును సేవించువానికి దృష్టాదృష్టమగు ఉభయఫల ప్రాప్తి కలుగును. గురుసేవవలన కలుగు ధర్మోత్పత్తి అదృష్టఫలమని చెప్పబడును. జ్ఞానోత్పత్తి యగుట దృష్టఫలమని చెప్పబడును. గురుభక్తిహీనునకు సద్విద్య లభింప జాలదు. అందుచే విద్యాప్రాప్తికి ఈశ్వరగురుభక్తియె అంతరంగసాధనము. **"యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ"**= ఎవ్వనికి దేవునియందు పరాభక్తి కలదో, అట్లే గురువునందును భక్తి గలదో, ఆవివేకవంతునకే వేదప్రతిపాదితములగు అర్థములు గోచరము లగుచున్నవి అని శ్రుతిచెప్పినది. ఈ అభిప్రాయము ననుసరించి విశేషగురుభక్తి మాహాత్మ్యమును విస్తరించి శ్రీశంకరానందస్వామివారు తమ ఆత్మపురాణమున వ్రాసియున్నారు.

## గురుసేవ

ముముక్షువు కల్లకపటము లేని నిష్కామబుద్ధితో ప్రీతిపూర్వకముగ శరీరము, వాక్కు, మనస్సు, ధనములచే గురువును సేవించవలెను.

1. శరీరముచే పాదముల నొత్తుట, పూజించుట, ఆజ్ఞను పాలించుట మొదలగు సేవ చేయవలెను.

2. వాక్కుచే స్తోత్రాదికములను చేయవలెను.

3. మనస్సుచే గురుమూర్తిని ధ్యానించవలెను.

4. ధనాది పదార్థములను గురువునకు సమర్పించవలెను.

శిష్యపద్ధతి ననుసరించి ఎల్ల వేళలను అతని ఆజ్ఞను పాలించవలెను. గురువునందు ఈశ్వరబుద్ధి నుంచవలెను. ఏ సమయమునందుకూడ గురువు నందు మనుష్యబుద్ధి నుంచరాదు అని శాస్త్ర వచనము కూడగలదు. గురువుకడ శిష్యుడు ఎట్లు వ్యవహరింపవలెను, ఎట్లు ప్రశ్నింప వలయుననెడి విషయమును భగవంతుడగు కృష్ణుడు **"తద్విద్ధి ప్రణిపాతేన"** యనెడి శ్లోకమున తెలిపియున్నాడు.

పైప్రమాణములవలన గురువుయొక్క తోడ్పాటు లేక స్వబుద్ధిబలముతో జ్ఞానము కల్గజాలదనియు, జ్ఞానము ఆచార్యాధీనమే యనియు తేలినది.

శంక:- కర్మోపాసనమువలన నిర్మలచిత్తుడగు జిజ్ఞాసువు వాక్యార్థ విచారమును స్వయముగ చేసికొని బ్రహ్మమును తెలిసికొనును. అట్టియెడ గురువుతోడను ఆతని సేవతోడను కల ఆవశ్యకత యేమి?

సమా:- గురువు లేనిదే జ్ఞానము కల్గదు. "ఆచార్యవాన్ పురుషో వేద" యని గురువుయొక్క ఆవశ్యకతను వేదము చెప్పినది. గురువు తోడ్పాటు లేక వేదాధ్యయనము చేయుట సముద్రజలమును పానము చేయుటవంటిది. అందుచే ద్వైతరూపమగు ఉప్పే అనుభవించవలసి యుండును. అదియే గురుముఖమున అధ్యయనము చేసినచో మేఘము నుండి లభించు మధురజలమునువలె అద్వైతామృతమును పానమొనర్ప వీలుగల్గును. గురుసహాయము లేక అన్య సాధనముల నాశ్రయించుట వైద్యుని పాటింపక ధాతుభక్షణ మొనర్చినట్లు కష్టముల పాలగుట నిక్కము. అందుచే మోక్షమార్గమునందు గురుకృపయే ముఖ్యమైనది. గంగాతీరము నందలి బావివలె గురువునెదుట అన్యసాధనములు దుర్బలములు. పండితుడైనను కూడ గురుభక్తి లేనివానికి శాంతి సుఖము లభించుట కల్ల.

"యావదాయుషయో వంద్యాః" అని జీవితపర్యంతము గురుసేవ అవసరమని ఒకానొక శాస్త్రము చెప్పినది. రామకృష్ణాదులు కూడ లోకసంగ్రహార్థమై గురు సేవ నొనర్చియున్నారు. గురు వొనర్చిన మేలునకు బదులు చేయగల్గుట వేరికిని అసాధ్యము. అందుచే సదా విధేయభావమున సేవచేయవలెను. శిష్యుడు తనకృతార్థతకొరకై గురుని సేవింపవలెను. అంతియెగాని తృప్తకాముడగు గురువునకు ఎట్టి అపేక్షయు లేదు. బ్రహ్మవిద్యను ప్రసాదించిన గురుడు సాక్షాత్తు శివరూపుడు. గురు ప్రభావమును గుర్తెఱిగిన వివేకియగు శిష్యుడు ఉపకారస్మరణ పూర్వకముగ "స్వారాజ్య సామ్రాజ్య విభూతిరేషా భవత్కృపాయా మహిమా ప్రసాదాత్" అని గురుని స్తుతించ గలడు. ఇట్టి ఉత్తమ బ్రహ్మవేత్తయగు గురువును వదలి సంప్రదాయ ప్రాప్తుడని తలంచి ద్వైతగురువు నాశ్రయించినవాడు మధురజలమును వీడి తాత గారి బావియనెడి మోహాభివివేశముచే ఉప్పునీటిని త్రాగువానితో

సమానుడు. అది కేవలము దురాగ్రహము మాత్రము. అందుచే ముందు చెప్పినట్లు గురువు మూలముననే అద్వయబ్రహ్మజ్ఞానము సిద్ధించగలదు.

శంక:- గురువు తత్త్వజ్ఞుడు కానిచో వానిచే పరమార్థోపదేశము సంభవించదు. తత్వజ్ఞుడైనచో అతనికి అజ్ఞాననాశమై యుండుటంబట్టి దాని కార్యరూప స్థూల సూక్ష్మ శరీరములతోడి సంబంధముకూడ తప్పిపోయి యుండును. అందుచే వానిచే కూడ తత్త్వోపదేశము ఘటింపదు.

సమా:- సరి. తత్త్వజ్ఞుడు కానివాడు శ్రుతిస్మృతిరూపమగు నేత్రములు లేని వాడు. కావున వానిచే యథార్థోపదేశము సంభవింపదు. శ్రుతిస్మృతుల రెంటికిని విషయము ఒకే అద్వయ బ్రహ్మము. అందుచే **"వేదా బ్రహ్మాత్మవిషయాః"** అని భాగవతము చెప్పినది. రెండు నేత్రములకును ఒకే సూర్యుడు విషయమైనట్లు శ్రుతిస్మృతుల రెంటికిని విషయము ఒకే అద్వయబ్రహ్మము; సూర్యుడు నేత్రములకు ప్రకాశకుడై వాటికి విషయమైకూడ నున్నాడు. అట్లే బ్రహ్మమువలననే శ్రుతిస్మృతులు ప్రకాశితము లగుచున్నవి. వాటికి విషయముకూడ బ్రహ్మమే.

ఇచ్చట ఆవరణ భంగము మాత్రము విషయ మనిపించుకొనును. ఈ విచారము ముందు రాగలదు. ఇట్టి అద్వయబ్రహ్మవిషయకమగు శ్రుతిస్మృతుల సిద్ధాంతమును తెలియని ఆతత్త్వజ్ఞుడు తత్త్వోపదేశ మొనర్చుటకు సమర్థుడు కాజాలడనుట నిక్కము. కాబట్టి శ్రుతి స్మృతుల నెరిగిన బ్రహ్మనిష్ఠుడే ఉపదేశ మొనర్ప సమర్థుడు. జ్ఞానియైన వానికి అజ్ఞానము నివర్తించుటచే శరీరసంబంధము తప్పిపోవును గదాయని శంకించ బనిలేదు. కారణము నశించినను కార్యము కొంతకాల ముండగల్గును. రజ్జుజ్ఞానమున సర్ప భ్రమ తొలగినను భయకంపాదులు కొంతతడ వున్నట్లు అజ్ఞాననాశ మైననూ పరిశేషమగు ప్రారబ్ధకర్మమువలన శరీరము నిలిచియుండును. అందుచే శిష్యాచార్య సంప్రదాయమునకు విచ్ఛేదము లేదు. ఈ క్రమమున జ్ఞాని శిష్యుల కుపదేశించగలడు.

శంక:- ఆ తత్త్వజ్ఞుడు ద్వైతదర్శి యైనచో అద్వైతోపదేశము సిద్ధింపజాలదు. అద్వైతదర్శియె యైనచో స్వపరభేదదృష్టియె నశించినది. కాబట్టి శిష్యులను గూర్చి ఉపదేశ మొనర్పవీలులేదు.

సమా:- నిజమే. ద్వైత దర్శివలన అద్వైతబోధ సంభవింపజాలదు. వైద్యుడె రోగియైనచో యితరుల రోగబాధనెట్లు నివర్తింపజేయజాలును. అట్లే ద్వైతదర్శియగు వాడు ఇతరులకు అద్వైతమును ఎట్లు దర్శింపజేయజాలును?

అద్వైతదర్శియగు వానికి ద్వైత దృష్టియె ఉండదు. కాబట్టి ఉపదేశించుట సంభవించదు అని శంకించుట తగదు. ధనవంతు డొకడు సన్నిపాతరోగవశమున తాను దాచియుంచిన గుప్తధనమును సైతము చెప్పివేయును. కాని చెప్పితిననికూడ వానికి తెలియదు. అట్లే బ్రహ్మానంద నిమగ్నుడగు బ్రహ్మవేత్త సహజముగ తత్త్వ మును నుడువును. దానిచే ఉత్తమజిజ్ఞాసువు కృతార్థుడు కాగలడు. సిద్ధులవలన ఆత్మగీతను విని జనకచక్రవర్తి కృతార్థుడయ్యెను. అంతరంగమందు దృఢమగు అద్వైతనిష్ఠ కల్గియుండు వానికి శిష్యులు, శాస్త్రశిక్ష మొదలగున వన్నియు ప్రతీతి మాత్రములై యుండును. అట్టి ద్వైతముతో కూడియున్నప్పటికిని దానిని ఆత్మకు వ్యతిరేకముగ చూడడు కాబట్టి బ్రహ్మవేత్తకు ఎట్టిహానియు లేదు.

శంక:- అద్వైతదర్శియగు గురువు శిష్యునకు సగుణ బ్రహ్మోపదేశమును చేయునా? నిర్గుణ బ్రహ్మమును బోధించునా? సగుణ బ్రహ్మముతో జీవునకు అభేదము సిద్ధింపదు. కావున ఆ ఉపదేశము నిష్ఫలము. నిర్గుణబ్రహ్మము వాక్కునకు అతీతము. అది ఉపదేశమున కందదు.

సమా:- బ్రహ్మము వాక్కుకు విషయము కాదనుట నిజమే. అయినను **"అధ్యారోప అపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే"** అనెడి న్యాయము ననుసరించి బ్రహ్మజ్ఞాని తత్త్వము నుపదేశించుటకు సమర్థు డగుచున్నాడు. వస్తువునందు అవస్తువును నిరూపించుట అధ్యారోప మందురు. తిరిగి అవస్తువును వస్తుమాత్ర స్వరూపముగ దర్శించుటను అపవాద మందురు. ఇచ్ఛ మొదలుకొని ప్రవేశపర్యంత మగు ఈశ్వరసృష్టియు, జాగ్రత్త మొదలుకొని మోక్షపర్యంతమగు జీవసృష్టియు మొత్తము బ్రహ్మండము మాయవలన బ్రహ్మమునందు అధ్యారోపితమై యున్నది. నేతి నేతీతి వాక్యములవలన మాయను, మాయాకార్యమును అధిష్ఠాన బ్రహ్మము నుండి నిషేధించి అనిషేధావధిని దర్శించుట అపవాదమని చెప్పబడును. ఇట్లు అధ్యారోపాపవాదములచే నిష్ప్రపంచవస్తువును ప్రపంచించియున్నారు. ఆచార్యులు

ముముక్షువుల బోధకొరకై యిట్లు ఉపదేశక్రమమును కల్పించిరి. అందుచే జ్ఞాని యగు గురువువలన జిజ్ఞాసువునకు తత్త్వజ్ఞానబోధ సిద్ధించగలదు.

శంక:- బ్రహ్మతత్త్వము అతిగోప్యమైనది. దానిని ఎట్టి వారికిని బోధింప దగదని ప్రసిద్ధి గలదు. అట్టిచో జిజ్ఞాసువునకు ఎట్లు చెప్పదగియున్నది?

సమా:- బ్రహ్మజ్ఞాన మతిగుహ్యా మైనది. **"నాపుత్రాయాశిష్యాయ వై పునః"** అని శ్రుతికూడ పుత్రుడు కాని వానికిని, శిష్యుడు కానివానికిని తత్త్వోపదేశమును నిషేధించినది. **"సన్నిద్ధశిష్యాయ శమాన్వితాయ గోప్యమతిబ్రూయాత్"** అనెడి వాక్యానుసారము శమావంతుడు, స్నేహము గలవాడును నగు శిష్యునకు పండితుడు గోప్యతత్త్వమునైనను బోధింపదగియున్నది.

గురుభక్తుడగు శిష్యుడు సమిత్పాణియై బ్రహ్మనిష్ఠుడగు గురువును శరణు బొంది వినియవిధేయతలతో నమస్కరించి యిట్లు ప్రశ్నించుచున్నాడు. "గురుదేవా! నేనెవ్వడను? ఈకానవచ్చు సంసారబంధమునకు కారణమెద్ది? ఈ బంధమును తొలగించుకొను ఉపాయమెద్ది?, గురువు మొదటి ప్రశ్నమునకు సమాధానము చెప్పుచున్నాడు.

"సౌమ్య! ప్రియదర్శనా! దేహత్రయమునకు ద్రష్టయు, అవస్థాత్రయమునకు సాక్షియు, పంచకోశాతీతమును, సచ్చిదానంద బ్రహ్మాభిన్నమగు ప్రత్యగాత్మయే నీస్వరూపము" అని గురువు సర్వవేదాంతసారమును శిష్యున కుపదేశించును. దీనిని విచారించుచుండుటచే బ్రహ్మాత్మైకత్వనిశ్చయ లక్షణమనెడి జ్ఞానముదయించి హృదయగ్రంథిభేదము సిద్ధించును.

## శరీరత్రయ విచారము

ఆత్మ స్థూలదేహమునకంటె భిన్నమైనది

ప్రశ్న:- శరీరత్రయ మననేమి?

ఉత్తరం:- స్థూల సూక్ష్మ కారణములు మూడు శరీరములు

ప్ర:- స్థూలశరీర మననేమి?

ఉ:- పంచీకృత భూతముల కార్యమును, కర్మరచితమును, భోగస్థానమును, ఇంద్రియగోచరమును నగు నది స్థూలశరీరము. పంచీకరణ మొనర్పబడిన భూతములను పంచీకృతభూతమో లందురు.

ప్ర:- పంచమహాభూతము లేవి?

ఉ:- ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి- యీ అయిదింటిని పంచమహా భూతము లందురు.

ప్ర:- వీటి పంచీకరణ మెట్లేర్పడినది?

ఉ:- ప్రత్యేకభూతమును అయిదయిదు భాగములొనర్చి పరస్పరము కలుపుటను పంచీకరణ మందురు. ఒక్కొక్క భూతమును సమానముగ రెండు రెండు భాగములుగ విభజించి ఒక సగభాగమునట్లె యుంచి మరొక్క సగభాగమును నాల్గు నాల్గుగ భాగించి తక్కిన నాల్గుభూతములతోడను కలుపుట పంచీకరణ మనబడును. ఇట్లు పంచీకృతములగు భూతముల వలన స్థూలదేహ మేర్పడినది. ఈస్థూలదేహము ఇరువదియైదు తత్త్వములతో కూడియుండునది.

ప్ర:- ఇరువదియైదు తత్త్వము లేవేవి?

ఉ:- అయిదు భూతములకును ప్రత్యేకము అయిదయిదు తత్త్వములు గలవు. కామ క్రోధలోభ మోహ మాత్సర్యములు, ఆకాశతత్త్వములు. మాత్సర్యస్థానమున కొందరు భయమును చెప్పిరి. ఈకామాది గుణములు అంతఃకరణ పరిణామము లయ్యును వాటి ఆవేశము స్థూలదేహమందు గోచరించుటచే ఇట్లు చెప్పబడినది. మరికొందరు కటియందును, ఉదరమందును, హృదయమందును, కంఠమందును, శిరమందును గల ఆకాశమును స్థానభేదమునే పంచవిధాకాశముగ పేర్కొనిరి.

| | | |
|---|---|---|
| చలన వలన ధావన ప్రసారణ సంకోచములు | - | వాయుతత్త్వములు |
| ఆకలి దప్పి ఆలస్యము నిద్రా కాంతులు | - | అగ్ని తత్త్వములు |
| శుక్ర శోణిత లాలా మూత్ర స్వేదములు | - | జలతత్త్వములు |
| అస్థి మాంసచర్మ నాడీ రోమములు | - | పృథ్వీతత్త్వములు |

ఇట్లు పంచభూతముల సంబంధమగు ఇరువదియైదు తత్త్వములు.

## ఆకాశతత్త్వములు - వాటి సంబంధములు

1. లోభము : ఆకాశముయొక్క ముఖ్యభాగము - శూన్యోదర మగుటచే
2. కామము : వాయువుయొక్క ముఖ్యభాగము - వేగము కలది యగుటచే
3. క్రోధము : అగ్నిసంబంధ ముఖ్యభాగము - దాహమగుటచే
4. మోహము : జలసంబంధము - ద్రవిత చిత్తమగుటచే
5. భయము : పృథ్వీసంబంధము - భయము పార్థివ పదార్థముల వలననే కాబట్టి

లేదా

౧ శరావాకాశము : ఆకాశముఖ్యభాగము - అనాహత శబ్దమునకు స్థాన మగుటచే
౨ కంఠావకాశము: వాయుసంబంధము - ముఖనాసికలందు సంచరించుటచే
౩ హృదయావకాశము : అగ్నిసంబంధము - సదా ఉష్ణస్థితియందుండుట
౪ ఉదరావకాశము : జలసంబంధము - త్రాగేనీటి యందలి దగుటచే
౫ కటి అవకాశము : పృథ్విసంబంధము - గంధస్థానమై యుండుట

## వాయుతత్త్వములు - వాటి సంబంధము

౬ ధావనము : ముఖ్యభాగము - సబలమగుటంబట్టి
౭ ప్రసారణము : ఆకాశసంబంధము - విస్తీర్ణ మగుటంబట్టి
౮ వలనము : తేజస్సంబంధము - ఉత్కృష్టవ్యాపారము కలుగుటంబట్టి
౯ చలనము : జలసంబంధము - శిథిల మగుటంబట్టి
౧౦ సంకోచము : పృథ్వీసంబంధము - జాడ్యస్వభావమగుటంబట్టి

## అగ్నితత్త్వములు - వాటిసంబంధములు

౧౧ క్షుధ : ముఖ్యభాగము - పచనస్వభావము కల్గియుండుటచే
౧౨ నిద్ర : ఆకాశసంబంధము - శూన్యస్వభావము కలది యగుటచే
౧౩ తృష్ణ : వాయుసంబంధము - కంఠాదులను శోషింపజేయుటంబట్టి

౧౪ కాంతి : జలసంబంధము - శీతోష్ణసంబంధముచే కృష్ణలోహితమౌటచే
౧౫ ఆలస్యము : పృథ్వీసంబంధము - జడత కల్గియుండుటచే

## జలతత్త్వములు - వాటి సంబంధము

౧౬ శుక్రము : ముఖ్యభాగము - శుభ్రవర్ణమును, గర్భోత్పత్తికి హేతువౌటచే
౧౭ లాల : ఆకాశసంబంధము - ఊర్ధ్వగమనము కల్గియుండుటచే
౧౮ స్వేదము : వాయుసంబంధము - శ్రమవలన కల్గుటచే
౧౯ మూత్రము : తేజస్సంబంధము - ఉష్ణమై యుండుటచే
౨౦ శోణితము : పృథ్విసంబంధము - రక్తవర్ణ మౌటచే

## పృథ్వీతత్త్వములు - వాటిసంబంధము

౨౧ అస్థి : ముఖ్యభాగము - కఠినమై యుండుటచే
౨౨ రోమము : ఆకాశసంబంధము - ఛేదించుటచే బాధ కాన్పింపమిచే
౨౩ త్వక్కు : వాయుసంబంధము - స్పర్శధర్మము కల్గియుండుటచే
౨౪ నాడి : తేజస్సంబంధము - జ్వరమందు పరీక్షింపబడుటచే
౨౫ మాంసము : జలసంబంధము - ద్రవసహిత మగుటచే

ఇట్లు ఇరువదియైదు తత్త్వములు మిశ్రితమై యున్నవి. అందుచే ఈ స్థూలదేహములో

1. ఏది కఠినమో అది పృథ్వి
2. ఏది ద్రవరూపమో అది జలము
3. ఏది ఉష్ణము కలదియో అది తేజస్సు
4. ఏది సంచరించుచున్నదో అది వాయువు
5. ఏది సుషిరత్వము కలదో అది ఆకాశముగ నెఱుగవలెను.

ఇట్లు పేర్కొనిన పంచీకృత భూతముల కార్యమనదగు ఈ స్థూలశరీరము నీవు కాదు. ఇది జడమును దృశ్యమును వికారియు నగుటచే అనాత్మరూపమై యున్నది. నీవు చేతనుడవు, ద్రష్టవు, నిర్వికారుడ వగుటచే ఆత్మవు.

మరియు నీ దేహము సప్తధాతుమయమును షడ్భావవికార సహితమును దశదోష దూషితమునునై యుండుటచే అభిమానింపదగినది కాదు.

ప్రశ్న:- సప్తధాతువు లననేవి?

ఉ:- 1. రేతస్సు 2. రక్తము 3. మాంసము 4. మజ్జ 5. మేదస్సు 6. అస్థి 7. చర్మము- వీటినే సప్తధాతువు లందురు.

ప్ర:- షడ్వికారము లననేవి?

ఉ:- 1. జన్మము 2. ఉనికి 3. వృద్ధి 4. పరిణామము 5. క్షీణత్వము 6. నాశము- ఈ ఆరును షడ్భావవికారములు, ఇందు వృద్ధివలన బాల్యావస్థయు, పరిణామము వలన యౌవనావస్థయు, అపక్షయము వలన వృద్ధావస్థయు, వినాశమువలన మరణమును తెలియవలెను.

ఈ వికారములు గల స్థూలదేహము ఆత్మ కాదు. "**న జాయతే మ్రియతే వా**" అని ఆత్మ షడ్వికార రహితుడని గీతావాక్యము. ఘటము యొక్క ఉత్పత్తి నాశములు ఘటాకాశమునకు ఎట్లు సంబంధించగలవు?

ప్ర:- దశదోషము లననేవి?

ఉ:- అశుద్ధము (అపవిత్రము) 2. అశౌచము (మలినము) 3. దుర్గంధము 4. అస్థిరము 5. స్థూలము 6. ఖండము 7. దగ్ధము 8. శిథిలము 9. నానారోగగ్రస్తము 10. ఆమిషము అని యివియె పది దోషములు. వీటితో గూడియుండు స్థూల దేహము నీవు గాదు.

ప్ర:- స్వామీ! కొందరు దేహమునే ఆత్మయని తలంతురు. అందుకు తగిన యుక్తి ప్రమాణములను సైతము నుదాహరింతురు. వారి అభిప్రాయ మెట్టిది?

ఉ:- శిష్యా! దేహమును ఆత్మయని తలంచువాడు మహామూఢుడగు అజ్ఞాని.

1. ఆత్మ సదా జ్ఞానస్వరూపుడు, పవిత్రస్వరూపుడు 2. దేహము మాంసమయమును అపవిత్రమునునై యున్నది. అట్టి రెంటిని ఒక్కటిగ జేసి వాడు చూచుచున్నాడు. ఇంతకు మించిన అజ్ఞాన మేమున్నది?

విరోచనమతము ననుసరించిన వారును, మాధ్యమిక చార్వాక లోకాయతాది పామరులును దేహమునే ఆత్మయని తలంచెదరు. తమకను కూలమగు యుక్తులను సైతము వారు చెప్పెదరు. అదంతయు వేదవిముఖమును వివేకదూరమునునైన ప్రసంగము. శ్రుతిస్మృతు లన్నియు ఆత్మను దేహమునకంటె భిన్నముగ ప్రతిపాదించు చున్నవి.

1 పరలోకవాదులకుకూడ దేహమును ఆత్మ యనుట ఇష్టము లేదు. దేహముకంటె ఆత్మ విలక్షణ మనియె చెప్పబడినది.

2 ఇచ్చట చేసిన కర్మఫలము దేహపాత మైననుగూడ ఆత్మను విడిచిపోదు. కావున దేహమునకంటె ఆత్మ విలక్షణమని కర్మకాండయందు చెప్పబడినది.

3 **"న జీవో మ్రియతే అవినాశీ", "న హన్యతే హన్యమానే శరీరే"** యిత్యాది శ్రుతిస్మృతులవలన దేహము నశించినను ఆత్మ నశించ దనుట సిద్ధ మగుచున్నది.

4 దేహనాశము వలన ఆత్మనాశమును సైతము సమ్మతించినచో కృతహాని అకృతాభ్యాగమములను దోషములు ప్రాప్తించును.

5. ఇట్లు శ్రుతిస్మృతుల వలనను అనుకూల తర్కమువలనను ఆత్మ దేహమున కంటె భిన్నుడుగ తేలినది.

అనుమానమువలననూ ఆత్మ దేహముకంటె భిన్ను డనుటయె ఒప్పిదము. ఘటద్రష్ట ఘటమునకు వలె దేహద్రష్టయగు ఆత్మ దేహమునకంటె భిన్నుడు. ఘటమును చూచువాడు ఘటమునకంటె వేరైయె తానెట్లు ఘటము కాడో, అట్లె దేహమును చూచు తాను దేహము కాజాలడు.

ఇంటిలో నుండు వాడు ఇల్లు తానెట్లు కాడో, దేహమునందుండు ఆత్మ దేహము కాజాలడు. కాబట్టి నీవు దేహమే. ఆత్మయనెడి బుద్ధిని విడువదగును.

దేహాత్మ వాదుల సంగము జేయరాదు. **"అసూర్యా నామ తే లోకాః"** అనెడి శాస్త్రవచనము ననుసరించి దేహాత్మబుద్ధి గలవాడు మహాదోషమునకు గురి కాగలడు. అందుచే నీవు బ్రహ్మాత్మబుద్ధిని గ్రహించి, దేహాత్మబుద్ధిని వీడవలసి యున్నది. దేహాభిమానము నివర్తించినంతటనె దానికి సంబంధించిన వర్ణాశ్రమలింగ సంజ్ఞాదికములగు అభిమానములును నివర్తించును. వర్ణాశ్రమాది సంజ్ఞలు స్థూలదేహమునందు సైతము కానవచ్చుట లేదు. అట్టియెడ నవి లింగదేహ మందైనను; ఆత్మయందైనను ఎట్లు వ్యాపించగలవు? మనుష్యత్వాది జాతులును, పురుషత్వాది లింగములును, కేవలము స్థూలదేహమునందే కలవు కాని; సూక్ష్మదేహమునందుగాని, ఆత్మయందు గాని గోచరింపవు. అవియన్నియు స్థూలదేహ ధర్మములెగాని నీధర్మములు కావు. **"వత్త్వం విప్రాదికో వర్ణో నాశ్రమీ నాక్షగోచరః"** అని శాస్త్రము లందుకూడ ప్రసిద్ధము. అందుచే ఆకాశాది పంచభూతములును వాటి కార్యమగు స్థూలదేహమును, వాని ధర్మములగు వర్ణాశ్రమాదులునూ నీవు కాదు. అట్లే సూక్ష్మదేహముకూడ నీవు కాదు.

## ఆత్మ సూక్ష్మదేహముకంటె భిన్నమైనది

ప్ర:- సూక్ష్మశరీర మననేది?

ఉ:- అపంచీకృత భూతకార్యమును, సప్తదశ తత్త్వాత్మకమును, భోగానుభవ సాధనమును, ఇంద్రియగోచరము కానిదియు నగునది సూక్ష్మశరీర మనబడును. (పంచీకరణము చేయని భూతములను అపంచీకృత భూతము లందురు)

ప్ర:- పదునేడు తత్త్వము లననేవి?

ఉ:- పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచప్రాణములు, మనస్సు, బుద్ధి-యివియే పదునేడు తత్త్వములు. తత్త్వమనిన అంశమునకు లేదా భాగమునకు పేరు.

ప్ర:- పంచజ్ఞానేంద్రియము లననేవి?

ఉ:- శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములను పంచజ్ఞానేంద్రియము లందురు. ఈ

ఐదును శబ్దాదివిషయ జ్ఞానమునకు సాధనము లగుటంబట్టి జ్ఞానేంద్రియములని చెప్ప బడినవి. జ్ఞానము సత్త్వగుణమున కలుగును. ఆజ్ఞానేంద్రియముల ఉత్పత్తి **"సత్త్వాంశైః పంచభిస్తేషాం క్రమాద్ధీంద్రియపంచకమ్"** అని పంచభూతముం సత్త్వాంశములచే కలిగినటుల శాస్త్రవచనము కలదు.

ఆకాశ సత్త్వాంశమువలన శ్రోత్రము, వాయువువలన త్వక్కు, తేజస్సు వలన చక్షువు, జలము వలన జిహ్వ, పృథ్వివలన ఘ్రాణము- ఇట్లు జ్ఞానేంద్రియ ములు ఆయా భూతములనుండి పుట్టి ఆయాభూతగుణములను గ్రహించినవి. శ్రోత్రము శబ్దమును, చర్మము స్పర్శమును, నేత్రము రూపమును, జిహ్వ రసమును, ఘ్రాణము గంధమును గ్రహించినవి.

ప్ర:- పంచకర్మేంద్రియము లననేవి?

ఉ:- వాక్కు-పాణి-పాదము-ఉపస్థ- గుదము- ఇవి పంచకర్మేంద్రియములు. కర్మకు సాధనములు కాబట్టి కర్మేంద్రియములని చెప్పబడినవి. కర్మ మనిన క్రియ అని అర్థము. క్రియ రజోగుణమున నేర్పడును. అందుచే కర్మేంద్రియములు భూతముల రజోగుణాంశమున పుట్టినవి. **"రజోంశైః పంచభిస్తేషాం క్రమాత్ కర్మేంద్రియాణి తు"** అను శాస్త్రవాక్యము ప్రసిద్ధము. ఆకాశముయొక్క రజోంశమున వాక్కు, వాయువు వలన పాణి, తేజస్సువలన పాదము, జలము వలన ఉపస్థ, పృథ్వివలన గుదము- ఇట్లు కర్మేంద్రియములు భూతముల రజోంశమున కల్గినవి. క్రమముగ వచన ఉచ్చారణము, దానాదానము, గమనము, రతిభోగానందము, మలత్యాగమును వాటి వ్యాపారములు. ఈజ్ఞానేంద్రియ కర్మేంద్రియములు భూతముల అసాధారణ కార్యము లనబడును. ప్రాణములును అంతఃకరణమును భూతముల సాధారణ కార్యములు. అందు ప్రాణము స్థానక్రియాభేదము వలన ఐదు విధములు. అంతః కరణము వృత్తి భేదమున నాల్గు విధములు.

ప్ర:- పంచప్రాణము లననేవి?

ఉ:- ప్రాణ అపాన సమాన ఉదాన వ్యానము లనునవి పంచప్రాణములు. అందు ప్రాణమునకు ఊర్ధ్వగతియు, అపానమునకు అధోగమనమును కలదు. తక్కిన

మూడును నాభి కంఠ సంధులయందు వర్తించును.

ప్ర:- వాటి స్థానక్రియలు ఏవేవి?

ఉ:- 1. ప్రాణమునకు హృదయము స్థానము. ఆకలిదప్పులు క్రియలు.

2. అపానమునకు గుదము స్థానము. మలమూత్రములు వెడలించుట క్రియ.

3 సమానమునకు నాభిస్థానము. భుజించిన అన్నపానములను జీర్ణింపజేసి యోగ్యముగ పంచెడి క్రియ.

4. ఉదానమునకు కంఠము స్థానము. శ్వాసము క్రియ.

5. వ్యానమునకు సర్వాంగములును స్థానము. రసమిశ్ర మొనర్చుట క్రియ.

కొన్నియెడల శ్వాసక్రియ ప్రాణమున కనియు, కలలును ఎక్కిళ్లను హితయనెడి నాడియందుండు ఉదానముయొక్క క్రియయనియు చెప్పబడెను. ఇట్లు స్థానక్రియాభేదములచే ప్రాణము అయిదు విధములు. అయినను విశేషరూపమున వాయువొక్కటిగానే ఉన్నది. అది భూతముల మిశ్రరజో గుణాంశమున జనించినది.

ప్ర:- కొందరు నాగాది ఉపప్రాణములను చేర్చి దశప్రాణములుగ చెప్పుదురు. మీరు పంచప్రాణములనే చెప్పితిరేల?

ఉ:- నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయము లనెడి ఉపప్రాణపంచకమును యోగ శాస్త్రములు చెప్పినవి. త్రేపుట, కనులు తెరచుట, మూయుట, తుమ్ముట, ఆవులించుట, మృతశరీరమును ఉబ్బించుట అనునవి వరుసగ వాటిక్రియలు. ఈ ప్రక్రియ వేదాంతగ్రంథములందు లేదు.

ప్ర:- అంతఃకరణ మననేమి?

ఉ:- అంతఃకరణము భూతముల మిశ్రసత్త్వాంశమున కలిగినది. అంతః- అనగా శరీరములోపల, కరణమనగా జ్ఞానసాధనమని అర్థము. అది వృత్తి భేదములచే మనో బుద్ధి చిత్తాహంకారములని నాల్గువిధములు.

1. సంకల్ప వికల్ప రూపమగు అంతఃకరణ పరిణామము మనస్సు.

2. నిశ్చయరూప పరిణామము బుద్ధి.

3. చింతనరూప పరిణామము చిత్తము.

4. అహంతారూప పరిణామము అహంకారము.

మంతవ్యము, బోద్ధవ్యము, చింతితవ్యము, అహంకర్తవ్యమును క్రమముగ వాటి విషయములు. ఈ నాల్గింటియందు చిత్తాహంకారములను మనోబుద్ధుల యందు అంతర్భాగ మొనర్చి దశేంద్రియములను, పంచప్రాణములను, మనోబుద్ధు లను చేర్చి పదునేడు తత్త్వములు కలది సూక్ష్మశరీరమని వేదాంతములు చెప్పినవి. **"శరీరం సప్తదశభిః సూక్ష్మం తల్లింగముచ్యతే"** = ఆసూక్ష్మశరీరమే లింగశరీరమని చెప్పబడినది. మరియు గ్రంథాంతరమందు ఈ సూక్ష్మశరీరమును పుర్యష్టక మనియు వర్ణించియున్నారు.

## పుర్యష్టక స్వరూపము

ప్ర:- పుర్యష్టక మన నేది?

**ఉ:- శ్లో॥ వాగాది పంచ శ్రవణాది పంచ ప్రాణాది పంచాభ్రముఖాని పంచ ।**
**బుద్ధ్యాద్యవిద్యాఽపి చ కామకర్మణీ పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః ॥**

పంచ కర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, పంచప్రాణములు, పంచ సూక్ష్మభూతములు, అంతఃకరణము, అవిద్యాకామకర్మములు- ఇంతమొత్తము కూడి పుర్యష్టక మనబడును. ఇదియే సూక్ష్మశరీరము. ఇది అనాత్మ రూపమైనది. దాని యందు తాదాత్మ్యాధ్యాసమును పొందినవాడు నవగుణ గ్రసితుడు కాగలడు.

ప్ర:- ఆ నవ గుణము లేవి?

ఉ:- బుద్ధి, రాగ, ద్వేష, ప్రయత్న, సంస్కార, ధర్మ, అధర్మ, సుఖదుఃఖములు - యివియే నవ గుణములు. ఇవి లింగదేహమునకు సంబంధించినవి.

శంక:- ఈ గుణములు ఆత్మకు సంబంధించవని చెప్పుటకు కారణమేమి?

సమా:- ఈ గుణములు ఆత్మవి కావు. అన్వయ వ్యతిరేక దృష్టిచేత ఈ గుణము లన్నియు లింగదేహమునకు చెందినవి. జాగ్రత్స్వప్నములందే లింగ దేహముండుటంబట్టి ఆ గుణములును అయవస్థలందే తోచుచున్నవి. సుషుప్తియందు లింగదేహము లేక పోవుటచే అగుణములును తోచుట లేదు. కావున నవి కామసంకల్పాదికములు మనస్సునకు చెందిన వనియు ఇచ్ఛాద్వేషా దికములు క్షేత్ర ధర్మము లనియు చెప్పబడియున్నది.

కామము, సంకల్పము, సంశయము, శ్రద్ధ, అశ్రద్ధ, ధృతి, అధృతి, లజ్జ, నిశ్చయము భయములు- మనః పరిణామములని శ్రుతి చెప్పినది. ఇచ్ఛాద్వేష సుఖదుఃఖ సంఘాతచేతనా ధృతులు క్షేత్రవికారములని స్మృతి చెప్పినది.

## షడూర్మిలక్షణము

అట్లే షడూర్ములుసైతము స్థూల సూక్ష్మ సంఘాతముల ధర్మమై యున్నది. కాని ఆత్మధర్మములు కావు. ఆకలిదప్పులు ప్రాణధర్మములు, శోకమోహములు మనోధర్మములు. జన్మమృత్యువులు స్థూలదేహ ధర్మములు. అంతేకాని యీషడూ ర్ములు శివస్వరూపుడగు ఆత్మకు సంబంధింపవు.

మరియు కర్తృత్వ భోక్తృత్వములు కూడ సంఘాతముయొక్క ధర్మములే కాని ఆత్మధర్మములు కావు. కర్మకు ఆశ్రయమగు దేహము, కరణాది ఇంద్రియ ములు, కర్తయగు అహంకారము, చేష్టారూపమగు ప్రాణము, వాటిని ప్రకాశింప జేయు దేవతలు ఈ అయిదింటిచేత కాయిక వాచిక మానసిక వ్యాపారరూపమగు- శుభాశుభ కర్మలు నడచుచున్నవి. ఆత్మ వాటికి సాక్షియై యున్నాడు. ఇట్టి ఆత్మను కర్తయని యెవ్వడు భావించునో వానిని దుర్మతియని భగవంతుడు పేర్కొనెను.

స్థూలశరీరము భోగాయతనము. ఇంద్రియములు భోగసాధనములు. ఆభాస యుక్తమగు బుద్ధి భోక్త విషయములు భోగ్యములు. ఈనాల్గింటిని ప్రకాశింప జేయుచు ఆత్మ సాక్షియై యున్నాడు. ఇట్టి ఆత్మను భోక్తయని తలంచువాడు మహామూఢుడు.

అంధత్వ పటుత్వాదికములుకూడ నేత్రాదీంద్రియముల ధర్మములె కాని ఆత్మ ఆసర్వధర్మములకు అతీతుడు. ఇట్టి ధర్మములతో గూడియుండు సూక్ష్మ శరీరము నీవు కాదు.

## ఆత్మ కారణశరీరముకంటె భిన్నమైనది

ప్ర:- కారణ శరీర మన నేమి?

ఉ:- ముందు చెప్పిన స్థూలసూక్ష్మము లనెడి రెండు శరీరములకును ఉపాదానమగు అజ్ఞానము కారణశరీర మనబడును. ఆ అజ్ఞానము అనాది యైనది. దానికి ఉత్పత్తిని గ్రహించినచో తనమూలమునని తనయుత్పత్తిని అంగీకరించినట్లగును. అది ఆత్మాశ్రయదోషము. మరొక్కకారణమును గ్రహించినచో వేదాంతమందు జడ చేతనములనెడి రెండు పదార్థములే చెప్పబడియున్నవి. అందు జడపదార్థము లన్నియు అజ్ఞానకార్యములు. వాటిచే అజ్ఞాన మెట్లు సంభవించును?

చేతనమును కారణమని గ్రహించినచో అందు జీవత్వమును, ఈశ్వరత్వ మును అజ్ఞానముననే సిద్ధించినవి. మరి మిగిలిన శుద్ధచైతన్యము అసంగమైనది. దానిచే అజ్ఞానము జనించిన దనిన చేతనము వికారి కాగలదు. ఇన్నింటిని బట్టి అజ్ఞానము అనాదియని చెప్పబడినది. అదియే కారణశరీరము.

శంక:- అజ్ఞానము అనాది యని అంగీకరించినచో దానికి నిత్యత్వము ప్రాప్తించును. పుట్టుక లేనిచో నాశమెక్కడిది?

సమా:- అజ్ఞానము ప్రాగభావమువలె అనాది యైనను సాంతము. జ్ఞానము వలన దానికి నాశము కల్గుచున్నది. నిత్యత్వము లేదు.

ఆ అజ్ఞానమునకు ఆవరణము, విక్షేపమని రెండు శక్తులు గలవు. అసత్త్వా పాదకము, అభానాపాదకము ననెడి రెండు అంశములును కూడి ఆవరణ మన బడినది. భ్రాంతికి పేరు విక్షేపము. స్థూలసూక్ష్మములనెడి రెండు శరీరములునూ భ్రాంతిరూపమై యుండుటవలన విక్షేపము నాబడినది. అజ్ఞానమునకు అవిద్యయని మరొక్కపేరు. ఆ అవిద్య అనిర్వచనీయరూప మైనది. ఏ విధముగను నిరూపణ

చేయుటకు సాధ్యము కానిదానిని అనిర్వచనీయ మందురు. ఆ అవిద్యను సత్తనియు నసత్తనియును భయరూప మనియును చెప్పరాదు. చేతనముకంటె భిన్నమనియు నభిన్నమనియు నుభయాత్మక మనియును చెప్పరాదు. కాబట్టి అది అనిర్వచనీయము.

ఆ అవిద్య "తుచ్ఛాऽనిర్వచనీయా చ వాస్తవీ చేత్యసౌ త్రిధా" అని మూడు విధములు. జీవన్ముక్తుడగు విద్వాంసునకు తుచ్ఛరూపముగను, ముముక్షువునకు అనిర్వచనీయ రూపముగను, మూఢునకు సత్యరూపముగను అవిద్య తోచుచున్నది. దాని నివృత్తికూడ మూడు విధములని శ్రుతి చెప్పుచున్నది.

వేదాంత శాస్త్రశ్రవణమువలన పరమార్థనిశ్చయ మైనంతనే అవిద్య నశించును. అపరోక్షజ్ఞానమువలన దానియందలి కార్యక్షమత్వము నివృత్తి యగును. ప్రారబ్ధ నాశమువలన ప్రతిభాస నశించగలదు. ఇది కారణ శరీరస్వరూపమును గూర్చిన వివరణ. "అనాద్యవిద్యా నిర్వాచ్యా కారణోపాధి రుచ్యతే" అని ప్రమాణము కలదు. ఇట్లు వరుసగ చెప్పిన స్థూలసూక్ష్మ కారణములనెడి మూడు శరీరములును ఆత్మకు ఉపాధులై యున్నవి. ఈ ఉపాధిసహయోగమున జీవనామము ఆత్మ కేర్పడినది.

శ్లో॥ స్థూలసూక్ష్మకారణాఖ్యముపాధి త్రితయం చితేః ।
ఏతైర్విశిష్టో జీవస్స్యాత్ వియుక్తః పరమేశ్వరః ॥

అని ప్రాచీనవాక్యము కలదు. ఈ మూడు శరీరములందును పంచకోశము లిమిడి యున్నవి.

## ఆత్మ పంచకోశాతీతము

ప్ర:- పంచకోశము లనగానేమి?

ఉ:- అన్నమయాది కోశము లైదింటిని పంచకోశము లందురు. కత్తిని ఒరవలె ఆత్మ నివి కప్పియుండుటచే కోశములని చెప్పబడినవి. ఇది ఉత్తరోత్తరము ఒకదానిలో నొకటి యున్నవి. వాటి వివేకమువలన ఆత్మ ప్రకటితు డగుచున్నాడు.

అన్నపరిణామమగు స్థూలశరీరము అన్నమయకోశ మనబడును. తలి దండ్రులు భుజించిన అన్నమువలన స్థూలదేహము కలుగుచున్నది. దేహమందలి

అస్థిస్నాయుమజ్జలు తండ్రి సంబంధమైనవి. త్వఙ్మాంస శోణితములు తల్లి సంబంధించినవి. ఇది అన్నమయకోశము.

పంచ కర్మేంద్రియ సహితమగు పంచప్రాణములు ప్రాణమయకోశ మనబడును.

పంచజ్ఞానేంద్రియ సహితమగు మనస్సును మనోమయకోశ మందురు. కొన్ని యెడల కర్మేంద్రియ సహితమగు మనస్సును మనోమయకోశ మనుట గూడగలదు.

జ్ఞానేంద్రియయుక్తమగు బుద్ధి విజ్ఞానమయకోశము.

సుషుప్తియందుండు అజ్ఞానమువలన ఆవరింపబడి ప్రతిబింబరూపముననుండు ఆనందాభిమానమునకు ఆనందమయకోశ మనిపేరు. లేదా జాగ్రత్స్వప్న సుషుప్తులందు ప్రియ మోద ప్రమోదమని చెప్పబడు త్రివిధ సాత్త్విక వృత్తులయొక్క ఆనందమునకు ఆనందమయకోశ మనికూడ పేరు.

ఆ ఆనందమయము సుషుప్తియందు స్పష్టముగను, జాగ్రత్స్వప్నములందు కొంచెముగను తోచుచున్నది.

ఇష్టపదార్థమును చూచుటచే ప్రియవృత్తి కలుగుచున్నది. ఆపదార్థము లభించుటచే మోదవృత్తి కలుగుచున్నది. దానిని అనుభవించుటచే ప్రమోదవృత్తి సంభవించుచున్నది. ఇవి జాగ్రత్స్వప్నములందు కలుగునట్టివి.

ఈ పంచకోశములను వివేచించినచో ఆత్మస్వరూప యాథార్థ్యము గోచరింపదు. స్ఫటికము స్వతః స్వచ్ఛమై యున్నను నీలపీత వస్త్రాదికములయొక్క సహయోగముచే ఆయావర్ణమయముగ తోచినట్లు అన్నమయాది పంచకోశములతో గూడి శుద్ధాత్మ ఆయా కోశమయముగ తోచుచున్నాడు.

అన్నమయకోశ తాదాత్మ్యమున నేను మనుష్యుడ ననియు, ప్రాణమయకోశ సంసర్గమున ఆకలిదప్పులు కలవాడనియు, మనోమయకోశ సహయోగమున సంకల్పించుచున్నా ననియు విజ్ఞానమయ కోశముతో కూడి కర్తననియు, ఆనంద

మయకోశముయొక్క అధ్యాసచే భోక్త ననియు సామాన్య పామరమానవులు వేదాంత విచారశూన్యులై ముఖ్యాత్మ నెఱుంగక ఆయాకోశములం దాత్మబుద్ధి నుంచి పరస్పర కలహ మొనర్చెదరు.

కొందరు దేహమే ఆత్మయనియు, ఇంద్రియములే ఆత్మయనియు, ప్రాణమే ఆత్మయనియు, మనస్సే ఆత్మయనియు, క్షణిక విజ్ఞానరూపమగు బుద్ధియే ఆత్మయనియు చెప్పుదురు.

కొందరు శూన్యమే పరమతత్త్వ మనియు, ఆత్మ జడచేత నాత్మక మనియు, అణురూప మనియు, విభురూప మనియును పలువిధముల చెప్పుట గలదు. ఆచార్య భగవంతు డీవివిధ వాదములను ఖండించినాడు.

1. దేహాత్మవాదమునందు కృతహాని, అకృతాభ్యాగమ దోషములు సంభవించును.

2. ఇంద్రియాత్మ వాదమునందు ఒకే శరీరమున అనేకాత్మలు సిద్ధింతురు. అది విరుద్ధము. సముదాయమునె ఆత్మ యనినచో ఏఒక్క యింద్రియము నశించిపోయినను ఆత్మయొక్క అభావము చెప్పవలసివచ్చును. ఈ ఇంద్రి యాత్మవాదమునకు ప్రమాణయుక్తులుగూడ శూన్యము.

3. ప్రాణము ఆత్మ యనినచో జడత్వప్రాప్తి కల్గును. ప్రాణము జీవనహేతు వన్నచో రక్తమునందు గూడ ఆలక్షణము అతివ్యాప్తి కాగలదు.

4. మనస్సే ఆత్మ యనినచో ఆత్మ వికారి యగుట సంభవించును. మరియు నాదియని చెప్పదగిన వస్తుసామగ్రులయందువలె ఉపకరణత్వప్రాప్తి రూపదోషము చేకూరును.

5. బుద్ధియే ఆత్మ యనినచో పరిణామిత్వమును, కర్తృత్వమును, సుషుప్తి యందు లయించుటయు నగు దోషములు కల్గును.

6. శూన్యమె ఆత్మ యనినచో పురుషార్థమునకు హాని కల్గును. అనుభవకర్త యొకడుండుటచే శూన్యము ఆత్మ కాదు.

7. ఆత్మ జ్ఞానగుణము కలవాడనినచో జ్ఞానమునకు అనిత్యత్వప్రాప్తి వచ్చును.

8. జడచేతనములు రెండును చేరి ఆత్మ యనినచో శ్రుతికిని, అనుభవమునకును విరుద్ధము.

9. ఆత్మ అణురూపు డన్నచో శరీరముయొక్క ఏకదేశమునందెగాని తక్కిన చోట్ల సుఖదుఃఖ జ్ఞానము లేకపోవును.

10. ఆత్మ మధ్యమ పరిణామ మన్నచో చిన్న పెద్ద శరీరములను ధరించి నప్పుడు సంకోచ వికాసముల నొందవలసియుండును.

11. విభువనినచో జడుడనుచోటవలె శ్రుతియుక్త్యనుభవములకు విరుద్ధ మేర్పడును.

ఇట్లు

1. దేహ ఆత్మా న భవతి - దృశ్యత్వాత్ ఘటవత్.

2. ఇంద్రియ ఆత్మా న భవతి - కరణత్వాత్ వాస్యాదివత్.

3. ప్రాణ ఆత్మా న భవతి - వాయు విశేషత్వాత్ బాహ్య వాయువత్.

4. మన ఆత్మా న భవతి - కరణత్వాత్ బాహ్యేంద్రియవత్.

5. బుద్ధిరాత్మా న భవతి - క్షణపరిణామిత్వాత్ విద్యుద్వత్.

6. శూన్య ఆత్మా న భవతి - నిస్తత్వాత్ ఖపుష్పవత్.

అనెడి అనుమాన రూపయుక్తుల వలననూ, **"అశరీరో నిరింద్రియో అప్రాణో అమనాస్సచ్చిదానందమాత్రః"** అనెడి శ్రుతివలననూ, దేహేంద్రియ ప్రాణాదుల కంటె ఆత్మ భిన్ను డనుట స్పష్టము. అందుచే ఆత్మ దేహాది పంచకోశములకంటె అతీతుడు.

**శంకః- "స వా ఏష పురుషోఽన్నరసమయః"** అనెడి శ్రుతివలన అన్నరసమయ మగు దేహమే ఆత్మయని చెప్పబడుచున్నది. దాని యభిప్రాయ మేమి?

సమా:- పురుష దన్నరసమయుడని శ్రుతి చెప్పుటలో గౌణాత్మయొక్క వ్యావృత్తియందె తాత్పర్యముకాని దేహమె ఆత్మయని చెప్పుటయందు గాదు.

గౌణాత్మ, మిథ్యాత్మ, ముఖ్యాత్మయని ఆత్మమూడు విధముల చెప్పబడును. పుత్రాదులు గౌణాత్మ. అన్నమయాది పంచకోశములు మిథ్యాత్మ. సాక్షి ముఖ్యాత్మ యనబడును. ఆపుత్రాదులందు మూఢులకు ఆత్మబుద్ధి గలదు. దానిని దొలగించుటకై శ్రుతి అన్నరసమయ దేహమును ఆత్మయని చెప్పినది. ఆవేదమే వెండియు సోపానక్రమమున పంచకోశములందలి ఆత్మబుద్ధిని విడిపించుచు శాఖాచంద్ర న్యాయమున, అరుంధతీదర్శన న్యాయమున చివరకు ముఖ్యాత్మయే సాక్షియని తెలిపినది. ఆశ్రుతివాక్కులు తైత్తిరీయోపనిషత్తుయొక్క ద్వితీయాధ్యాయమున గలవు.

ఆచోట పంచకోశములను పక్షిరూపమున వర్ణించి వాటిని ఆత్మబుద్ధితో ఉపాసన జేసి కడకు వాటికి పరుడగు ఆత్మను గోచరింపజేయుటయె శ్రుతుల అభిప్రాయము.

శంక:- పంచకోశములకంటె వేరై ఆత్మ యుండినచో పంచకోశములవలె తోచి అనుభవమునకు వచ్చుట లేదే?

సమా:- పంచకోశములను తెలిసికొనెడి ఆత్మ దేనిచేతను తెలియబడునది కాదు. ఆత్మ అనుభవమునకు విషయము కాదు. తానే స్వయముగ అనుభవరూపము. **"యేన సర్వం విజానాతి తం కేన విజానీయాత్"**= దేనివలన సర్వమును తెలియబడు చున్నదో; ఆ ఆత్మను ఏసాధనముచే తెలిసికొన గల్గుదురు? అని శ్రుతిగూడ పలికినది.

ఈ పంచకోశముల వివేకముచే పంచక్లేశములు నివర్తించును. ఆ పంచక్లేశముల స్వరూపము ముందు చెప్పబడును.

ఈ పంచకోశములు మూడు శరీరములందు చేరియున్నవి.

1. అన్నమయ కోశమును స్థూలశరీర మందురు.

2. ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములు మూడును చేరి

సూక్ష్మశరీర మనబడును.

3. ఆనందమయ కోశమునె కారణ శరీర మందురు.

ఇట్లు పంచకోశాత్మకములై యుండు మూడు శరీరములును మూడు అవస్థలయందు వ్యభిచరించు చుండుటం బట్టి అవి అనిత్యము లనబడినవి.

## ఆత్మ అవస్థాత్రయసాక్షి

ప్ర:- మూడు అవస్థ లన నేవి?

ఉ:- జాగ్రత్ స్వప్న సుషుప్తులే మూడు అవస్థలు. కాలవిశేషమునకు అవస్థయని పేరు. బాహ్యేంద్రియములవలన పదార్థములను పొందెడి కాలమును జాగ్రదవస్థ యందురు. **"యత్రాయం వ్యవహారః స్యాదింద్రియైర్బాహ్యవారిభిః"** అని వాక్య ప్రమాణము. జాగ్రత్తయొక్క వ్యవహార మంతయు చతుర్దశ త్రిపుటుల వలన నేర్పడును. మూడుపుటలకు త్రిపుటియని పేరు. పుటమనిన అవయవమునకు పేరు. అధ్యాత్మ అధిభూత అధిదైవములు మూడునుచేరి త్రిపుటి యనబడినది. సంఘాతమున చేరియుండి జ్ఞానకర్మములకు సాధనమై యుండునది అధ్యాత్మ మనబడును. దీనియందు పది యింద్రియములును నాలుగంతఃకరణములును చేరినవి.

సంఘాతముకంటె భిన్నమై, కరణములకు విషయమై, భూతముల నాశ్రయించి యుండునది అధిభూతము నాబడును. ఇందు శబ్దాది విషయములును, వచనాదులును మంతవ్యబోద్ధవ్యాదులును నగు వ్యాపారములు చేరగలవు.

ఇంద్రియాంతఃకరణములకు అనుగ్రాహకులగు దిక్వాయుసూర్యాది చతుర్దశ దేవతలును అధిదైవ మనిపించుకొనును. అందొక తార్కాణము గైకొందుము. శ్రోత్రము అధ్యాత్మము, శబ్దము అధిభూతము, దిక్ అభిమానిదేవత, అధిదైవము. ఇట్లు పదునాల్గు త్రిపుటులను తెలిసికొనవలసియున్నది. ఈ జాగ్రత్తకు అభిమాని విశ్వు డనబడుచున్నాడు.

మనోమాత్రమగు ఆంతరవిషయ జ్ఞానకాలమునకు స్వప్నావస్థ యనిపేరు.

"స్వప్నః సంస్కారో జ్ఞేయో మనోమాత్రైకహేతుకః" అను వాక్యము ప్రమాణము. స్వప్నము సంస్కారజన్యమని తెలియదగినది. మనోమాత్రమె అచటహేతువు. స్వప్నమునందు త్రిపుటు లన్నియు మనోమయమ్మై యుండును. అవి ఈశ్వర రచితములు కావు. ఈ స్వప్నమునకు అభిమాని తైజసుడు.

అహంకార సహితముగ త్రిపుటు లన్నియు లయించిపోయెడి అవస్థకు సుషుప్తి యనిపేరు. "సుప్తౌ విలీయతే సర్వం" అని ప్రమాణము కలదు. ఈ సుషుప్తికి అభిమాని ప్రాజ్ఞుడు. ఈ అవస్థాత్రయములు త్రిగుణజన్యమగు బుద్ధివృత్తికి చెందినవై యుండుటచే దృశ్యములును వ్యభిచారులునునై యున్నవి.

శ్లో॥ స్వప్నో జాగరణేఽలీకః స్వప్నేఽపి జాగరో న హి।
ద్వయమేవ లయే నాస్తి లయోఽపి హ్యుభయోర్న చ ॥

జాగ్రత్తయందు స్వప్నము దబ్బరమ్మై యున్నది. అట్లే స్వప్నమునందు జాగ్రత్తయు లేదు. జాగ్రత్స్వప్నములు రెండును లయావస్థయగు సుషుప్తియందు లేవు. సుషుప్తియు తక్కిన రెంటియందు లేదు.

## అన్వయ వ్యతిరేకముల స్వరూపము

ఇందువలన ఈ మూడు అవస్థలును వ్యతిరేకములై యున్నవి. వాటికి సాక్షియై యుండెడి ఆత్మ ఆమూడింటియందును అన్వితుడై యున్నాడు. వ్యతిరేకమును వ్యావృత్తి యనియు, అన్వయమును అనువృత్తి యనియు వ్యవహరించుట గలదు. ఈ మూడు అవస్థలును వ్యతిరేకమ్మై యున్నట్లే పంచకోశరూపమగు మూడు శరీరములును వ్యతిరేకమ్మై యున్నవి. ఆత్మ అన్వయస్వరూపి. స్వప్నమందు స్థూలదేహము తోచుట లేదు. ఆత్మ తోచుచున్నాడు. సుషుప్తియందు లింగదేహము లేదు. ఆత్మ ఉన్నాడు. సమాధియందు అజ్ఞానరూపమగు కారణదేహము భాసించుట లేదు. నిరావరణముగ ఆత్మ భాసించుచున్నాడు. అందుచే మూడు దేహములు వ్యతిరేకముగను ఆత్మ యెల్లెడల అన్వితుడుగను నున్నాడు.

ఇంతవరకు దేహాదులకంటె భిన్నమై యుండు తత్త్వవిచారమును చెప్పి తాదాత్మ్య భ్రాంతిని పరిహరించిరి. ఇకపై భేదభ్రాంతిని నివర్తించుటకై బ్రహ్మాభిన్న తత్త్వమును నిర్ణయించుచున్నారు.

## ఈశ్వర శరీరములును కోశములును

జీవునకు గల వ్యష్టిశరీరములు మూడును, కోశము లైదునువలె-ఈశ్వరునకును సమష్టి శరీరములు మూడును, పంచకోశములును శాస్త్రకారులచే చెప్పబడుచున్నవి.

విరాట్టు, సూత్రాత్మ, అవ్యాకృత మనునవి మూడును ఈశ్వరునకు శరీరములు. ఆయీశ్వరునకు బ్రహ్మాండము అన్నమయకోశము. హిరణ్యగర్భుని యందుండు జ్ఞానక్రియాబలశక్తులు మూడును మూడుకోశములు. మాయయె ఆనందమయ కోశము.

జీవుని కోశములందు ఆత్మబుద్ధి నుంచినట్లె పలువురు ఈశ్వరుని కోశము లందును పరమాత్మబుద్ధి నుంచి వ్యర్థముగా కలహింతురు. అంతర్యామి యనియు ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు నిత్యముగ కలవాడనియు, హిరణ్యగర్భుడనియు విరాట్టనియు, ప్రజాపతి యనియు, విష్ణు వనియు, శివు డనియు, గణపతి యనియు ఈశ్వరస్వరూపమునందు విభిన్నాభిప్రాయములు కల్గియున్నారు. **"అంతర్యామిణ మారభ్య స్థావరాంతేశవాదినః"** అని యీశ్వరవాదుల వైవిధ్యమును గూర్చి ఒక శాస్త్రము చెప్పినది.

## జీవేశ్వరుల అభేదము

వ్యష్టి శరీరకోశములకంటె జీవసాక్షి వేరై యుండునట్లు, సమష్టి శరీరకోశముల కంటె ఈశ్వరసాక్షియు వేరై యున్నది. కాబట్టి ముంజాఇషీక న్యాయమున వ్యష్టి సమష్టి ఉపాధులనుండి చేతనమును వివేచించి ప్రత్యేకముగ తెలియవలసియున్నది. ఆ చేతనముల కెప్పుడును అభేదమనియే తెలియవలయును. జీవేశ్వర భేదము ఉపాధిగతమెకాని పరమార్థముగ లేదు.

శ్లో॥ **కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః ।**
**కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే ॥**

అని శుకరహస్యోపనిషత్తు చెప్పినది.

ఘటము, మఠము ననెడి ఉపాధులవలన ఘటాకాశము, మఠాకాశమని చెప్పబడుచూ అఘటమఠదృష్టిని వదలుచో ఆకాశము ఒక్కటియై యెల్లపుడు నున్నట్లు చిన్న పెద్దయనెడి ఉపాధి దృష్టిని వీడుచో జీవేశ్వరులను భేదము తొలగి శుద్ధచేతన మొక్కటియే అయియున్నది. ఈయుక్తివలన జీవేశ్వరులకు అభేదము చెప్పబడును. దానినే మహావాక్యముల మూలమున వేదములు చెప్పినవి.

## మహావాక్యవిచారము

నాలుగు వేదములందును నాలుగు మహావాక్యము లున్నవి.

1. ప్రజ్ఞానమానందం బ్రహ్మ - ఇది ఋగ్వేదవాక్యము
2. అహం బ్రహ్మాస్మి - ఇది యజుర్వేద వాక్యము
3. తత్త్వమసి - ఇది సామవేదవాక్యము
4. అయమాత్మా బ్రహ్మ - ఇది అథర్వణవేదవాక్యము

ఇచ్చట ఒక్కొక్క వాక్యమునందును మూడు మూడు పదములు గలవు.

1. ప్రజ్ఞానం - ఆనందం - బ్రహ్మ - మొదటి వాక్యములోని మూడుపదములు
2. అహం - బ్రహ్మ - అస్మి - రెండవ వాక్యములోని మూడు పదములు
3. తత్ - త్వం - అసి - మూడవ వాక్యములోని మూడు పదములు
4. అయం - ఆత్మా - బ్రహ్మ - నాల్గవ వాక్యములోని మూడు పదములు

మొదటి వాక్యములోని ప్రజ్ఞాన పదమునకు వాచ్యార్థము జీవుడు. బ్రహ్మపదమునకు వాచ్యార్థము యీశ్వరుడు. శుద్ధబ్రహ్మము కాదు. శుద్ధ బ్రహ్మము ఎట్టి వచనము నకును వాచ్యార్థము కాజాలదు. ఆనంద పదము జీవునకు విశేషము. అందుచే ఆనందరూపమగు ప్రజ్ఞానము బ్రహ్మమై యున్నది. ఇది అవాక్యమునకు అర్థము.

అహం బ్రహ్మాస్మి యనెడి రెండవవాక్యములో అహం పదముయొక్క వాచ్యము జీవుడు. బ్రహ్మపదమునకు వాచ్యము ఈశ్వరుడు. అస్మిపదము అభేద సూచకము. నేను బ్రహ్మమునై యున్నానని అవాక్యమున కర్థము.

తత్త్వమసి యనెడి మూడవ వాక్యమునందు తత్పదమునకు వాచ్యము ఈశ్వరుడు. త్వంపదమునకు వాచ్యము జీవుడు. అసిపదము అభేదసూచకము. అయీశ్వరుడు నీవై యున్నావనుట వాక్యమునకు అర్థము.

అయమాత్మా బ్రహ్మయనెడి నాల్గవవాక్యములో ఆత్మపదమునకు వాచ్యము జీవుడు. బ్రహ్మపదము ఈశ్వరుని చెప్పును. అయంపదము అపరోక్షముగ జీవుని లక్షింపజేయునది. ఈ ఆత్మ బ్రహ్మము అని వాక్యార్థము.

ఇట్లు నాలుగు మహా వాక్యములును జీవఈశ్వర అభేదమును చెప్పుచున్నవి. ఇందు తత్త్వమసి యనునది ఉపదేశవాక్యము. దానిని ఉద్దాలకఋషి తన కుమారుడు శ్వేతకేతువునకు బోధించెను. ఆ విషయము ఛాందోగ్యమునందు షష్ఠప్రపాఠకమున కలదు. జగత్కారణమగు పరమాత్మను నిర్దేశించుచు తత్త్వమసి యని పునః పునః ఉపదేశించెను. ఆ పరమాత్మయే నీవై యున్నావని దాని అర్థము. ఇచ్చట ఈశ్వర జీవులకు ఏకత్వము చెప్పబడినది. ఆయేకత్వము తత్త్వంపదముల వాచ్యార్థమందు సంభవించదు. అందుచే లక్షణవలననే యేకత్వము చెప్పవలసి యున్నది. ఇది విశదమగుటకై మొదటి తత్ త్వం పదములకు వాచ్యులగు ఈశ్వరజీవుల స్వరూపమును గూర్చి చెప్పవలసియున్నది. ఈశ్వరునియొక్కయు జీవుని యొక్కయు స్వరూపము శుద్ధసత్త్వప్రధానమగు మాయ. దాని అధిష్ఠానమగు చైతన్యము. మాయయందలి ఆచైతన్యముయొక్క ఆభాసమును చేరి యీశ్వరుడని చెప్పబడును.

మలిన సత్త్వప్రధానమగు అవిద్య, దాని అధిష్ఠానమగు చేతనము, ఆ అవిద్య యందు తోచు చేతనముయొక్క ఆభాసమును చేరి జీవుడని చెప్పబడును.

అవచ్ఛేదవాదమునందు మాయావిశిష్టుడు ఈశ్వరుడనియు, అవిద్యా విశిష్టుడు జీవుడనియు చెప్పబడును.

ప్రతిబింబ వాదమునందు అజ్ఞానమందలి ప్రతిబింబము జీవుడనియు, బింబము ఈశ్వరుడనియు చెప్పుదురు. ఇట్లు ఈశ్వర జీవస్వరూప నిర్ణయమందు వివాదములు పెక్కుభంగులు. అయినను భాష్యకారులును, విద్యారణ్య స్వాములును

అభాసవాదమును సమ్మతించినారు. అందుచే మొదట చెప్పిన యీశ్వర జీవుల స్వరూపము అవశ్యము తెలియదగినదై యున్నది.

## ఈశ్వరజీవుల ధర్మములు

1. ఈశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వశక్తుడు. విభువు. సర్వనియంత. స్వతంత్రుడు. సర్వోక్తృడు. మాయను స్వాధీనమందుంచుకొన్నవాడు. బంధమోక్ష భ్రాంతులు లేనివాడు. జగత్కర్త, జీవులకు కర్మఫలముల నొసంగువాడు.

2. జీవుడు అల్పజ్ఞుడు. అల్పశక్తుడు. పరిచ్ఛిన్నుడు, నియమబద్ధుడు, పరతంత్రుడు ప్రత్యక్షస్థితుడు, అవిద్యా మోహితుడు. బంధమోక్షభ్రాంతులు గలవాడు. శుభాశుభ కర్మములకు కర్త. వాటి ఫలముల ననుభవించువాడు.

ఇట్లు పరస్పర విరుద్ధ ధర్మములు గల వీరిర్వురియొక్క వాచ్యార్థము నందు ఏకత్వము సిద్ధింపదు. అందుచే మహావాక్యపదములందు లక్షణయె గ్రహింపదగి యున్నది.

## లక్షణను బోధించుటకై పదశక్తిని గూర్చిచెప్పట

శక్తివృత్తి లక్షణావృత్తి యని, పదముల వృత్తి రెండు విధములు. పదమునకు అర్థమును బోధింప గల సామర్థ్యమును శక్తివృత్తి యందురు. ఈ విషయమున కొందరు ఈశ్వరుని ఇచ్ఛారూపమును, కొందరు యోగ్యతారూపమును, కొందరు భేదాభేదరూప తాదాత్మ్యమునూ శక్తియని పల్కుదురు. ఈ సర్వమతములును అగ్రాహ్యములు

## లక్షణయొక్క బీజస్వరూపములు

1 చెప్పువాని తాత్పర్యముయొక్క అనుపపత్తి (వక్తయొక్క అభిప్రాయముతో పదముల అర్థము అతుకకుండుట) లక్షణకు బీజము.

2 శక్యసంబంధము లక్షణకు స్వరూపము. దీని వివరణ మేమనిన శక్తివృత్తి వలన కలిగెడి పదార్థజ్ఞానమును శక్యమందురు. లక్షణవలన కలిగెడి జ్ఞాన

మును లక్ష్యమందురు. ఆశక్య లక్ష్యములరెంటి సంబంధమునకు లక్షణ యనిపేరు. ఆ లక్షణ 1. జహల్లక్షణ, 2. అజహల్లక్షణ 3. జహదజహల్లక్షణ యని మూడు విధములై యున్నది.

**1. జహల్లక్షణ:-** వాక్యార్థములను వదలి శక్యసంబంధమగు వాక్యములచే తాత్పర్య బోధ చేయగల్గుచోట్ల జహల్లక్షణ ప్రవర్తించును అది ఎట్లనిన, "గంగాయాం ఘోషః" (గంగయందు గొల్లపల్లె) అనువాక్యమునందు దేవనదీ ప్రవాహము గంగయవ బడినది. ప్రవాహమునందు గొల్లపల్లె ఉండుటకు వీలులేదు. అందుచే శక్యముని చెప్పబడు వాచ్యార్థ మంతటిని (జహత్) వదలిపెట్టుటచేత తీరమునందు పల్లె యున్నదను అర్థమేర్పడును. ఇది జహల్లక్షణము. ఇచ్చట గంగయనునది శక్యార్థము. తీరమనునది లక్ష్యార్థము. ఆరెంటికిని సంబంధము గలదు "చూడగోరి ఆ ఊరే యిచ్చటికి వచ్చినది" అనుటలో ఊరిని వదలి జనులెల్లరు వచ్చిరని లక్ష్యార్థము. జహల్లక్షణకు ఇది మరియొక తార్కాణము.

**2. అజహల్లక్షణ:-** శక్యార్థమును వీడక శక్యసంబంధమగు తాత్పర్యబోధ చేయునది అజహల్లక్షణ మనబడును. ఉదాహరణము "శోణో ధావతి" (ఎరువు పరుగెత్తు చున్నది) అనువాక్యమునందు ఎఱుపు అనువర్ణమునందు పరుగెత్తుట యనునది సంభవించదు. అందువలన శోణపదముయొక్క శక్యార్థమును (అజహత్) విడువకనె దాని సంబంధమగు గుఱ్ఱము పరుగెత్తుచున్నదని ఎరుగుట అజహల్లక్షణ ప్రక్రియ "కాకేభ్యో దధి రక్షతాం" అను మొదలగు ఉదాహరణములు దీనికి సంబంధించినవి. యుద్ధమున ఈటెలు నడచినవి యనుచోట ఈటెలను ధరించిన పురుషులను గ్రహించవలెను.

ఈ రెండులక్షణలును మహావాక్యమునందు పొసగవు. ఎందు కనిన జహల్లక్షణవలన తత్పదవాచ్యమగు ఈశ్వరుడును, త్వంపదవాచ్యమగు జీవుడును త్యజింపబడిన వారగుదురు. ఆరెంటియందును చేతన అంతర్గతమైయే ఉన్నది. అట్టి యెడ అచేతనకూడ త్యజింపబడినదియె యగును. అప్పుడు లక్ష్యమేమియు మిగులదు. అందుచే జహల్లక్షణ ఒప్పదగినది కాదు.

అజహల్లక్షణ గూడ సంభవింపవీలులేదు. ఎందుకనిన, అజహల్లక్షణలో వాచ్యార్థ త్యాగము లేకపోవుటచే ఈశ్వరజీవులందలి విరోధము తొలగుట లేదు. దానిచేత జహదజహల్ల క్షణ యని, భాగత్యాగలక్షణ మని చెప్పబడు మిగిలిన మూడవ లక్షణయే మహావాక్యమునందు సమ్మతించవచ్చును.

## జహదజహత్ (భాగత్యాగ) లక్షణ

శ్లో॥ ఏకాత్మకత్వాజ్జహతీవ సంభవే తథాఽజహల్లక్షణతావిరోధతః ।
సో యం పదార్థావివభాగలక్షణా యుజ్యేత తత్త్వంపదయోరదోషతః ॥

అర్థము:- పరమాత్మ జీవాత్మలు వాచ్యతః భిన్నమైనను లక్షణతః అభిన్నమై యుండుటంబట్టి అనగా వారికి ఏకాత్మకత్వము పొసగియుండుటచే జహల్లక్షణ సంభవించదు. అట్లే వాచ్యార్థములందు విరోధ ముండుటచే అజహల్లక్షణ కుదురదు. "అదియే ఈ పదార్థ"మని నట్లు నిర్దోషముగ చెప్పదగు భాగలక్షణమె యిందతుక గలదు. అందలి అభిప్రాయము వివరింపబడుచున్నది.

కాశ్మీరదేశమునకు రాజుగ నుండిన ఒకానొక వ్యక్తి యొకప్పుడు కాశీనగరమునకు వెళ్లి సన్న్యాసదీక్షను గ్రహించెను. వెనుకటి మిత్రుడొకడు ఆతనిని చూచి కొంత వడికి గ్రహించి "సోఽయం దేవదత్తః" అని పలికెను. అందు సః+అయం (సోఽయం) అను రెండు పదములయొక్క వాచ్యార్థమైన పరోక్షదేశమున అతీతకాలమున నుండిన రాజునకును; ప్రత్యక్షదేశమున వర్తమానకాలమున నుండు భిక్షువునకును ఏకత్వము సిద్ధించదు. అయినను పరోక్షత్వ అపరోక్షత్వాది విరోధాంశములను వీడి అవిరోధాంశమగు దేవదత్తుని శరీరమును మాత్రము విభాగలక్షణ ననుసరించి గ్రహించుట ఎట్లు నంగతమో అట్లే. తత్పదవాచ్యమునందును త్వంపద వాచ్యమునందును కానవచ్చు విరుద్ధ ధర్మములగు సాభాస మాయను అవిద్యను వదలివేసి విభాగలక్షణా మూలమున చేతనమును మాత్ర మంగీకరించినచో ఏవిరోధమును లేదు. అట్లుగాక మహావాక్యమున నొక్కపదమునకు లక్షణ నంగీకరించి తక్కిన పదమున కంగీకరింపనిచో పురుషార్థ సిద్ధి కలుగదు. అందువలన రెండు పదములందును అంగీకరించినప్పుడే సిద్ధి చేకూరుట. మరియును మహా వాక్యమునందు సామానాధికరణ్యము మొదలగు త్రివిధ

సంబంధములు చెప్పుట గలదు. వాటిని వివరింతము-

## సంబంధత్రయ వర్ణనము

**శ్లో॥ సామానాధికరణ్యం తదను విశేషణవిశేష్యతా చేతి ।**
**అథ లక్ష్య లక్షకత్వం భవతి పదార్థానాం చ సంబంధః ॥**

తా॥ తత్త్వంపదములకు సామానాధికరణ్య సంబంధము గలదు. ఆపైన పదములకును, అర్థములకును విశేషణ విశేష్యభావన సంబంధము గలదు. ఆ మీదట విరోధాంశములను వదలిపెట్టుట ద్వారా పదపదార్థములకు లక్ష్యలక్షణ భావసంబంధము ఏర్పడగలదు.

1. భిన్నప్రవృత్తి నిమిత్తమై యున్న పదములకు గల ఏకార్థనిష్ఠత్వము సామానాధికరణ్యము. లేదా సమాన విభక్తి గల పదములు తాత్పర్యమున ఏకార్థమందు పర్యవసించుట సామానాధికరణ్య మనబడును.

2. పరస్పర భేదవ్యావర్తత వలన పదములయొక్క అర్థమునకు గల సంబంధము విశేషణ విశేష్యభావ సంబంధమని చెప్పబడును. తత్ త్వం - త్వం తత్, అహం - బ్రహ్మ బ్రహ్మ అహం, ప్రజ్ఞానం బ్రహ్మ - బ్రహ్మ ప్రజ్ఞానం - ఆత్మా బ్రహ్మ - బ్రహ్మ ఆత్మా - అను నట్లు పరోక్షపరిచ్ఛిన్నత్వ వ్యావృత్తితో కూడిన ఓతప్రోతభావము మహావాక్యము లందున్నది.

3. విరోధాంశములను వీడి లక్షణచేత లక్ష్యమునందు సంబంధ మేర్పరచుటకు లక్ష్యలక్షణ భావసంబంధమని చెప్పుదురు. ఈ లక్షణవలన అఖండార్థజ్ఞాన మొదవుచున్నది. అదే విద్వాంసులకు సమ్మతము.

**శ్లో॥ సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః ।**
**అఖండైకరసత్వేవ వాక్యార్థో విదుషాం మతః ॥**

తా॥ వాక్యముయొక్క అర్థము సంసర్గముగ నైనను విశిష్టముగ నైనను పేర్కొన వీలులేదు. అఖండ ఏకరసత్వమునానే వాక్యార్థమును విద్వాంసులు సమ్మతించెదరు.

శంక:- మహావాక్యమువలన అఖండార్థజ్ఞానము కల్గుట కల్ల. ఏలననిన-మహావాక్యమున లక్షణ నంగీకరించినచో అసంగత్వమునకు హాని కల్గును. అంగీకరింపనిచో లక్ష్యజ్ఞానము సంభవింపదు.

సమా:- చేతనకు ఉపాధితో ముఖ్యసంబంధము లేనిదయ్యు స్వప్నద్రష్టకు స్వప్నపదార్థములతోడివలె కల్పిత తాదాత్మ్య సంబంధము గలదు. అందుచే పరమార్థ దృష్టియందు అసంగత్వమునకు హానిలేదు. ఇట్లు లక్షణ సంభవించుటచే లక్ష్య జ్ఞానముకూడ సంభవించుచున్నది.

అవతారిక:- ఇంతవరకు బ్రహ్మాభిన్న తత్త్వవిచారమును చెప్పి దానివలన భేద భ్రాంతిని పరిహరించుచున్నారు.

ఇట్లు గురుబోధ వలన జిజ్ఞాసువు పరమ తత్త్వమును శ్రవణము జేసి మాటి మాటికి విచారించి ఆతత్త్వమునె నిదిధ్యాస మొనర్పవలసియున్నది. నిదిధ్యాసము లేక అవిద్యయొక్క సూక్ష్మసంస్కారరూపమగు విపరీతభావన తొలగిపోదు. **"నిదిధ్యాసన శూన్యస్య నాస్త్యవిద్యాపరిక్షయః"** అనుటవలన విజాతీయ వృత్తులను నిరసింపజేయుచు సాగెడి సజాతీయవృత్తి ప్రవాహమునె నిదిధ్యాసన మందురు. ప్రమాణ సంశయ వికల్పాది వృత్తులు విజాతీయవృత్తులు. బ్రహ్మాకారవృత్తి యొక్క పునఃపునరావృత్తిని సజాతీయవృత్తి ప్రవాహ మందురు. ఇట్లు విచారమువలననూ నిదిధ్యాసనమువలననూ తత్త్వసాక్షాత్కారమును బొంది శిష్యుడు కృతార్థుడు కాగలడు.

శ్రవణ మనన నిదిధ్యాసములయొక్క విశేషస్వరూపమును ముందె నిరూపించి యున్నారు. నిదిధ్యాస తత్పరుడగు విద్వాంసుడు పొందెడి నిత్య పరబ్రహ్మతత్త్వమె నేనై యున్నాననుట రెండవశ్లోకముయొక్క తాత్పర్యము.



## మూడవ శ్లోకం

## జ్ఞేయబ్రహ్మ స్వరూప విచారము

అవ: ఇంతవరకు తత్త్వజ్ఞానముయొక్క సాధనములను గూర్చి సమగ్రముగ చర్చించియున్నారు. మీదట మూడవ శ్లోకమునందు జ్ఞేయబ్రహ్మస్వరూపమును, దానిని తెలియబరుపజాలెడి వృత్తివిశేషమును సైతము పేర్కొనుచున్నారు.

మూ॥శ్లో॥ యదానందరూపం ప్రకాశస్వరూపం
నిరస్త ప్రపంచం పరిచ్ఛేదశూన్యమ్ ।
అహం బ్రహ్మ వృత్త్యైకగమ్యం తురీయం
పరబ్రహ్మ నిత్యం తదే వాహమస్మి ॥ 3

టీక॥ ఆనందరూపం = ఆనందరూపమును, ప్రకాశస్వరూపం = జ్ఞాన స్వరూపమును, నిరస్త = నిరాకరింపబడిన, ప్రపంచం = ప్రపంచము గలదియును, పరిచ్ఛేదశూన్యం = దేశ కాల వస్తు కృత పరిచ్ఛేదములు లేనిదియును, అహం బ్రహ్మ వృత్తి+ఏక = అహం బ్రహ్మాస్మి యనబడు అంతర్ముఖవృత్తియొక్క ఏకాకారము చేతనే, గమ్యం = పొందదగినదియును అగు, యత్ = ఏ పరమాత్మ తత్త్వమనెడి, తురీయం = తురీయముగ గలదో, తత్ = ఆ, నిత్యం = నిత్యమైన, పరం = సర్వోత్తమమైన, బ్రహ్మ+ఏవ = బ్రహ్మమే, అహం = నేను, అస్మి = అగు చున్నాను.

తా॥ ఎయ్యది ఆనందస్వరూపమును, ప్రకాశవంతమును, ప్రపంచ శూన్యమును, పరిచ్ఛేదహీనమునై యున్నదో, దేనిని అహం బ్రహ్మ యనెడి వృత్తి వలన మాత్రమె పొందుటకు వీలైయున్నదో, యేది తురీయమని చెప్పబడినదో ఆ నిత్య పరబ్రహ్మము నేనై యున్నాను.

టీక॥ బ్రహ్మము ఆనందరూపము, అనగా నిరతిశయ సుఖరూపమై యున్నది. బ్రహ్మము ఆనందస్వరూపము

శంక:- సుఖ మనునది ప్రత్యక్షముగ విషయములందె కాన్పించుచున్నది. బ్రహ్మ మానందరూప మనుట కెందును ప్రమాణము లేదు.

సమా:- బ్రహ్మమే సుఖరూపము. విషయములందు సుఖము లేదు. ఈ విషయము జీవన్ముక్తుడగు జ్ఞానికి మాత్రమె తెలియును. వేదశాస్త్రములందు --

**1. యో వై భూమా తత్సుఖం-నాల్పే సుఖమస్తి**= 1. యో భూమా = అపరిచ్ఛిన్నరూపమగు బ్రహ్మమే, వై = నిశ్చయముగ సుఖ రూపమై యున్నది. అల్పమునందు పరిచ్ఛిన్నములగు విషయములందు సుఖము లేదు.

**2. ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్** = 2. ఆనందరూపమే బ్రహ్మమని తెలియవలెను.

**3. ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన** = 3. ఆనందస్వరూప బ్రహ్మము నెరింగినవా డేకాలమందైనను భయమును జెందడు.

**4. ఏష హ్యేవానందయాతి** = 4. ఈ పరమాత్ముడు జగత్తున కానందమును ప్రసాదించును.

**5. ఏషోఽస్య పరమ ఆనందః అసంహ్యేవాయం లబ్ధ్వానందీభవతి** = 5. ఇదియె విద్వాంసునకు పరమానందకరము. ఆవిద్వాంసుడు రసరూప బ్రహ్మ మును బొంది ఆనందించును. ఇంతవరకూ శ్రుతులకు అర్థము.

**6. యం లబ్ధ్వా చా పరం లాభం మన్యతే నాధికం తతః** = 6. ఏబ్రహ్మానందమనెడి లాభమును బొంది యోగి యగువాడు మరియొక లాభమును బొందుటకు ఆశించడో అని స్మృతికి అర్థము.

అని ప్రమాణము లనేకములు గలవు.

శంక:- అయినచో ఆ బ్రహ్మానందము స్వర్గసుఖమువలె పరోక్షమై యున్నదా?

సమా:- బ్రహ్మము సర్వమునకును ఆత్మయై యుండుటచే నిత్యమును అపరోక్షమయ్యే యున్నది. **"యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ"** బ్రహ్మ మపరోక్షమని శ్రుతి గూడ చెప్పినది. అద్దాని సుఖముగూడ పరోక్షము గాదు.

శంక:- నిత్యాపరోక్షప్రత్యగభిన్న బ్రహ్మము సుఖరూపమై యున్నచో విషయ జాలమునందు ఆసక్తియు ప్రేమయు కలుగుటకు వీలులేదు.

సమా:- విషయములందలి ప్రీతియు ఆత్మ నపేక్షించియే ఆత్మకోసమయ్యే ప్రవర్తించుచున్నది. విషయములందు సొంతముగ ప్రేమలేదు. అందుచే ఆత్మయే పరమప్రేమకు ఆస్పదుడు. ఈ మాటను బృహదారణ్యకోపనిషత్తునందు నాల్గవ అధ్యాయములో నాల్గవ బ్రాహ్మణమున యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయితో చెప్పి యున్నాడు.

ఓ మైత్రేయీ! ఆత్మను అపేక్షించి తనకు కావలసియుండుటంబట్టి భర్త ప్రియుడైనాడు. అంతెగాని స్వత: ఆతనియందు ప్రియత్వము లేదు. తన కామనకు పనికివచ్చుటచే భార్య ప్రియురాలైనది. ఆమెకు ఆయననుబట్టి కాదు. పుత్రుడు కాని విత్తముకాని మరి యే విషయవస్తువు లైనను ఆత్మకొరకు అపేక్షణీయములై ప్రియ వస్తువులైనవి. కాని స్వయముగ వాటి యందు ప్రియత్వము లేదు. అందువలన ఆత్మయె పరమప్రియమై యున్నది.

శంక:- తనకు బాహ్యమున నుండు పుత్రధనాదికములు స్వయముగ ప్రియములు కావని చెప్పవచ్చును. కాని దేహేంద్రియములు స్వత: ప్రియము లెందుకు గావు?

సమా:- విత్తాదులవలె దేహాదులు గూడ స్వత: ప్రియయోగ్యములు కావు. అన్నిటికి లోపలివాడను ఆత్మయే ప్రియు డనబడును.

**వార్తి॥ విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్ పిండః పిండాత్తథేంద్రియమ్ ।**
**ఇంద్రియాచ్చ ప్రియః ప్రాణః ప్రాణాదాత్మప్రియః పరః ॥**

తా॥ ధనముకంటె కుమారుడు ప్రియుడు. కొడుకుకంటె శరీరము ప్రియము. శరీరముకంటె ఇంద్రియములు ప్రియములు. ఇంద్రియములకంటె ప్రాణము ప్రియము. ఆ ప్రాణముకంటె ఆత్మ ప్రియమైనవాడు. ఈ విషయమునే

**శ్లో॥ ప్రేయః పుత్రాత్ ప్రేయో విత్తాత్ ప్రేయోఽన్యస్మాత్ ।**
**సర్వస్మాదంతరతమం యదయమాత్మా ॥ "** అని శ్రుతి చెప్పినది.

1. మనుష్యునకు వ్యవహారదశయందు అన్నివస్తువులకంటెను ధనము ప్రియమై యున్నది. ధనము కొరకు పురుషుడు దేశదేశాంతరముల కేగి ఎన్నెన్నియో

నీచ కృత్యము లైనను చేయగలడు.

2. పుత్రుడు నేరస్థుడై తీవ్రమగు రాజకీయదండనకు గురియైనపుడు తండ్రి శతప్రయత్నము లొనర్చి కష్టార్జితమగు ద్రవ్య మెంతయైనను వెచ్చించి కుమారుని విడిపించుకొనును. అందుచే ధనముకంటె పుత్రుడు ప్రియుడు.

3. దుర్భరమగు కఱవు కాటకములు తారసిల్లినపుడు కుమారు నైనను విక్రయించి తనశరీరమును మానవుడు కాపాడుకొనును. అందుచే కొడుకు కంటె శరీరము ప్రియవస్తువు.

4. ఎవడైనను దుండగీడు తన్ను మర్దింపవచ్చినపుడు వీపును (మూపును) కాలు చేతుల నడ్డమిడి కన్ను చెవి ముక్కు మొదలగు ఇంద్రియములపై దెబ్బ పడకుండ కాపాడుకొనును. అందువలన దేహముకంటె ఇంద్రియములు ప్రియములు.

5. మన్నింపరాని నేరము చేసిన ఒకానొక అపరాధికి న్యాయాధిపతి ప్రాణ దండన విధించినా డనుకొనుడు. తన అపరాధమునకై ఆస్తి పాస్తులను సతీ సుతులను ఇచ్చుటకు సిద్ధపడును. ప్రాణము పోవుట కిష్టము పడడు. చివరకు తన కాలు సేతులను నేత్రశ్రోత్రములను సైతము ఖండించి ప్రాణదాన మొసగుడని అధికారులను వేడుకొనును. కాబట్టి యింద్రియముల కంటె ప్రాణము ప్రియతర మైనది.

6. భయంకరవ్యాధిచే పీడింపబడు మానవుడు మిగుల వేసటపడి"యీ ప్రాణము పోయినచో హాయిగ నుందు"నని తలంచును. అందువలన ప్రాణము కంటె ఆత్మ ప్రియుడు. ఆత్మను మించి ఆత్మకు వేరై ప్రేమవిషయమగు పదార్థ మేదియు లేదు. బ్రహ్మస్వరూపమగు ఆత్మయే పరమప్రేమకు ఆస్పదమై యున్నది.

అటులయిన ఆత్మయే సుఖరూపమ్మై యున్నచో విషయములందు ఇచ్ఛ కలుగ వీలులేదనిన శంకకు సమాధాన మిచ్చుచున్నారు.

1. ఆత్మజ్ఞాన రహితులగు మూఢులకు విషయములందు కోరిక గల్గు చున్నది. విషయములందు సుఖమున్నదని తలంచుట భ్రాంతిమాత్రము.

సుఖములను విషయములం దెంతకు తారాడినను అయ్యది దుర్లభమయ్యే యున్నది. జ్ఞానికి ప్రపంచమందు దేహేంద్రియప్రవృత్తి కలుగదా యనిన నది కేవలము ప్రారబ్ధకర్మాధీనమై నడచుచున్నది. అంతేకాని సుఖబుద్ధివలన గాదు.ఆకలి నివారించుటకు భోజనము చేసినట్లె ఆతని ప్రవృత్తిని గ్రహించునది. తొలిసారి యీనిన ఆవు పసులకాపరియొక్క నిర్బంధముచే అడవికి తోలబడి గడ్డిమేయు చున్నను తనదూడనె చింతించుచు వీలుకలిగినంతనె యింటికి పరుగెత్తి వచ్చు నట్లు జ్ఞానియొక్క వ్యవహారముకూడ భోజనాది కాలమందు తత్త్వచింతనమందు తగుల్కొనియె యుండి వ్యవహారము ముగిసినంతనె ప్రత్యేక ప్రవణ మగుచున్నది.

2. మూఢ మనుష్యుని చిత్తము ఒంటెవలె నిరంతర మల్లాడుచున్నది. ఒంటె ముళ్ళను కంపలను దినుచు వనవనాంతరముల సంచరించున్నట్లు మూఢుడును విషయ విషయాంతరములయందు రిత్తగ భ్రమించుచుండును. విషయములందు సుఖము లేదు. కోరిన కోర్కె లభించినప్పుడు, ఇచ్ఛ ఉపశమించినపుడు, సంతృప్తి కూరినపుడు శాంతమైన చిత్తమున సాత్త్వికవృత్తి సంభవించును. ఆవృత్తియందు ఆత్మానందముయొక్క ప్రతిబింబ మేర్పడును. ఆ సమయమునం దనుభవమునకు వచ్చు సుఖము విషయములనుండి కల్గినదని వివేకహీనుడు తలపోయును. మరియు వెంటనె విషయేచ్ఛ కల్గినంతనె ఆ ఆనంద ప్రతిబింబము వృత్తినుండి తొలగుటచే అప్పుడు తోచుసుఖముకూడ రూపుమాయును. అందుచే స్వతః విషయములందు సుఖము లేదు. విషయములు లేని సమాధియందును నిద్రయందుసైతము సుఖ ప్రతీతి యున్నది. ఆచోట, ఎట్టి విషయభోగములు లేకున్నను సుఖము కల్గుట స్వతస్సిద్ధము. సమాధి సుఖము జీవన్ముక్త పురుషులకు అనుభవగోచరము. శ్రుతి కూడ ఇట్లు చెప్పుచున్నది.

**శ్లో॥ సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్ ।**
**న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే ॥**

తా॥ సమాధి బలముచే నిర్మలముగ నొనర్పబడిన చిత్తమును ఆత్మయందు నెలకొల్పిన సాధకునకు కలిగెడి సుఖము వాక్కుచేత వర్ణింప వీలుగానిది. స్వయముగ తన అంతఃకరణమునకు మాత్రము గోచరము.

3. నిద్రాసుఖము ప్రాణికోట్లన్నిటికిని అనుభవసిద్ధమై యున్నది.

4. విషయములందు సుఖమున్నచో భర్తృహరి ముచికుందాదులు రాజ్యాదికముల త్యజింపవలసిన పని లేదు. **"న చేంద్రస్య సుఖం కించిత్-న సుఖం చక్రవర్తినః"** యనెడి శాస్త్రవాక్యమునకు ప్రామాణికత లేదు.

ఎవ్వడైనను హఠము బట్టి విషయములందు సుఖానుభవము కల్గుచున్న దన్నచో వానిని క్రిందివిధమున ప్రశ్నింతము.

అయ్యా! వైషయికసుఖ మనునది విషయముల ధర్మమా? లేక 2 (ఉప)కరణముల ధర్మమా? 3 కర్మముయొక్క ధర్మమా? 4 భోక్తయొక్క ధర్మమా? 5 దేశ ధర్మమా? 6 కాలధర్మమా? 7 అజ్ఞానము యొక్క ధర్మమా? 8 (విషయ)జ్ఞానము యొక్క ధర్మమా? ఏమనియెదవు?

1. సుఖమును విషయముల ధర్మ మనినచో ఒక్కనికి సుఖమును కల్గించిన విషయము అందరికిని సుఖమే కల్గించవలెను. విషయముల సన్నిధినుండు వాని కెల్లప్పుడును సుఖమే ఉండవలెను. అది లేదు. ఇతర పదార్థమునందు కోర్కె కల్గి నంతనే ఆవిషయసుఖము అదృశ్య మగుచున్నది.
2. కరణధర్మ మనినచో విషయముల నెడబాసినను సుఖముండవలెను. అది కాన వచ్చుట లేదు.
3. కర్మముయొక్క ధర్మ మనినచో కర్మానుష్ఠానకాల మందుసైతము సుఖమే భాసించవలెను గదా?
4. భోక్తయొక్క ధర్మ మనినచో విక్షేపమే కల్గకుండవలెను.
5. దేశధర్మ మన్నచో అన్నిప్రదేశములందును సుఖము లభింపగల్గుచో స్వర్గలోకాపేక్షయే లేకుండవలెను. సుఖస్థానమని మనము తలంచు స్వర్గమునుగూర్చి **"ఇంద్రలోకే మహద్దుఃఖ"** మని శాస్త్రము నుడువుచున్నది.
6. కాలధర్మ మనినచో చలియెండలవలె నెల్లడలను నెల్లరకును సుఖము లభించవలెను.

7. అజ్ఞానధర్మ మనినచో భోగ్యత్వ జ్ఞానములేకనే సుఖము కలుగవలయును. కాని అది అసంభవము.

8. జ్ఞానముయొక్క ధర్మమని చెప్పినచో విషయముల జ్ఞానముచే విరక్తునకు కూడ సుఖము లభించవలెను. అది పొసగుట లేదు. వానికి ద్వేషమే కల్గుచున్నది.

ఇన్ని కారణములనుబట్టి సుఖము విషయములవలన నేర్పడదు. కావున దేనియొక్క ఆనందాంశ లేశమున నఖిల విశ్వమును ఆనందమయమై తోచుచున్నదో ఆబ్రహ్మమే ఆనందరూపమై యున్నది.

శంక:- ఆ బ్రహ్మము ఆనందస్వరూప మైనను జడస్వరూపమే గదా యనిన ఆచార్యులు సమాధానమిచ్చుచున్నారు.

## బ్రహ్మము ప్రకాశస్వరూపము

సమా:- ఆ బ్రహ్మము ప్రకాశస్వరూపమై యున్నది. ఆ ప్రకాశమైనను అగ్ని మొదలగు వానివలె దీప్తిరూపము గాదు. జ్ఞప్తిరూపము. సూర్యాది జ్యోతులన్నియు జ్యోతిరూపములై యున్నవి. అందుచే దానిని **"జ్యోతిషామపి తజ్జ్యోతిః"** అని భగవంతుడు చెప్పియున్నాడు. ఆ పరమాత్ముడు తాను స్వయంప్రకాశ స్వరూపుడై యున్నాడు. అందుచే సూర్యాది జ్యోతు లతనిని ప్రకాశింపచేయజాలవు. స్వయం జ్యోతి యనబడు పరమాత్మ దేవుని సూర్యుడైనను, చంద్రుడైనను, నక్షత్రములైనను వెల్గింపజాలవు. ఇక అగ్ని విషయ మడుగనేల? యని శ్రుతి భగవతి నుడువుచున్నది. **"న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః"** అని గీతావచనము. ఆ బ్రహ్మమును సూర్యుడుకాని చంద్రుడుకాని అగ్నికాని ప్రకాశింప జేయజాలదని దాని అర్థము. **"న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనః"**= ఆ పరమాత్మ ఏ యింద్రియమునకు ఏయేప్రమాణమునకును విషయము కాదని ఆవేదమంత్రమునందలి భావము. **"యతో మానాని సిద్ధ్యంతి"** అని యొక శాస్త్రవాక్యము కూడగలదు. "ప్రమాణము లన్నియు నే ఆత్మవలన సిద్ధించుచున్నవో" అని ఆ మాటకర్థము. ప్రమాణములకు ప్రకాశకుడగు పరమాత్మ ప్రమాణములకు విషయము కాజాల డనుట నిర్వివాదము. అట్టి స్వప్రకాశ రూపుడగు పరమాత్ముడు సర్వభూత హృదయములందు సాక్షిరూపుడై

నిలిచి త్రిపుటు లనన్నింటిని క్రమమనునది లేక సూర్యునివలె వెల్గించుచున్నాడు. ఆతడు అఖండజ్ఞానస్వరూపుడు. అజ్ఞానము ఆత్మకు గుణమును గాదు. ధర్మమును గాదు.

ఈ విషయమున

శ్లో॥ జ్ఞానం న చాత్మనో ధర్మో న గుణో వా కథంచన ।
జ్ఞానస్వరూప ఏవాత్మ నిత్యః సర్వగతః శివః ॥

అనెడి శ్లోకముకూడ ఆధారము గలదు. జ్ఞానము ఆత్మకు ధర్మ మనిగాని, గుణమనిగాని ఏవిధమునగూడ చెప్పజెల్లదు. జ్ఞానస్వరూపుడే ఆత్మ, ఆతడు నిత్యుడు. వ్యాపకుడు, శివుడు.

మరియు క్షణిక విజ్ఞాన వాదులు బుద్ధినే స్వప్రకాశ మందురు. తార్కికులు ఆ బుద్ధిచే జ్ఞానస్వరూపుడగు ఆత్మకు గుణమందురు. అదంతయు మిథ్యా మాత్రము స్వప్రకాశరూపమై యుండునది కేవలము ప్రత్యగభిన్న బ్రహ్మమే గాని వేరు గాదు.

శంక:- బ్రహ్మము ఆనందరూపమై యున్నను ప్రకాశరూపమై యున్నను ప్రపంచ సహితమే గదా?

అనెడి శంకకు ఆచార్యులవారు సమాధాన మిచ్చుచున్నారు.

## బ్రహ్మము నిష్ప్రపంచ సత్యస్వరూపము

సమా:- పరబ్రహ్మము భూతభౌతికమని చెప్పబడు ప్రపంచమున వ్యాపించి యుండియు దానిని అంటనివాడై యున్నాడు. అందుచే ఆతని ' నిరస్త ప్రపంచ' మని నుడివియున్నారు. సూర్యు డన్నింటిని ప్రకాశింప జేయువాడయ్యూ దేనియందు కూడా అంటుపడడో, ఆకాశమన్నింట వ్యాపించియున్ననూ దేనియొక్క అంటు సొంటుగూడ దానికెట్లు లేదో, అట్లే సర్వభూతములను ప్రకాశింపజేయున దయ్యు, సర్వాంతఃస్థితమయ్యు, సర్వాత్మరూపమయ్యు బ్రహ్మము సదా నిర్లిప్తమయ్యే ఉన్నది.

**శ్లో॥ సూర్యో యథా సర్వలోకస్య చక్షుః న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః ।**
**ఏకస్తథా సర్వభూతాంతరాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః ॥**

తా॥ సర్వజనుల నేత్రములను ప్రకాశింపజేయుచు నేత్రమునందుండు సూర్యుడు నేత్రసంబంధమగు బాహ్యదోషములచే తగుల్కొననట్లు సర్వభూతాంతరములందలి ఒకే ఆత్మ బాహ్యలోక దుఃఖములందు అంటుకొనడు.

**స్మృతి:- "యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।**
**సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥"**

తా॥ అన్నివస్తువుల నన్నిచోట్ల వ్యాపించియు సూక్ష్మమగు ఆకాశము వాటి సంగమును తాను పొందనట్లు ఉత్తమనీచ శరీరము లందుండియుకూడ ఆత్మకు ఆశరీర సంబంధములగు గుణదోషములతోడి సంపర్కము లేదు.

అదియునుగాక అధిష్ఠాన బ్రహ్మమునందు ప్రపంచము నిత్యనివృత్తమయ్యే ఉన్నది. నామరూపక్రియాత్మకమై, స్థావరజంగమరూపమై భూతభౌతిక మనబడు యావత్తు జగత్తు కూడ శుక్తియందు రజతమువలె బ్రహ్మమునందు కల్పితమై యున్నది. కల్పితవస్తువు అధిష్ఠానమున కెట్టి చేటును కల్గించలేదు. ఎండమావులలో తోచు నీరు భూమిని తడుపలేనట్లు మిథ్యాప్రపంచము సత్యస్వరూపమగు బ్రహ్మమును దోషపాత్ర మొనర్ప లేదు.**"నేహ నానాస్తి కించన- వాచారంభణం వికారో నామధేయం"** అనియు, **"అయం ప్రపంచో మిథ్యైవ సత్యం బ్రహ్మాహమద్వయం"** అనియు చెప్పు శ్రుతిస్మృతులు జగత్తుయొక్క మిథ్యాత్వమునే ప్రతిపాదించుచున్నవి. ఇంతకూ బ్రహ్మము నిష్ప్రపంచము, సత్యస్వరూపము నని నిష్కర్ష తేలినది. మరియు

## బ్రహ్మము పరిచ్ఛేదత్రయ శూన్యము

1.దేశమువలన గలుగు పరిచ్ఛేదము 2. కాలమువలన గలుగు పరిచ్ఛేదము 3. వస్తువువలన గలుగు పరిచ్ఛేదము- ఈ మూడు పరిచ్ఛేదములును బ్రహ్మమునందు లేవు.

1. అత్యంతాభావమునకు ప్రతియోగిత్వమును (విరోధము) దేశపరిచ్ఛేద

మందురు. 2. ప్రాగభావ ప్రధ్వంసాభావములకు ప్రతియోగిత కాలపరిచ్ఛేద మందురు 3. అన్యోన్యాభావ ప్రతియోగిత్వమును వస్తుపరిచ్ఛేద మందురు. ఈ మూడు పరిచ్ఛేదములును జడపదార్థములందున్నవి. వాటికి మరింత వివరణము

(1) ఏదైన నొకదేశమున ఘటమున్నచో నదిగాక తక్కిన మరియొండు దేశమున నాఘటమునకు అత్యంతాభావము కలదు. ఆ అత్యంతాభావమునకు ప్రతియోగిత్వ మాఘటమునందు గలదు. కావున దేశపరిచ్ఛేద మచ్చట సిద్ధించినది.

(2) పుట్టుటకు ముందు ఘటమునకు అభావము కలదు. కర్రతో పగుల గొట్టిన పిదపను అభావమే అయినది. ఈప్రాగభావ ప్రధ్వంసాభావములయొక్క ప్రతియోగిత్వము వర్తమానఘటమున కలదు. కాబట్టి ఆఘటమునకు కాలపరిచ్ఛేద మేర్పడినది.

(3) ఘటమునకు పటమునందు అభావము. పటమునకు ఘటమునందు అభావము కలదు. ఘటాభావముయొక్క ప్రతియోగిత్వము పటమునందును, పటాభావముయొక్క ప్రతియోగిత్వము ఘటమునందును కలదు. అభావమునకు అభావము ఏదియో దానిని అభావముయొక్క ప్రతియోగి అందురు. అందుచే ఘటమునందు ఘటముయొక్క అభావమునకు ప్రతియోగి అందురు. అందుచే ఘటమునందు ఘటముయొక్క అభావమునకు ప్రతియోగి ఘటమై యుండుటం బట్టి అయ్యది వస్తుపరిచ్ఛేదము కలదైనది.

ఇట్లే దేహాది జడపదార్థము లన్నియు త్రివిధ పరిచ్ఛేదములు కలవి యైనవి. బ్రహ్మమునం దీపరిచ్ఛేదములు లేవు.

1. వ్యాపకమై యున్నందున దేశకృతపరిచ్ఛేదమును,

2. నిత్యమై యున్నందున కాలకృతపరిచ్ఛేదమును,

3. సర్వాత్మరూపమై యున్నందున వస్తుకృత పరిచ్ఛేదమును పరబ్రహ్మము నందు లేవు. బ్రహ్మము వ్యాపకము, నిత్యము, సర్వాత్మరూపమై యున్నదను విషయమును గూర్చి శ్రుతిస్మృతు లనేకములు సుప్రసిద్ధములై యున్నవి.

**శ్లో॥ ఇతి త్రిధా పరిచ్ఛేదో౽బ్రహ్మణ్యాత్మస్వరూపకే ।**
**న విద్యతే యతస్తస్మా ద్బ్రహ్మాహమితి -ఈరితః ॥**

అర్థము: ఆత్మస్వరూపమగు బ్రహ్మమునందు మూడు విధములగు పరిచ్ఛేదములు లేవు. అందువలన నేనే బ్రహ్మమై యున్నాను.

ఒక్కదేశపరిచ్ఛేదమును నిరాకరించుట చేతనే మూడు పరిచ్ఛేదములును నిరాకరింపబడినవే యగుచున్నవి. అయినను ఇతరమతములను పరిహరించు నిమిత్తమై మూడు పరిచ్ఛేదముల అభావము వేర్వేరుగ వర్ణింపబడినది. పరమార్థ దృష్టితో విచారించినచో దేశకాలాదు లన్నియు బ్రహ్మమునందు కల్పితములు. కాబట్టి పరిచ్ఛేదములు సర్వదా అభావములు.

ఇట్లు పూర్వార్ధమున ఆనందము, ప్రకాశము, నిష్ప్రపంచము, పరిచ్ఛేద రహితమునని వివరించి చెప్పుటచే సత్ చిత్ ఆనందరూపమగు జ్ఞేయబ్రహ్మము యొక్క స్వరూపము చెప్పినట్లైనది. దానిని దర్శించిగాని జిజ్ఞాసువు ధన్యుడు కాలేడు. అట్టియెడ ఆబ్రహ్మము ఏవృత్తివలన తెలియదగి యున్నది? అనెడి జిజ్ఞాసకు శ్రీఆచార్యులవారు సమాధాన మొసగుచున్నారు.

## అహం బ్రహ్మావృత్త్యైకగమ్యం

తత్త్వమసి మహావాక్యరూపమగు ప్రమాణములవలన బుట్టిన 'అహం బ్రహ్మాస్మి' యనెడి చరమవృత్తి వలన బ్రహ్మసాక్షాత్కార లక్షణమను అపరోక్ష జ్ఞానము లభించగలదు. ఇట్టి ప్రత్యగభిన్న బ్రహ్మగోచరమగు వైదికశబ్దమే ప్రత్యక్ష ప్రమ యనబడును. దానినే పరావిద్యయనియు చరమవృత్తి యనియు, పేర్కొందురు. ఆవిద్య వేదమునందు 1. పరయనియు 2. అపరయనియు ఇరుతెఱగు. ఈ రెండు విద్యలును తెలియదగినవియై యున్నవి యని వేదజ్ఞులు, బ్రహ్మవేత్తలును నుడివెదరు. వేదవేదాంగములను అపరావిద్య యందురు. అక్షర బ్రహ్మమును పొందుట కుపయోగించు విద్యను పరావిద్య యందురు. విద్యయనిన **"వివిధ వాసనా సమూలం ద్యతి ఖండయతి వా విశేషేణ బ్రహ్మాత్మా దద్యాత్ వా ద్యోతయేత్ సా విద్యా"** యనెడి వ్యుత్పత్తులు గలవు.

## శ్రవణలక్షణము

ఈ పరావిద్యకు ముఖ్యాంగములు శ్రవణాదికములు. "**శ్రవణం మననం ధ్యానం విద్యాయాః సాధనం త్రయం**". అందు శ్రవణము అంగి, అంగభేదములచే ద్వివిధము.

1. గురుముఖమువలన మహావాక్యమును చెవిని వేసికొనుట అంగిశ్రవణ మందురు.

2. వేదాంతముయొక్క తాత్పర్యనిశ్చయ రూపమును అంగశ్రవణ మందురు. వేదాంత తాత్పర్యమును ఉపక్రమోపసంహారాది షడ్లింగములవలన తెలియ దగినదియై యున్నది.

శ్లో॥ **ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతాఫలమ్ ।**
**అర్థవాదోపపత్తిశ్చ లింగం తాత్పర్యనిర్ణయే ॥**

1. ఉపక్రమోపసంహారముల ఐక్యరూపము 2. అభ్యాసము 3. అపూర్వత 4. ఫలము 5. అర్థవాదము 6. ఉపపత్తి యని ఆరు లింగములను తాత్పర్య నిర్ణయమున చెప్పుదురు.

(1) ఏ అర్థము ఆదియందు ప్రతిపాదింపబడినదో ఆయర్థమునే అంతము నందు కూడ ప్రతిపాదించుటను ఉపక్రమోపసంహారముల యొక్క ఐక్యరూప మందురు. ఉదా॥ ఛాందోగ్యషష్ఠప్రపాఠకమున "**సదేవ సౌమ్య**" యని ఉపక్రమించి "**ఐతదాత్మ్యమిదం సర్వం**" మని ఉపసంహారము చేసియున్నారు.

(2). ఉపదేశముయొక్క అసకృదావృత్తిని అభ్యాస మందురు.

ఉదా॥ ఆ ఉపనిషత్తుననె '**తత్త్వమసి-తత్త్వమసి**' యని తొమ్మిదిమార్లు ఉపదేశము చేయబడినది.

(3) ఇతర ప్రమాణములకు దుర్లభ మగుటను అపూర్వత యందురు. "**తం త్వౌపనిషదం**"= ఇది ఉపనిషద్గమ్యమని చెప్పియుండుటచే అద్వయవస్తువు

ప్రమాణాంతరముల కందరానిది.

(4) అనర్థనివృత్తి మూలమున పరమసుఖప్రాప్తిని ఫలమందురు. అచ్చటనే **"తరతి శోకమాత్మవిత్"** = ఈ జ్ఞానమువలన శోకము సమూలముగ నివర్తించునని ఫలము చెప్పబడినది.

(5) విరోధనిందయును, ఇష్టార్థప్రశంసయు అర్థవాద మందురు. ఈ గ్రంథముననే **"మృత్యోస్స మృత్యుమాప్నోతి"** యని విరోధులగు భేదవాదులను తెగడి **"యేనాశ్రుతం శ్రుతం"** అని ఇష్టార్థమును స్తుతించియున్నారు.

(6) అర్థమునకు అనుకూలమగు దృష్టాంతములను ఉపపత్తి యందురు. ఉదా॥ **"వాచారంభణం వికారో నామధేయ"** మని ఆరంభించి ప్రపంచముయొక్క మిథ్యాత్వమునకు దృష్టాంతములను పేర్కొన్నారు.

ఛాందోగ్యమునందు షడ్లింగములను విమర్శించి అద్వైతబ్రహ్మమును తెలిసికొనునట్లు తక్కిన ఉపనిషత్తులయెడ కూడా ఇట్లె ప్రవర్తించవలయును. ఇదియే శ్రవణస్వరూపము.

శ్లో॥ **వేదాంతానామశేషాణా మాది మధ్యావసానతః ।**
**బ్రహ్మాత్మన్యేవ తాత్పర్యమితిధీః శ్రవణం భవేత్ ॥**

అర్థము: ఉపనిషత్తు లన్నింటికిని ఆది మధ్యాంతములందును బ్రహ్మాత్మల యొక్క ఏకత్వమునందె తాత్పర్యము గలదని నిశ్చయించుటను శ్రవణమందురు. **"వేదార్థపరమాద్వైతం వేదాః బ్రహ్మాత్మవిషయాః"** అను మొదలగు వాక్యములవలన వేదములకు అద్వైతమునందె తాత్పర్య మనుట గూడ నిక్కువము. శ్రుతి ప్రమాణము అజ్ఞాత అబాధ్యమగు విషయమునందె సార్థక మగుచున్నది. ఇట్లు తాత్పర్య నిర్ణయ మనెడి శ్రవణమువలన "వేదము అద్వైతమును ప్రతిపాదించునో లేదో యనెడి ప్రమాణగత (మోక్షశాస్త్ర సంబంధమగు) సంశయము తొలగుచున్నది. ఈశ్రవణము శారీరకసూత్ర శాస్త్రమున ప్రథమపాదమగు సమన్వయాధ్యాయమున చెప్పబడియున్నది.

ఇక మనన లక్షణమును చెప్పుచున్నారు.

**మనన లక్షణము:-** శ్రవణమువలన తెలిసికొనిన తత్వమును యుక్తిచే అనుసంధానము చేయుట మననమని చెప్పబడును. **"యుక్త్యాసంభావి తత్త్వాను సంధానం మననం తు తత్ "** అనియు, **"మననం తు స్వయుక్తిభిః"** అను వాక్యముల వలన మనన మననేమియో స్పష్టము. శ్రుతికి అనుకూలమగు యుక్తి శ్రుతియందు బ్రహ్మాత్మలకు ఏకత్వము ప్రతిపాదింపబడినది. భేదము నంగీ కరించుట శ్రుతికి విరుద్దము. ఇట్టి తర్కమున భేదశంకను పరిహరించవలెను. ఆత్మ బ్రహ్మమునకు భిన్నమనినచో ఆఆత్మకు ఘటమునకువలె పరిచ్ఛిన్నత్వము ప్రాప్తించును. బ్రహ్మము ఆత్మకంటె భిన్న మనినచో ఆ బ్రహ్మమునకు దేహాది పదార్థములవలె అనాత్మత్వము సిద్ధించును.

2. ప్రయోగయుక్తిని గూర్చి విచారింతము

**"జీవో బ్రహ్మాభిన్నః చేతనత్వాత్ యత్ర యత్ర చేతనత్వం తత్ర తత్ర బ్రహ్మాభిన్నత్వం యథా బ్రహ్మణి"** అనగా సత్తు, చేతనము, ఆనందములకు భిన్నమై ఆత్మ లేడు కావున ఆత్మయందు బ్రహ్మాభిన్నత్వమె యేర్పడినది.

శ్లో॥ **సదానందప్రకాశేభ్యో నాత్మాభిన్నః కథంచన ।**
**త థాత్వేఽసదనానందా జ్ఞానాని స్యుస్తవాత్మనః ॥**

అర్థము: సత్తు, ఆనందము, ప్రకాశముల కంటె వేరుగ ఆత్మ ఉండుటకు వీలులేదు. అట్లు వేరుగ ఉన్నాడనిన, ఓ వికటవాదీ! నీ ఆత్మకు అసత్తు, నిరానంద, అజ్ఞానములు సంభవించును.

అని యిట్లు యుక్తులచే అద్వయబ్రహ్మాచింతన మొనర్చుటను మనన మందురు. ఇది శారీరక సూత్రములందు అవిరోధమనెడి ద్వితీయాధ్యాయము నందు చెప్పబడినది.

మరియు సాధనమనియు, ఫలమనియు సంజ్ఞగల మూడవ నాల్గవ అధ్యాయము లందు సాధనను గూర్చియు, ఫలమును గూర్చియు నిర్ణయము గలదు. వాటిని విచారించుటచే సాధనయందును, ఫలమునందును గల సంశయములు నివృత్తించును.

శారీరక (బ్రహ్మ) సూత్రములయొక్క ప్రతియొక్క అధ్యాయమునందును నాల్గునాల్గు పాదములు గలవు. వాటి పేర్లను అందలి సూత్ర సంఖ్యయు క్రింద వివరించుచున్నాము.

## ప్రథమాధ్యాయము

| | | |
|---|---|---|
| 1. స్పష్టసంజ్ఞకపాదమున | సూత్రములు | 31 |
| 2. అస్పష్టపాదమున | " | 32 |
| 3. జ్ఞేయపాదమున | " | 43 |
| 4. చింతాపాదమున | " | 28 |

## ద్వితీయాధ్యాయమున

| | | |
|---|---|---|
| 1. స్మృతిపాదమున | సూత్రములు | 37 |
| 2. తర్కపాదమున | " | 45 |
| 3. భూతపాదమున | " | 53 |
| 4. లింగ పాదమున | " | 22 |

## తృతీయాధ్యాయమున

| | | |
|---|---|---|
| 1. వైరాగ్యపాదమున | సూత్రములు | 27 |
| 2. తత్త్వవివేకపాదమున | " | 41 |
| 3. గుణోపసంహారపాదమున | " | 66 |
| 4. సాధనపాదమున | " | 52 |

## చతుర్థాధ్యాయమున

| | | |
|---|---|---|
| 1. జీవన్ముక్తిపాదమున | సూత్రములు | 19 |
| 2. ఉత్క్రాంతిపాదమున | " | 21 |
| 3. బ్రహ్మప్రాప్తిపాదమున | " | 16 |
| 4. బ్రహ్మలోకపాదమున | " | 22 |

ఈ పదునారు పాదములందును పేరునకు తగినట్లు ఆయా పదార్థములను నిర్వహించి నిరూపించినారు. మూలమందలి సూత్రములకు కర్త శ్రీ వేదవ్యాస భగవంతుడు. ఆచార్య పాదుడు శ్రీశంకరు డాసూత్రములకు భాష్యమును వ్రాసి యున్నాడు. సూత్రమును, భాష్యమునుగూర్చి శాస్త్ర మేలక్షణములను చెప్పుచున్నదో గమనింతము.

శ్లో॥ అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్ ।
అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః ॥

తా॥ అల్పాక్షరమును, అసందిగ్ధమును, సారవంతమును, విశ్వతోముఖమును, నిరోధము లేనిదియు, దోషరహితము నైనది సూత్రమని చెప్పబడును.

శ్లో॥ సూత్రార్థో వర్ణ్యతే యత్ర వాక్యై సూత్రానుకారిభిః ।
స్వపదాని చ వర్ణ్యంతే భాష్యం భాష్యవిదో విదుః ॥

తా॥ దేనియందు సూత్రము ననుకరించెడి సమాన వాక్యములవలన సూత్రార్థవర్ణన మొనర్చబడియున్నదో, అట్లే తన పదములకు గూడ పర్యాయ యుక్తముగ వివరణ ముండునో అట్టి దానిని భాష్య మందురు.

ఈ శారీరకభాష్యముపై అనేక వ్యాఖ్యానములు గలవు. ఆ గ్రంథమునందు గల నాలుగధ్యాయములను విచారించుటచే క్రమముగ 1. ఈశ్వరగత సంశయము 2. జీవగత సంశయము 3. సాధనగత సంశయము 4. ఫలగత సంశయమును అనెడి ప్రమేయగత సంశయములు నాలుగును పరిహారము కాగలవు. ఆ చతుర్విధ సంశయముల స్వరూపమును వాటి నివృత్తియు కూడ వేదాంత శాస్త్రములందు విస్తారముగ చెప్పబడియున్నది.

## 3. నిదిధ్యాస లక్షణము

విజాతీయవృత్తిని త్రోసివుచ్చుచు, సజాతీయవృత్తిని నిరంతరము కొనసాగించుటను నిదిధ్యాస మందురు. ప్రమాణ సంశయ వికల్ప నిద్రా స్మృతులను వృత్తు లన్నియు విజాతీయములని చెప్పబడును. వీటిని తిరస్కరించుటచే తైల

ధారవలె నిరంతరము బ్రహ్మాకారముగ నుండు వృత్తి ప్రవాహము నభ్యసించుటను ప్రత్యయ సంతతి యనియు, ఏకతానత్వ మనియు చెప్పుదురు. ఈనిదిధ్యాసము వలన విషయవాసనలు నశించును. ప్రతిబంధములు బొత్తుగ లేక పోవుటచే విద్యారూప మగు చరమావృత్తివలన బ్రహ్మమును పొందవీలున్నది. ఈ విషయమునుగూర్చి "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అని శ్రుతులలో చెప్పినట్లు సంస్కరింపబడిన బుద్ధివృత్తి వలననే బ్రహ్మము దర్శింప దగినదియై యున్నది. సూక్ష్మత్వము, ప్రత్యక్త్వము, ఉత్తమసంస్కారము, నిర్మలత-యనెడి నాలుగు లక్షణములును బ్రహ్మాకారవృత్తికి చేకూరియుండవలెను.

శంక:- బ్రహ్మము వృత్తికి విషయ మన్నచో ఆ బ్రహ్మమునకు దృశ్యత్వము కలుగుచున్నది గదా?

సమా:- వృత్తియందు ఆవరణ భంగశక్తియు, చేతనయందు ఫలప్రాప్తియు నుండుటంబట్టి వృత్తికి వేద్యమని చెప్పబడినది. "వృత్తివ్యాప్తి మపేక్ష్యైవ వేద్యత్వం ప్రాహు రాత్మనః"= ఆత్మనెరుగుటకు వృత్తివ్యాప్తియె అవసరము. వృత్తివ్యాప్తియని, ఫల వ్యాప్తియని ఆవృత్తి రెండు విధములు. వెలుపల నుండు ఘటాది జడ పదార్థముల నెరుగు వేళలందు ఫలవ్యాప్తితో ప్రయోజనము గలదు. అదెట్లనిన వృత్తివలన ఆవరణ భంగమైనను ఆ వృత్తియందలి ఫలము అనగా చిదాభాసుడు లేనిచో ఘటాదికములు ప్రకాశించుట సంభవించదు. ఉదా॥ ఒక ఇనుపగుండును మట్టిపాత్రతో మూసి యున్నారు. ఆ పాత్రను కర్రచేత పగులగొట్టినపుడు ఆవరణము తొలగినను ఆ ఇనుపముక్క కానరావలెననిన దీపాదికముల వెలుగు కావలసియున్నది. అట్లే వృత్తి వలన ఘటాదికముల ఆవరణము తొలగినను ఆభాసము వలననే ఆఘటాదులు ప్రకాశితము లగును. అయినను బ్రహ్మజ్ఞాన మందు ఫలరూపమగు ఆభాసుని యొక్క ఆవశ్యకత లేదు. కారణ మేమనిన దృష్టాంతములు వినుడు. ఒకానొక రత్నము మట్టిపాత్రతో కప్పబడియున్నది. ఆ పాత్రను కర్రతో బ్రద్దలు చేసినచో లోపలిరత్నము వేరొక్కదీప సహాయము లేక తనంతకు తానే స్వయముగ వెల్గుచు ప్రకాశించి తోపట్టుచున్నది. అట్లే మహావాక్య విచారమువలన కలిగిన వృత్తివలన (వృత్తిని ఆధారము చేసికొని కూడియుండు

చేతన వలన) అజ్ఞానావరణము తొలగినంతనె బ్రహ్మము స్వయం ప్రకాశము కాబట్టి వృత్తియందు గోచరించు చున్నది. ఆచోట ఆభాసముయొక్క తోడ్పాటు అవసరము లేదు.

శ్లో॥ బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తిరపేక్షితా ।
స్వయం ప్రకాశరూపత్వా న్నాభాస ఉపయుజ్యతే ॥ (వే.సం. తృప్తి 92)

అర్థము:- బ్రహ్మమునందు అజ్ఞానము నశించుటకొరకు వృత్తివ్యాప్తి అవసరమై యున్నది. అంతెగాని బ్రహ్మము స్వయంప్రకాశరూప మౌటంబట్టి ఆభాసునితో అక్కరలేదు. అందుచే బ్రహ్మమునకు దృశ్యత్వప్రాప్తి లేదు.

పైన చెప్పిన అహంబ్రహ్మవృత్తిచే ఎఱుగదగిన ఆవస్తు వెద్ది? అనెడి శంకకు సమాధానము చెప్పుచున్నారు.

**బ్రహ్మము తురీయస్వరూపము**

జాగ్రత్త మొదలగు అవస్థలు మూడింటియందు, విశ్వాదిత్రయమందు, విరాట్టు ప్రభృతులు ముప్పరియందును అనుస్యూతముగ వ్యాపించియుండెడి చేతనమునకే తురీయ మనిపేరు.

శ్లో॥ సత్వాజ్జాగరణం విద్యా ద్రజసా స్వప్నమాదిశేత్ ।
ప్రస్వాపం తమసా జంతో స్తురీయం త్రిమ సంతతమ్ ॥

శ్లో॥ యది జాగరిత ప్రభృతి త్రితయం పరికల్పితమాత్మని మూఢధియా ।
అభిధానమిదం తదపేక్ష్య భవే త్పరమాత్మ పదస్య తురీయ ఇతి ॥

శ్లో॥ విరాట్హిరణ్యగర్భశ్చ కారణం చేత్యుపాధయః ।
ఈశస్య య త్రిభిర్హీనం తురీయం తత్పదం విదుః ॥

తా॥ ప్రాణులకు సత్త్వగుణమువలన జాగ్రత్తయు, రజోగుణము వలన స్వప్నమును, తమస్సువలన సుషుప్తియు కల్గుచున్నది. వాటియందు సర్వదా వ్యాపకమై యుండునది తురీయము. మూఢు డగువానివలన ఆత్మయందు జాగ్రదాద్యవస్థలు మూడును ఆరోపింపబడినవి. ఆ కల్పన ననుసరించి దాని అపేక్షతోడనే పరమాత్మపదమునకు తురీయమని పేరేర్పడినది.

విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు ఈశ్వరునకు ఉపాధులు. వారి సంపర్కము లేని శుద్ధచేతనమునే "తురీయ" మని విద్వాంసులు వ్యవహరింతురు.

ఇంతకును తత్పదముయొక్క, త్వంపదముయొక్క లక్ష్యార్థమునకు తురీయమని పేరు. అది వృత్తి గమ్యము. ఆనందరూపము. ప్రకాశరూపము. నిష్ప్రపంచము. అపరిచ్ఛేద్యము. నిత్యపరబ్రహ్మము. అదియే నేనై యున్నాను.



## నాల్గవ శ్లోకం

## 1. పరమార్థతత్త్వ నిరూపణము

అవతారిక: గడచిన మూడవశ్లోకమునందు జ్ఞేయవస్తువును ప్రతిపాదించి యున్నారు. జ్ఞేయతత్త్వజ్ఞానము కలిగినను, ప్రపంచము ఎప్పటివలె నుండుటంబట్టి అనర్థనివృత్తి చేకూరదనెడి శంకకు సమాధానముగ, జ్ఞానముచే బాధింపబడిన జగత్తు మిథ్యయని నిశ్చయించుచు పరమార్థ తత్త్వమును ముందటి నాల్గవశ్లోకముతో శ్రీమదాచార్యులవారు ప్రతిపాదించుచున్నారు.

**మూల॥శ్లో॥ యదజ్ఞానతో భాతి విశ్వం సమస్తం**
**ప్రనష్టం చ సద్యో యదాత్మప్రబోధే ।**
**మనోవాగతీతం విశుద్ధం విముక్తం**
**పరబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి ॥ 4**

టీక॥ యత్ = ఏ పరబ్రహ్మమును, అజ్ఞానాత్ = ఎఱుగకపోవుటవలన, సమస్తం + విశ్వం = సర్వప్రపంచమును, భాతి = తోచుచున్నదో, యత్ = ఏ, ఆత్మ = ఆత్మయొక్క, ప్రబోధే = జ్ఞానము కలుగుచుండగా, సద్యః = తత్క్షణమే, (ప్రపంచభ్రాంతి) వినష్టం చ = నశించుచున్నదో; అట్టి, మనోవాగతీతం = మనస్సునకు వాక్కునకు అతీతమైన, విశుద్ధం = నిర్మలమైన, విముక్తం = నిత్యముక్తమైన, తత్ = ఆ, నిత్యం = నిత్యమైన, పరం = సర్వశ్రేష్ఠమైన, బ్రహ్మ + ఏవ = బ్రహ్మమే, అహం = నేను, అస్మి = అగుచున్నాను.

తా॥ ఏ పరతత్త్వముయొక్క అజ్ఞానముచే విశ్వమంతయు ప్రతీతమగు చున్నదో, దేని నెరింగినంతనే విశ్వప్రతీతి మటుమాయ మగుచున్నదో, ఎయ్యది మనోవాక్కులకు అందరానిదో, విశుద్ధమో, విముక్తమో అట్టి నిత్యపరబ్రహ్మము నేనై యున్నాను.

### I. ప్రపంచ ప్రతీతికి కారణము అజ్ఞానము

బ్రహ్మముయొక్క విశేషరూపజ్ఞానము లేకపోవుటచే నామరూపక్రియా

త్మకమును, స్థావరజంగమ రూపమునగు భూతభౌతిక ప్రపంచము కానవచ్చుచున్నది.

ఇచ్చట జగత్తు తోచుటకు కారణము అజ్ఞానమని చెప్పియుండుటచే అన్య మతవాదుల కిష్టమైన ప్రధాన, పరమాణ్వాది కారణములు నిరాకరింపబడినవి.

అయినను శ్రుతిస్మృతులయందు శుద్ధ బ్రహ్మమె యావత్ప్రపంచము నకును కారణమని చెప్పబడియున్నదిగదా! యని కొందరడుగవచ్చును; వినుడు. బ్రహ్మమె కారణమని చెప్పియున్న చోటకూడ అజ్ఞానమును చేర్చియే చెప్పియున్నారు. శుద్ధబ్రహ్మము అసంగమైనది. దానియందు కార్యకారణభావము సంభవించదు. అందుచే అజ్ఞానమే ప్రధానకారణమై యున్నది. ఆ మాటకు ప్రమాణము కూడకలదు.

**శ్లో॥ అస్య ద్వైతేంద్రజాలస్య యదుపాదానకారణమ్ ।**
**అజ్ఞానం తదుపాశ్రిత్య బ్రహ్మకారణముచ్యతే ॥**

తా॥ ఇంద్రజాలమునకు సాటియై యుండు ద్వైతప్రపంచమునకు ఉపాదాన కారణ మనబడు అజ్ఞానముతో చేరిన బ్రహ్మమునె జగత్కారణ మందురు. మరియు **"అజ్ఞానమేవాస్య హి మూలకారణం"**= ఈ సంసారమునకు అజ్ఞానమే మూలకారణము. **"అజ్ఞానాద్బ్రహ్మణో జాత, ఆకాశో బుద్బుదోపమం"**= బ్రహ్మముయొక్క అజ్ఞానము చేతనే బుద్బుదోపమగు ఆకాశము పుట్టినది. **"ఆత్మాజ్ఞానాత్ జగద్భాతి"**= ఆత్మ విషయకమగు అజ్ఞానమువలననే జగత్తు భాసించుచున్నది. ఈ మొదలగు శాస్త్ర వాక్యములనుబట్టి అజ్ఞానమే కారణమని చెప్పియున్నారు. మరియును దేశకాల భూతాదికములందు దోచు కారణత్వమును, దేహాదికములందు తోచు కార్యత్వమును, స్వప్నపదార్థములందు దోచు కారణ కార్యత్వములవంటివె కాబట్టి యావద్విశ్వమును అవిద్యాకల్పితమయ్యే యున్నది.

**శ్లో॥ నిద్రాకల్పితదేశకాలవిషయజ్ఞాతాది సర్వం యథా ।**
**మిథ్యా తద్వదిహాపి జాగ్రది జగత్స్వాజ్ఞానకార్యత్వతః ॥**

తా॥ నిద్రాకల్పితములై స్వప్నమునం దగపడు దేశకాలవిషయములును జ్ఞాతాది త్రిపుటులును ఎట్లు మిథ్యలై యున్నవో అట్లే ఆత్మయొక్క అజ్ఞానకార్యమై

జాగ్రత్తయందు తోచు సమస్త జగత్తు సైతము మిథ్యామాత్రమే.

స్వప్నమునందలి వస్తువులు కొద్దికాలము మాత్రము నిలిచియుండుటయు, జాగ్రద్దశయందలి పదార్థములు బహుకాలము నిలువ గల్గుటయు ననెడి యీ భేదము కూడ అవిద్యా ప్రభావముననే యేర్పడినది.

కొందరు శాస్త్రకారులు స్వప్నపదార్థములకు ప్రాతిభాసికసత్తయు । జాగ్రద్వస్తువులకు వ్యావహారిక సత్తయు నంగీకరించుట- స్వప్నమునకు పోల్చి జాగ్రత్తను కూడ మిథ్యయని జిజ్ఞాసువునకు తెలియజేయుటకె కాని వేరొండు కారణము లేదు.

అయినను సిద్ధాంతమునందు వ్యవహారసత్తను ఒప్పుకొనుట లేదు. చేతనము పరమార్థసత్త గలది. దానికి భిన్నములగు అనాత్మ పదార్థము లన్నియు ప్రాతిభాసిక సత్తను చేరును, సిద్ధాంతమున దృష్టిసృష్టివాదమే. అనగా దృష్టియే సృష్టి లేదా దృష్టి ననుసరించి సృష్టి యనెడి వాదమే ప్రధానమై యున్నది.

వేదములందు క్రమసృష్టి కలదు గదా యని యెవరైన ప్రశ్నించవచ్చును. వినుడు. సృష్టియొక్క క్రమమును చెప్పవలయు ననుట వేదముల అంతరాభిప్రాయము కాదు. ఏదో ఒక విధమున ప్రపంచమును అధ్యారోప మొనర్చి జిజ్ఞాసువునకు అద్వైత బ్రహ్మము నెఱుక పఱచుటయును, విలోమపద్ధతిలో సృష్టిక్రమము లయచింతనము జేయించి దాని చిత్తమును అద్వైతమందు ప్రతిష్ఠింపించుటయు వేదముల యొక్కతాత్పర్యము. అంతేకాని సృష్టిని వర్ణించుటచేతను తెలిసికొనుటచేతను ప్రయోజన మేమియు లేదు.

**శ్లో॥ న హి సర్గాది జ్ఞానేన కించిత్ప్రయోజనం శ్రుతమ్ ।**
**అద్వయబ్రహ్మాత్మతాత్ర జ్ఞానం హి ప్రయోజనవత్ ॥**

తా॥ సృష్టిజ్ఞానమున లేశమైనను ప్రయోజనము లేదు. అద్వయ బ్రహ్మాత్మ జ్ఞానము మాత్రమే అందరి ప్రయోజనము.

ఈ ద్వైతప్రపంచ మంతయును రజ్జువునందు సర్పమువలె అనిర్వచనీయ

రూపముతో కేవలము ప్రతీతి మాత్రము కలదియై యున్నది. ఈ జగత్తు శుక్తి రజతమువలె అనిర్వచనీయఖ్యాతి గలది. ఈ చోట 1. సత్‌ఖ్యాతిని 2. అసత్‌ఖ్యాతిని 3. ఆత్మఖ్యాతిని 4. అన్యథా ఖ్యాతిని 5. అఖ్యాతి ఖ్యాతిని ఇతరమతవాదులు పేర్కొందురుగాని సిద్ధాంతగ్రంథములం దావాదములు ఖండింపబడినవి. అనిర్వచనీయతయే తీర్మానింపబడినది. జగత్తువలె జగత్తుయొక్క జ్ఞానముకూడ అనిర్వచనీయ మైనది. సత్తునుగాక అసత్తునుగాక యుండుటయె అనిర్వచనీయము. అధిష్ఠానజ్ఞానము కలుగుటకు ముందు తోచి తదుపరి బాధింపబడున దేదియో అట్టి పదార్థమును అనిర్వచనీయ మందురు. ఈ జగత్తు అవిద్యయొక్క పరిణామమును చేతనముయొక్క వివర్తమునై యున్నది. దీనికి ఆశ్రయమును అధిష్ఠానమును, దీని భావాభావములకు సాక్షియునై చేతన మొక్కటియే కలదు. ఇట్లు ఆ శ్లోకముయొక్క మొదటి చరణముతో విశ్వప్రతీతికి కారణమును చెప్పియున్నారు. ఆచార్యులవారు రెండవచరణముతో దాని నివృత్తికి వలయు నుపాయమును తెలుపుచున్నారు.

## 2. ప్రపంచ నివృత్తికి కారణము జ్ఞానము

బ్రహ్మముయొక్క విశేషరూపజ్ఞాన మెప్పుడు కల్గుచున్నదో అప్పటికప్పుడె ప్రపంచభ్రాంతి సమూలముగ నశించును.

శంక: ప్రపంచముయొక్క నాశనము ప్రళయమునందు స్వతః సిద్ధించు చుండ వెండియు జ్ఞానమువలన నేమి ప్రయోజనము!

సమా: ప్రళయమునందు జగత్తునకు కల్గెడి నివృత్తి అత్యంతనివృత్తి కాదు. 1. నిత్యప్రళయము 2. నైమిత్తిక ప్రళయము 3. కల్పప్రళయము 4. మహాప్రళయము లను వీటియందు జగత్తు తనకారణములో లయించును. తిరిగి జీవకోట్లయొక్క వెనుకటి కర్మరాశి ఫలోదయమునకు దొడంగినంతట బీజమునుండి అంకురమువలె వెండియు సృష్టి ఆరంభము కాగలదు. వెంటవెంట నానా క్లేశములును విస్తరించును. జ్ఞానమువలన ప్రపంచముయొక్క అత్యంత నివృత్తి చేకూరును. తిరిగి పుట్టుట యనునదియె లేక పోవుట అత్యంతనివృత్తి యందురు. కారణ

సహితముగ జగత్తు నివృత్తి యైనచో పదంపడి జన్మమరణ సంసారము లేదు. ఆనివృత్తి అపరోక్ష జ్ఞానమువలననె సిద్ధించుచున్నది.

శ్లో॥ ఐక్యజ్ఞానం యదోత్పన్నం మహావాక్యేన చాత్మనోః ।
తదాఽవిద్యా స్వకార్యైశ్చ నశ్యత్యేవ న సంశయః ॥

తా॥ మహావాక్యమువలన బ్రహ్మాత్మలకు ఏకత్వజ్ఞానము కలిగినంతటనే కార్యసహితముగ అవిద్య నశించుచున్నది.

శంక: కర్మము అద్భుతశక్తి కలది కాబట్టి యేదేనొక కర్మవిశేషమువలననే అవిద్యను తొలగించుకొనవచ్చును గదా? కష్టసాధ్యమగు జ్ఞానమును పొందవలెనను ప్రయాస మెందులకు?

సమా: కర్మమునకును అవిద్యకును విరోధము లేదు. దానినిబట్టి కర్మము వలన అవిద్య నివృత్తి కాజాలదు.

శ్లో॥ అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్ ।
విద్యావిద్యాం నిహంత్యేవ తేజస్తిమిరసంఘవత్ ॥

తా॥ కర్మమునకును, అవిద్యకును విరోధము లేదు. కావున కర్మము అవిద్యను తొలగించలేదు. విరోధి యగుటంబట్టి చీకటిని ప్రకాశమువలె విద్యయే అవిద్యను నశింపజేయగలదు.

ఇచ్చట కర్మమును నిషేధించుటచే తోడ్తోడ వికల్పవాదము సైతము నిషేధింప బడినది. "కర్మజ్ఞానములను రెండును వేదమునందు మోక్షము కొరకై చెప్పబడియున్నవి. కొందరు జ్ఞానమును సంపాదించి మోక్షమును పొందగల్గినచో, మరికొందరు కర్మమును సంపాదించి ముక్తు లయ్యెద"రని వికల్పవాదులు చెప్పుదురు. కాని యీజ్ఞానకర్మములు రెండును సమానములు కావు. ఆకారణము చేత వికల్పవాదము పొసగదు.

మరికొందరు కర్మజ్ఞాన సముచ్చయము మోక్షమునకు హేతువందురు. అదియును అసంగతము. పరస్పరము విరోధము గల వస్తువులకు సముచ్చయ

వెట్లతుకును? **"విద్యావిరోధాన్న సముచ్చయో భవేత్"=** చీకటి వెలుగులవలె కర్మజ్ఞానములకు విరోధముండుటచే సముచ్చయము సరిపోదు. ఈ సముచ్చయము శ్రుతి స్మృతులలో పలుచోట్ల గోచరించుచున్నదే యనిన నది క్రమసముచ్చయమేగాని సమసముచ్చయము కాదు. ఈ విషయమును శ్రీ ఆచార్యపాదులవారు ఉపనిషత్ గీతాభాష్యములందెన్నో తావుల ప్రతిపాదించి యున్నారు. మొదట అంతఃకరణ శుద్ధికొఱకు పురుషుడు కర్మము నొనర్చవలెను. ఆపై కర్మసంన్యాస పూర్వకముగ జ్ఞానముకొరకు పాటుబడవలెను. కాబట్టి కేవలజ్ఞానమే మూలసహితముగ ప్రపంచమును నివర్తింపజేయును.

శంక: జ్ఞానమువలన అజ్ఞానము తన విలాససహితముగ నివృత్తి యగుగాక! అయినను ఆ అజ్ఞానము చిరకాలమునాటి దగుటంబట్టి వెనువెంటనె నివృత్తి కాజాలదు.

సమా: అజ్ఞానమునకు విరోధియగు జ్ఞానముదయించినంతనె అప్పటికప్పుడె అజ్ఞానము నశించును. చిరకాలమునుండి యుండినదయ్యు పర్వతగుహాగర్భ మందలి చీకటి దీపము వచ్చినంతనె పలాయన మగుచున్నది. అట్లే చిరకాలికమగు అజ్ఞానము కూడ జ్ఞానము కలిగినంతనె నివృత్త మగుచున్నది.

**"అజ్ఞానతోఽధ్యాసవశాత్ ప్రకాశతే, జ్ఞానే విలీయేత విరోధతః క్షణాత్"**

తా॥ సంసారమును, తత్సంబంధమగు దుఃఖాదులును ఆత్మయొక్క అజ్ఞానమువలన కలిగిన అధ్యాసవశముచే కలుగుచున్నవి. ఈ అజ్ఞానమునకు విరోధియగు జ్ఞానము సంభవ మైనంతనె క్షణమాత్రమున నవి యన్నియు విలయము కాగలవు.

అధ్యాస యన నేమియో తెలిసికొందము.

**3. అధ్యాసవర్ణము:** అధ్యాస 1. అర్థాధ్యాసయని 2. జ్ఞానాధ్యాసయని రెండు విధములు. అధిష్ఠానముకంటె విషమసత్త గల అవభాసమును (ప్రతీతిని) అధ్యాస యందురు. భ్రమజ్ఞానముయొక్క విషయమును అనగా మిథ్యావస్తువును అర్థాధ్యాస యనియు, భ్రమజ్ఞానమును జ్ఞానాధ్యాస యనియు నందురు.

మొదటిదియగు అర్థాధ్యాసము అనేక విధములై యున్నది. కొన్నియెడల సంబంధమాత్రమగు అధ్యాసమును, కొన్నిచోట్ల సంబంధవిశిష్ట సంబంధియొక్క అధ్యాసయును, అట్లే ధర్మముయొక్క అధ్యాసయు, ధర్మవిశిష్ట ధర్మిఅధ్యాసయు, అన్యోన్యాధ్యాసయును, అన్యతరాధ్యాసయును ఆయా చోట్ల ప్రవర్తించుచున్నది.

ఇందు అన్యతరాధ్యాస రెండు విధములు. 1. ఆత్మయందు అనాత్మాధ్యాస 2. అనాత్మయందు ఆత్మాధ్యాస.

ఇట్లు అధ్యాస పలువిధములై యున్నది. వాటియందు చెప్పబడిన లక్షణము ఎల్లెడలను అన్వయించగలదు.

మరియును స్వరూపాధ్యాసము, సంసర్గాధ్యాస మనెడి భేదములు కలిగి అర్థాధ్యాస ఇరుతెఱగై యున్నది. శుక్తియందు రజతముయొక్క స్వరూపాధ్యాస మేర్పడి యున్నట్లు ఆత్మయందు అనాత్మ పదార్థములయొక్క స్వరూపాధ్యాసము కల్గినది. వాటియందలి అజ్ఞానముయొక్క అధ్యాసమును కారణాధ్యాస యందురు. అజ్ఞానముయొక్క అధ్యాసయందు మరియొక కారణ మగత్యము లేదు. తన అధ్యాసమునందు తానే నిర్వాహకమై యుండగలదు.

అహంకారాది పదార్థములయొక్క అధ్యాసము కార్యాధ్యాస యందురు. ఈకారణ కార్యాధ్యాసలు రెండును ఆత్మయందు కల్పితములై యున్నవి.

దేనియొక్క స్వరూపము ముందునుండియు, సిద్ధమై యుండియు సంబంధ మాత్రమున అనిర్వచనీయమై కలిగెడి అధ్యాసను సంసర్గాధ్యాస యందురు. అద్దమునందు ముఖమునకు గల సంబంధము అనిర్వచనీయ మైనది. అట్లే అనాత్మరూపములగు అహంకారాదులయందు చేతనరూపమును ఆత్మకు గల సంబంధముతో అధ్యాస యేర్పడుచున్నది. ఈ అధ్యాస స్వరూపతః కాదు.

అనాత్మపదార్థములకు కొన్నింటికి కేవల ధర్మాధ్యాసమును, మరికొన్నిటికి ధర్మసహితముగ ధర్మియొక్క అధ్యాసమును ఉన్నది. ఇంద్రియములకు కేవల ధర్మాధ్యాసమును, అంతఃకరణమునకు ధర్మసహిత ధర్మియొక్క అధ్యాసయును కలదు.

దేహాదికములను అభ్యంతర పదార్థములందు అహంకారాధ్యాస కలిగి నంతటనె స్త్రీ పుత్రాదులందు మమకారాధ్యాస సిద్ధించుచున్నది. ఇదియె సంసార బంధము. జ్ఞానము కలిగినంతనె కారణసహితముగ సంసారము నివృత్తి యగుచున్నది.

**4. జ్ఞానమునకు కాలావధి లేదు:** జ్ఞానము సంభవించుట కొక కాలనియ మము లేదు. ఉత్తమ సంస్కార వంతునకు శీఘ్రకాలముననె కలుగగలదు. ఉపవనము నందు అగోచరులై యుండిన సిద్ధులు పల్కిన స్వానుభవ గీతములను విన్నంతనె జనకమహారాజునకు జ్ఞాన ముదయించినది. ఇట్లే ఖట్వాంగ రహూగణ యదురాజులు మొదలగు పుణ్యపురుషులకు శ్రవణమాత్రముననె వెంట వెంట జ్ఞానము సిద్ధించినది. కాబట్టి ఉత్తమపురుషు లగువారు బ్రహ్మవేత్త యగు సద్గురునివలన ఉపదేశమును బొంది ఉపపత్తి కలవారై, యెల్లయెడల గురుబుద్ధి నుంచుకొని వదలదగిన దోషములను వదలుచు, గ్రహింపదగిన గుణములను గ్రహించు చుండవలెను. దత్తాత్రేయస్వామివారు ఇరువదినాల్గు పదార్థములందు గురుబుద్ధి నుంచి గుణములను మాత్రమే స్వీకరించినారు.

ప్రతిబంధ దోషములం దేఒక్కటి యైనను చిత్తమందున్నచో అట్టివానికి బ్రహ్మవేత్త యగు గురుడు ఎంతెంత ఉపదేశించినను శీఘ్రముగ జ్ఞానోదయము కలుగదు. ఋభుమహర్షి నిదాఘరాజునకు వేయిసంవత్సరములు తత్త్వోపదేశ మొనర్చినను అప్పుడాతనికి జ్ఞానము కలుగలేదు. తర్వాత నరకభయమును ప్రదర్శించినంతట నాతడు స్వప్నమున యమపురమును గాంచి మేల్కొని గురూపదేశమున నాసక్తుడై జ్ఞానము నార్జించెను. అందువలన ప్రతిబంధయుక్తునకు సద్యఃజ్ఞానప్రాప్తి లేదనుట నిక్కము.

**5. ప్రతిబంధత్రయము:** 1. భూతప్రతిబంధమని 2. భవిష్యత్ (భావి) ప్రతిబంధమని 3. వర్తమాన ప్రతిబంధమని ప్రతిబంధములు మూడు. అందు వర్తమానప్రతిబంధము 1 విషయాసక్తి 2. ప్రజ్ఞామాంద్యము 3. కుతర్కము 4. దురాగ్రహము ననెడి అంతర్భేదములచే నాలుగు తెరగులు. ప్రతిబంధములు తొలగి నంతట జ్ఞానము సిద్ధించును.

శ్లో॥ కుతస్తదజ్ఞానమితిచే త్తద్ధి బంధపరిక్షయాత్
అసావపి చ భూతో వా భావి వా వర్తతేఽథవా ।
ప్రతిబంధో వర్తమానో విషయాసక్తి లక్షణః
ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ - విపర్యయ దురాగ్రహః ॥

తా॥ ఈ తత్త్వజ్ఞానము ఏవిధమున కలుగుచున్నది? ప్రతిబంధములు క్షయించినంతనే జ్ఞానము కలుగుచున్నది. ఆ ప్రతిబంధము భూతభవిష్యత్ వర్తమానమని త్రివిధము. అందు వర్తమానము మరియును విషయాసక్తి ప్రజ్ఞామాంద్యము, కుతర్కము, విపర్యయ దురాగ్రాహ మనెడి భేదములచే నాలుగు భంగులు.

**1. భూతప్రతిబంధము:** ఒకానొక భిక్షువునకు ఎనుమునం దెక్కువ యగు మక్కువ యుండుటచే తత్త్వజ్ఞానము కలుగలేదు. పదంపడి ధ్యాన బలమువలన ప్రతిబంధము నశించినంత తత్త్వమును గ్రహించెను. ఈ కథ వేదాంతగ్రంథము లందు ప్రసిద్ధము.

**2. భావి (భవిష్యత్) ప్రతిబంధము:** ఈ ప్రతిబంధము కలవాడు ఈ దేహమున జ్ఞానసిద్ధిని పొందజాలడు. యోగభ్రష్టు డగును. ఈ విషయము యోగవాసిష్ఠమున కూడకలదు. కర్మశేషము, కామశేషము నాబడు. భావి ప్రతిబంధములు నశించినంత మీదట జన్మమున నాతడు జ్ఞానమును పొంది మోక్షమును బడయగలడు. వామదేవ జడభరతాదు లిందుల కుదాహరణము.

**3. వర్తమాన ప్రతిబంధము:** ఇందలి అవాంతరభేదములగు నాల్గుప్రతి బంధములును ఆయాయోగ్య ఉపాయములచే తొలగగలవు.

౧ వైరాగ్యశమదమాదులచే విషయాసక్తియు,

౨ శ్రవణముచేత బుద్ధిమాంద్యమును,

౩ మననముచే కుతర్కమును

౪ నిదిధ్యాసముచే దురాగ్రహమును తొలగగలవు.

ఇంతకూ, అధికార మొక్కటియె అవసరముగాని జ్ఞానము కలుగుటకు గడువుగాని, కాలవ్యవధిగాని లేదు.

## II. అనధికారికి తత్త్వోపదేశము వ్యర్థము

శ్లో॥ అకాలే హి యథా వృష్టిః యథా దీపో దివాకరే ।
అన్నం యథా త్వజీర్ణ స్యా ద్విత్తం చాపి గతస్పృహే ।
అధికారం వినా తద్వ ద్విఫలం బ్రహ్మబోధనమ్ ॥

తా॥ అకాలమందలి వర్షము, సూర్యుని యెదుట దీపము, అజీర్ణరోగి కిడు అన్నము, విరక్తున కిచ్చు ధనమువలె అధికారము లేనివానికి బోధించు బ్రహ్మోపదేశము వ్యర్థమగుచున్నది.

ఈ అభిప్రాయముననే దధ్యంగమహర్షి అశ్వినీకుమారులకు తత్త్వమును ఉపదేశించ లేదు. తదుపరి వారు అధికారమును సంపాదించి వచ్చి నంతనె ఉపదేశించినారు. ఆదధ్యంగుడే అధికార హీనుడైన ఇంద్రునకు ఉపదేశము చేయుటచే నది మహోపద్రవకారణ మైనది. ఈ విషయములు ఉపనిషత్తుల యందును వాటి వ్యాఖ్యానరూపమగు ఆత్మపురాణమున నాల్గవ అధ్యాయము నందును ప్రసిద్ధము లైనవి. అదే యింద్రుడు తపస్సొనర్చి నాల్గుతడవులు బ్రహ్మను చేరబోయి ఆయన వలన తత్త్వోపదేశమును బొంది కృతార్థు డయ్యెను.

విరోచనుడు పరమేష్ఠి నాశ్రయించియుకూడ అధికారహీను డగుటంబట్టి పరమతత్త్వమును పొందజాలకపోయెను. దేహాత్మబుద్ధి గలవాడై భ్రమించెను.

కాబట్టి తత్త్వజిజ్ఞాసువు ఆసురీసంపదను వదలి దైవీసంపద నవశ్యము ఆర్జింపవలయును. ఈ దైవాసుర సంపదలనుగూర్చి భగవద్గీత పదునారవ అధ్యాయమందు భగవంతుడు కృష్ణుడు విస్తారముగ పేర్కొనినాడు.

దైవీసంపదయందు సత్యదయాశౌచములు ముఖ్యము లైనవి. ఆసురీ సంపదయందు కామక్రోధలోభములు ప్రధానమైనవి.

వేదాధ్యయనాది బాహ్యకర్మములను చేయువారైననూ, అంతరంగమునందు సత్యదయాదులు లేనిచో వారు అసురు లనియే, రాక్షసు లనియే గణింపబడుదురు. రాక్షసులు సైతము వేదాధ్యయన మొనరింతురను మాటకు శ్రీరామాయణ ప్రమాణము గలదు:

శ్లో॥ అగ్నిహోత్రాణి వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే ।
సత్యం దయా చ శౌచం చ రాక్షసానాం న విద్యతే ॥

తా॥ ప్రతియొక్క రాక్షసగృహమునందును, అగ్నిహోత్రాచరణమును, వేదాధ్యయనమును చెల్లిపోవుచున్నవి. కాని వారి యందు సత్యదయా శౌచములు మాత్రము శూన్యము.

అంతరంగమున ఆసురీసంపద గలవాడే అసురుడు. వాడే రాక్షసుడు. అంతియేకాని పైన కానబడు దేహము ప్రధానము కాదు. ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి విభీషణాదులు, శరీరమును కులమునుబట్టి రాక్షసులైనను పరమభాగవతులు, బ్రహ్మనిష్ఠులునై యుండిరి. కావున మనస్సును బట్టియే దేవ దానవ మనుష్య జాతు లేర్పడినవి.

మరియును ఈశ్వరుడు, గురువు - శాస్త్రము - తన అంతఃకరణము అనెడి వాల్గింటియొక్క అనుగ్రహమును సంపాదించిన వానికి త్వరితముగ జ్ఞానప్రాప్తి యగును. సంసారము నివర్తించును. సంసారము-ప్రపంచమునని చెప్పబడు నియ్యది మిథ్యాభ్రాంతి మాత్రమేకాని ఏదేనొక పదార్థము కాదు. వస్తువు కాదు. అధిష్ఠాన రూపబ్రహ్మము నందు మొదటనే బాధితమై యున్నది. జ్ఞానముచే నశించుచున్న దనుట ఉపచారమాత్రము.

శ్లో॥ నిత్యబోధపరిపీడితం జగత్ విభ్రమం నుదతి వాక్యజామతిః ।
వాసుదేవనిహతం ధనంజయో హంతి కౌరవకులం యథా పునః ॥

తా॥ తొలుతనే భగవంతుడగు వాసుదేవునివలన హతము చేయబడిన కౌరవసైన్యమును వెండియు అర్జునుడు చంపినట్లు నిత్యబోధ స్వరూపమగు బ్రహ్మమువలన మొదటనే బాధింపబడిన సంసార (జగత్) భ్రాంతిని మహావాక్య జన్యమగు జ్ఞానము తిరిగి నశింపజేయుచున్నది.

**అవతారిక:** ఇట్లు శ్లోకముయొక్క పూర్వార్ధములో ప్రపంచప్రతీతికి కారణమును, దాని నివృత్తికి వలయు సహాయమును చెప్పి ప్రస్తుతము ఉత్తరార్ధమున అవశేష (మిగిలిన) వస్తువును ప్రదర్శించుచున్నారు.

## III. అవశేషవస్తు స్వరూప నిరూపణము.

**"మనోవాగతీతం"** ఆ వస్తువు మనోవాక్కులకు అతీత మైనది. ఈ విషయమును **"యన్మనసా న మనుతే"** = జనులు ఏ బ్రహ్మమును మనస్సుతో మననము చేసికొనజాలరో, (2) **"యద్వాచా నాభ్యుదితం"** = వాక్కుచే వర్ణింపశక్యము గాదో, (3) **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** = మనస్సహితముగ వాక్కులు దేనిని పొందజాలక వెనుదిరిగినవో"-అని చెప్పు నానాశ్రుతుల మూలమున బ్రహ్మము మనోవాక్కులకు అతీత మనుట తేలినది. **"యన్మనసా ధ్యాయతి తద్వాచా వదతి"**= పురుషుడు దేనిని మనస్సుచే ధ్యానించుచున్నాడో దానినే వాక్కుచే ఉచ్చరించు చున్నాడని శ్రుతి చెప్పుచున్నది. బ్రహ్మము ధ్యానమునకు విషయము కాదు; కాబట్టి వాక్కుచే ఉచ్చరించుటకును శక్యము కాదు. జాతిగుణక్రియా సంబంధము గల పదార్థములే వాక్కుకు విషయము లగుచున్నవి. బ్రహ్మ జాత్యాదులకు చెందనిది. అందుచే వాక్కుకు సైతము విషయము కాజాలదు.

మనోవాక్కుల క్రియావ్యాపారములకు చేతన బ్రహ్మమే ప్రవర్తకమును, ప్రకాశమునై యున్నది. ఆ బ్రహ్మము తా నా మనోవాక్కులకు విషయము కాజాలదు; అని మరికొన్ని శ్రుతులు చెప్పినవి.

ఇచ్చట మరియొక శంక గలదు. **"మనసై వేదమాప్తవ్యం తం త్వౌపనిషదం పురుషం"** బ్రహ్మము మనస్సుచేత పొందదగియున్నది. ఆ పరమాత్మ ఉపనిషద్గమ్యుడు అని శ్రుతులు నుడివినవి. ఈ వాక్యములు పైన నుడివిన శ్రుతివాక్యములకు విరుద్ధములు గదా?

సమాధానము: వినుడు. మనోవృత్తి ఆవరణభంగ మొనర్చి బ్రహ్మజ్ఞాన సిద్ధియందు ఉపయోగపడుటవలన బ్రహ్మము మనస్సుచే పొందదగినదని చెప్పియున్నారు. అంతేకాని బ్రహ్మము మనస్సునకు విషయమని చెప్పుట శ్రుతికి తాత్పర్యము కాదు. అట్లే ఉపనిషద్వాక్కులు సైతము బ్రహ్మమును లక్షణావృత్తి వలన బోధింప జాలియున్నవే కాని శక్తివృత్తివలన కాదు. కాబట్టి బ్రహ్మతత్త్వము వాక్కులకు

విషయము కాదు. శ్రుతులయందలి విరోధము నిట్లు పరిహరించుకొనవలెను.

తాత్పర్య మేమనిన 1. అంతఃకరణమునకును 2. శబ్దమునకును రెండు రెండు వృత్తులు గలవు. (1) ఫలవ్యాప్తి యని (2) వృత్తివ్యాప్తి యని అంతఃకరణ వృత్తులు రెండు. బ్రహ్మము మనస్సునకు విషయము కాదని నిషేధించిన చోట్ల ఫల వ్యాప్తిని ఊహించవలెను. మనస్సు లేదా బుద్ధిచే బ్రహ్మము పొందదగియున్నదని చెప్పిన తావులందు ఆవరణ భంగముకొరకై వృత్తివ్యాప్తిని మాత్రము గ్రహించి యున్నారని తెలిసికొనవలెను. (2) శక్తియని, లక్షణయని శబ్దవృత్తులు రెండు. బ్రహ్మము శబ్దమునకు అందరానిదని చెప్పినప్పుడు శక్తివృత్తి నిషేధింపబడినది. బ్రహ్మము శబ్దముచే తెలియదగిన దనిన చోట్ల లక్షణావృత్తి గ్రహింపబడినది.

అందుచే శ్రుతివాక్యములకు అన్యోన్యము విరోధము లేదు. బ్రహ్మము మనో వాక్కులకు విషయము కాదనుట ఫలితార్థము.

**ఆ బ్రహ్మము విశుద్ధము:** మాయ, అవిద్యల యొక్క గుణదోషము నంట నిది కాబట్టి విశేషశుద్ధమై యున్నది.

**ఆ బ్రహ్మము విముక్తము:** నిత్యముక్తమై యున్నది.

బ్రహ్మము నిత్యముక్త మగుచో బంధప్రతీతి ఎట్లు కలిగినది? వినుడు.

శ్లో॥ **బంధశ్చ మోక్షశ్చ మృషైవ మూఢాః బుద్ధేర్గుణం వస్తుని కల్పయంతి ।**
**దృగావృతం మేఘకృతాం యథా రవౌ యతోఽద్వయాసంగచిదే తదక్షరమ్ ॥**

తా॥ బుద్ధియొక్క గుణములగు బంధమోక్షములు రెండును మిథ్యలే అయినను మూఢులు వాటిని బ్రహ్మవస్తువునందారోపించుచున్నారు. తమ నేత్రములకు ఏర్పడిన మేఘావరణమును సూర్యునకు కల్గినదిగ అవివేకులు తలంచుట లేదా? అందుచే బ్రహ్మ మెల్లప్పుడును అద్వయము, అసంగము, చేతనము, అవినాశిగను నున్నది.

కూటస్థుడును బ్రహ్మమును సదా అభేదముగనె యున్నారు. బంధ మోక్షములు, జ్ఞానాజ్ఞానములనబడు. ధర్మములు వానికి లేవు. అజ్ఞానములన

మొదలగు అవస్థలు ఏడును అంత:కరణ సహితుడగు చిదాభాసునకే కలుగు చున్నవి. బంధమోక్షములు సైతము ఆయేడింటియందే అంతర్భూతములు. వాటిని వివరించు చున్నారు.

## IV. సప్తావస్థా నిరూపణము

శ్లో॥ అజ్ఞానమావృతిస్తద్వత్ విక్షేపశ్చ పరోక్షధీః
అపరోక్షమతిశ్శోక మోక్షస్తృప్తిర్నిరంకుశా ।
సప్తావస్థా ఇమాస్సంతి చిదాభాసస్యతాస్విమా
బంధమోక్షే స్థితౌతత్ర తిస్రో బంధకృతః స్మృతాః ॥

తా॥ అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము, శోకనివృత్తి, నిరంకుశతృప్తి యనెడి యేడవస్థలును చిదాభాసునకె ప్రాప్తించుచున్నవి. వీటివలననే బంధమోక్షములు కూడ ఏర్పడుచున్నవి. మొదటి మూడును బంధమునకు హేతువులు.

1. 'అద్వయ బ్రహ్మమును నేనెరుగను' అనెడి వ్యవహారమునకు హేతువు అజ్ఞానమై యున్నది.
2. "బ్రహ్మము లేదు; కానవచ్చుట లేదు-" అనెడి అసత్త్వాపాదకము, అభానాపాదకమునగు రెండంశములను ఆవరణమని చెప్పుదురు.
3. 'నేను కర్తను, భోక్తను, సంసారి' యనెడి భ్రాంతికి విక్షేప మనిపేరు. ఈమూడును బంధమునకు కారణములు.
4. బ్రహ్మము కలదు అనెడి జ్ఞానమును పరోక్షజ్ఞాన మందురు. దీనిచే బ్రహ్మము లేదనెడి ఆవరణాంశము నివర్తించును.
5. "బ్రహ్మమే నేను"- ఈ జ్ఞానము అపరోక్షజ్ఞానము. దీనిచేత అవిద్యాజాలము మొత్తము నశించును.
6. "నాయందు జన్మాది సంసారము లేదు"-ఈ నిశ్చయమును శోకనివృత్తి యందురు.

7. "నేను కృతకృత్యుడను- పొందదగిన దానిని పొందితిని"- ఈ విధమగు ఆనందాతిరేకమునకు నిరంకుశ తృప్తియందురు. శోకము నివర్తించి పరమా నందము ప్రాప్తించుటయే మోక్షము.

ఇందువలన బుద్ధిసహితుడగు చిదాభాసునియందే బంధమోక్షకల్పన మొద గూడినది. ఆ కల్పనము అవిద్యాకృత మగుటం బట్టి స్వప్నమువలె మిథ్యయై యున్నది.

దృష్టాంతము: ఒకానొక రాజునకు ఒక కలవచ్చినది. "శత్రురాజులు ముట్టడించి తన రాజ్యమును అపహరించిరి. తాను రాజ్యభ్రష్టుడై దేశదేశములు గ్రుమ్మరుచు భిక్షమెత్తి జీవించుచుండెను. ఒక సమయమున దారుణమగు కఱవు వచ్చినది. భిక్షసైతము లభించలేదు. ఆహారము దొరకమిచే ఆకలి కోర్వలేక తానొక ధనాఢ్యుని ఫలవనములో జొఱబడి కొన్ని పండ్లను ద్రుచ్చిలెను. యజమాని కనుగొని పట్టి ముళ్లచెట్టుకు కట్టించెను. దయామయుడగు తన మిత్రుడొకడు హఠాత్తుగ వచ్చి కట్లు విడిపించి తన రాజ్యమునకు కొంపోయి రాజ్యపీఠమున యథావిధి నెలకొల్పెను-" ఇంతలో కల నుండి మెలకువ కల్గినది. కట్టుటయు లేదు, విడుచుటయు లేదు, ఎప్పటివలెనే తానున్నాడు.

సిద్ధాంతము: అట్లే అవిద్యారూపమగు నిద్రయందు సర్వకల్పనలును కలుగు చున్నవి. పరమార్థదృష్టి నవలోకించిన బంధము లేదు. జన్మము లేదు. మరణము లేదు.

శ్రుతి॥ న నిరోధో నచోత్పత్తిః న బద్ధో న చ సాధకః ।
న ముముక్షుర్న వై ముక్తః ఇత్యేషా పరమార్థతా ॥

తా॥ నిశ్చయముగ దేనికిని పుట్టుక లేదు. నాశము లేదు. ఎందునను బద్ధుడు లేడు. సాధకుడు లేడు. ముముక్షువు లేడు. ముక్తుడును లేడు. ఉన్న పరమార్థమంతే.

"బ్రహ్మము నిత్యముక్తమై యున్నది. అదియె జగత్తునకు అధిష్ఠానమై, మనో వాక్కుల కతీతమై సదా శుద్ధముక్తస్వరూపమై యున్నది. ఆ పరబ్రహ్మమే నేనై యున్నాను" అని నాల్గవశ్లోకార్థము.

## ఐదవ శ్లోకం

## V. పరిశేషవస్తు స్వరూపము

**అవతారిక:** ఇంతవరకు బ్రహ్మము వాక్కునకు విషయము కాదని చెప్పిన అర్థమును స్పష్టము జేయుటకై ఆచార్యులవారు జీవన్ముక్తులు సమాధియందుండి అనుభవించు తత్త్వమును ఈ అయిదవ శ్లోకముతో ప్రతిపాదించుచున్నారు.

**మూల శ్లో॥ నిషేధే కృతే నేతి నేతీతి వాక్యైః**
**సమాధిస్థితానాం యదాభాతిపూర్ణమ్ ।**
**అవస్థాత్రయాతీత మద్వైతమేకం**
**పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి ॥ 5**

టీక॥ యదా = ఎప్పుడు, నేతి నేతీతి వాక్యైః = న+ఇతి = ఇది ఆత్మ కాదు, న+ఇతి = ఇది ఆత్మ కాదు, ఇతివాక్యైః = అనెడు వాక్యములచేత, నిషేధకృతే= దేహేంద్రియాది దృశ్యప్రపంచము నిషేధింపబడగా, (తదా = అప్పుడు), సమాధిస్థితానాం= సమాధిస్థితులగు వారి హృదయమున, పూర్ణం = పూర్ణస్వరూపమై, భాతి = ప్రకాశించు నదియు, అవస్థాత్రయ = జాగ్రత్స్వప్నసుషుప్తులకు, అతీతం= అతీత మైనదియు, ఏకం = అద్వితీయమును, తురీయం = తురీయ స్వరూపమును అగు, తత్ = ఆ, నిత్యం = నిత్యమైన, పరం = సర్వశ్రేష్ఠమైన, బ్రహ్మ+ఏవ = బ్రహ్మమే, అహం = నేను, అస్మి = అగుచున్నాను.

తా॥ "నేతి నేతి" వాక్యములచే నన్నింటిని నిషేధించినంత చివర మిగిలిన తత్త్వము సమాధిస్థితులగు జీవన్ముక్తులకు సంపూర్ణముగ గోచరించుచున్నదో, అవస్థాత్రయాతీతము, అద్వైతమును, ఏకమునై యుండు ఆనిత్యపరబ్రహ్మము నేనె అయిఉన్నాను. "నేతి నేతి" వాక్యములవలన దృశ్యముల నన్నింటిని నిషేధించి నంతట పరతత్త్వజ్ఞానము కలుగును.

వేదము విధిముఖము, నిషేధముఖము నను రెండు పద్ధతులతో జ్ఞేయబ్రహ్మమును గూర్చి ఉపదేశము చేయుచున్నది. మొదట విధిముఖమున

సోపాధిక బ్రహ్మమును బోధించి, పిమ్మట నిషేధముఖమున శుద్ధబ్రహ్మమును వేదము బోధించుచున్నది.

శంక: **"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ ఆనందో బ్రహ్మ"** యనెడు విధి వాక్యములవలన శుద్ధ బ్రహ్మమే బోధింపబడుచున్నదిగదా?

సమాధానము: అటుకాదు. వినుము. సత్యజ్ఞానాది పదములు కూడ సాక్షాత్తు శుద్ధ బ్రహ్మమును మాత్రమె బోధించునవి కావు, అనృతము, అజ్ఞానము, పరిచ్ఛిన్నము, దుఃఖము ననెడి విరోధాంశములను వ్యావృత్తి (పరిహారము) చేయుచు సత్యజ్ఞానానంత ఆనందపదములు లక్షణావృత్తిచే బ్రహ్మమును బోధించుచున్నవి. మహావాక్యములందువలె ఈపదములయందును లక్షణవలననే శుద్ధవస్తువును గ్రహింపవలయును. ఈ అర్థమునే వివరించుచున్నారు.

**1. సత్యపదముయొక్క వాచ్యార్థ లక్ష్యార్థములు**

౧ మాయయొక్క సత్తయు, చేతనముయొక్క సత్తయు రెండును చేరి సత్య పదమునకు వాచ్యార్థము. ౨ నిరపేక్షకసత్యము లక్ష్యార్థము.

**2. జ్ఞానపదమునకు వాచ్యార్థ లక్ష్యార్థములు**

౧ వృత్తిజ్ఞానమును, స్వయంప్రకాశరూపమగు జ్ఞానమును రెండును చేరి జ్ఞాన పదమునకు వాచ్యార్థము. ౨ స్వయం ప్రకాశజ్ఞానము లక్ష్యార్థము.

**3. ఆనందపదముయొక్క వాచ్యార్థ లక్ష్యార్థములు**

౧ ప్రియమోదాదివృత్తి ఆనందమును, పరమప్రేమాస్పదమగు సుఖమును రెండును చేరి ఆనందపదమునకు వాచ్యము. ౨ వృత్తి భాగమును వదలి కేవల సుఖము లక్ష్యము.

ఈ విధమున నన్ని వాక్యములందును గ్రహించవలెను. అందుచేత విధి ముఖముయొక్క పర్యవసానము నిషేధముఖమున సిద్ధించుచున్నది. అట్టి నిషేధ ముఖమున బోధించెడి శ్రుతివాక్యములను క్రింద నుదహరించుచున్నారు.

**"అథాత ఆదేశో నేతి నేతి"**

"అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమలోహితమస్నేహమచ్ఛాయమతమోవాయ్వనాకాశ-మసంగమరసమగంధమచక్షుష్కమశ్రోత్రమవాగమనోతేజస్క మప్రాణ మముఖ మమాత్రమనంతరమబాహ్యమితి"-

అర్థము: అధ్యారోపానంతరము 'నేతి నేతి' యని ఉపదేశింపబడుచున్నది.

అక్షరబ్రహ్మము-ఘటమువలె స్థూలము కాదు. పరమాణువువలె సూక్ష్మము కాదు. తృణమువలె పొట్టిది గాదు. తీగవలె దీర్ఘము కాదు. అగ్నివలె ఎఱుపు గాదు. నీటివలె ద్రవము కాదు. భూమివలె నీడగలది గాదు. చీకటివలె వల్లనిది గాదు. గాలివలె కదలిక కలది కాదు. శూన్యాకాశరూపము కాదు. సంగము లేనిది. రసగంధములు లేనిది (రసగంధములు లేని దనుటచే తోడ్తోడ శబ్దస్పర్శరూపములు గూడ నిషేధింప బడినవి), కన్ను గాదు. చెవి కాదు. (ఉపలక్షణతో తక్కిన చర్మము జిహ్వఘ్రాణములకు గూడ నిషేధము), వాక్కు కాదు. (కర్మేంద్రియము లన్నియు నిషేధింపబడినవి) మనస్సు కాదు, తేజస్సు అనగా బుద్ధి కాదు (చిత్తాహంకారములు సైతము నిషేధింపబడినవి), 'అముఖ' మనుటచే సూక్ష్మదేహము కాదు, 'అమాత్ర' మనుటతో కారణ శరీరమగు అవిద్య కాదు, బాహ్యమును గాదు, అంతరమును గాదు, తాత్పర్య మేమనిన ఉప్పుగడ్డ వలె బ్రహ్మము ఏకరసమై యున్నది.

ముందు చెప్పిన 'నేతినేతి' వాక్యమందు రెండు నకారములు గలవు. ఆ రెండును ఒకటి మూర్తమును మరొక్కటి అమూర్తమును నిషేధించుటకు ఉద్దేశింప బడినవి. భూమి, జలము, అగ్ని యనెడి మూడు భూతములు మూర్తమనియు, వాయువు, ఆకాశము అమూర్త మనియు చెప్పుదురు.

స్థూలప్రపంచమును మూర్త మనియు, సూక్ష్మప్రపంచమును అమూర్తమని కూడ చెప్పుదురు.

మరియును స్థూలసూక్ష్మ ప్రపంచములు రెండునూ కార్యరూపమై యుండుటం బట్టి మూర్త మనియు, వాటికి కారణమగు అవ్యాకృతమును అమూర్తమనియుకూడ చెప్పుట గలదు. ఇట్లామూర్తామూర్తముల రెంటిని రెండు

నకారములు నిషేధించు చున్నవి. అదియునుగాక-

శ్లో॥ **నకారేకో భావాఖ్యో స్థిరం యత్కార్యకారణమ్ ।**
**తన్నిషేధ్యతి చాన్యోఽపి ద్వయాభావమనాత్మకమ్ ॥**

తా॥ ఒక నకారముచేత కార్యకారణ రూపమగు భావము నిషేధింపబడినది, మఱియొక నకారముచే అనాత్మకము, నిస్తత్త్వకము నగు అభావము నిషేధింప బడినది. బ్రహ్మము విధిముఖమున గోచరింపదు కాబట్టి వేదము నిషేధముఖము నను ప్రతిపాదించినది.

'ఇదం' (ఇది) అనబడుచు దృశ్యరూపమై యున్న పదార్థము విధిముఖము నకు విషయము కాగలదు కాని బ్రహ్మ మట్టిది గాదు.

శ్లో॥ **సోఽహం బ్రహ్మే న సంసారీ న మత్తోఽన్యత్కదాచన ।**
**ఇతి విద్యాత్స్వమాత్మానం సా సమాధిః ప్రకీర్తితా ॥** (సూతసంహిత)

సోఽహంభావనచేత నేను పరిశుద్ధ బ్రహ్మస్వరూపమే గాని సంసారిని కాను. అట్టి దైవమున కన్యమై మరి ఏమియును లేదు అని ఆత్మయందు గల దృఢమైన భావ మేది గలదో అది సమాధి యని మునిపుంగవులచేత చెప్పబడెను.

శ్లో॥ **అథాతస్సంప్రవక్ష్యామి సమాధిం భవనాశనమ్ ।**
**సమాధిస్సంవిదుత్పత్తిః పరజీవైకతాం ప్రతి ॥** (సూతసంహిత)

తా॥ఇక నిపుడు సంసార బంధచ్ఛేదకర మగు సమాధిని గూర్చి వచింప బోవుచున్నాను. జీవాత్మపరమాత్మల ఐక్యమునకై సంవిత్తు (జ్ఞానము) నుదయింప జేయుటయే సమాధి.

శ్లో॥ **అగమస్యావిరోధేన ఊహనం తర్క ఉచ్యతే ।**
**సమం మన్యేత యల్లబ్ధ్వా సమాధిః పరికీర్తితః ॥** (అమృతవాద-18)

తా॥ శాస్త్రవిరుద్ధము గాని ఊహనము తర్క మనబడును. బ్రహ్మవస్తువును పొంది ఆ వస్తువును తానుగా అనుభవము నొందుటయే సమాధి యని విజ్ఞులచే పేర్కొనబడినది.

**శ్లో॥ సలిలే సైంధవం యద్వత్ సామ్యం భవతి యోగతః ।**
**తథాఽత్మమనసోరైక్యం సమాధిరభిధీయతే ॥** (అమృతనాద)

తా॥ ఏలాగున ఉప్పు నీటిలో గలిసినపుడు, రూపము కనబడక జలమయమై యుండునో, ఆలాగున ధ్యానమందు మనోవృత్తులు నశించి బ్రహ్మాకారమై యుండు స్థితియే సమాధి యనబడును.

**శ్లో॥ షట్చక్రాణి పరిజ్ఞాత్వా ప్రవిశే సుఖమండలం**
**ప్రవిశేద్వాయుమాకృష్య తథైవోర్ధ్వం నియోజయేత్ ।**
**వాయుం బిందుం తథా చక్రం చిత్తం చైవ సమభ్యసేత్**
**సమాధినైకేన సమమమృతం యాంతి యోగినః ॥** (యోగశిఖి 6-74)

తా॥ షట్చక్రములను చక్కగా నెఱింగి సుషుమ్నాంతర్విలసితమగు సుఖ మండలము నాశ్రయించవలయును. ప్రాణవాయువును ఆకర్షించి ఊర్ధ్వముగ నిరోధించవలయును. ఇట్లే వాయువును, బిందువును చక్రమును, చిత్తమును ఒక్కటిగ అభ్యసించవలయును. ఇటుల అభ్యాసము చేయుచు సమాధ్యవస్థను పొందినవెంటనే యోగి అమృతత్వమును పొందుచున్నాడు (ఇది యోగసమాధి)

**శ్లో॥ తదిదం తాదృశమీదృశమేతావత్తావదితి చ యన్న భవేత్ ।**
**బ్రహ్మ తదిత్యవధేయం నో చేద్విషయో భవేత్పరోక్షం చ ॥**

తా॥ తత్, ఇదం, తాదృశం, ఈదృశం, ఏతావత్, తావత్ (అది, ఇది, అట్టి, ఇట్టి, అంత, ఇంత) అనెడి ఆరుశబ్దములకు బ్రహ్మము విషయము కాబోదు. అయినచో నది కూడా దృశ్యవస్తువుగను పరోక్షమును కాగలదు.

కాబట్టి బ్రహ్మము మరియును లౌకికములగు ఆరుప్రమాణములకు సైతము విషయము కాదు. ప్రత్యక్షము, పరోక్షమునగు దృశ్యపదార్థములే షట్ప్ర మాణములకు విషయములు కాగలవు. బ్రహ్మము కాదు.

## VI. సంక్షేపముగ ప్రమాణ నిరూపణము

1. ప్రత్యక్షము 2. అనుమానము 3. శబ్దము 4. ఉపమానము 5. అర్థాపత్తి 6. అనుపలబ్ధి యనెడి భేదములచే ప్రమాణము లారువిధములై యున్నవి.

ప్రమాణజన్య జ్ఞానమునకు 'ప్రమ'యని పేరు. అదియు ప్రత్యక్షము, అనుమితి, శాబ్దికము ఉపమితి, అర్థాపత్తి, అభావప్రమయని ఆరువిధములు.

**1. ప్రత్యక్షము:-** ప్రత్యక్షజ్ఞానము జ్ఞానేంద్రియము లైదింటివలన నుద్భూతమై అయిదు విధములుగ నున్నది. తార్కికులు ఆరవదియగు మానసిక జ్ఞానమును కూడ ప్రత్యక్ష మనియె ఒప్పుదురు కాని పంచపాదికా మతానుయాయులు దానిని ఒప్పక ఆరవదిగ శాబ్దీప్రత్యక్షప్రమను గ్రహింతురు.

**2. అనుమానము:-** అనుమానము స్వార్థపరార్థ భేదములచే రెండు విధములై యుండుటం బట్టి అనుమితి జ్ఞానముకూడ రెండు విధములు.

౧ కేవలవ్యాప్తి జ్ఞానమువలన నగు అనుమితి 'స్వార్థ' మనబడును.

వాక్యప్రయోగము వలన నగునది 'పరార్థ' మనబడును.

అందు పరార్థానుమానమునకు తార్కికులు, 1. ప్రతిజ్ఞా 2. హేతు 3. దృష్టాంత 4. ఉపనయ 5. నిగమనములను అయిదింటిని అవయవములుగ గ్రహింతురు. కాని వేదాంతమునందు 1. ప్రతిజ్ఞా 2. హేతు 3. దృష్టాంత వాక్యములను మూడింటినె సమ్మతింతురు.

౧ సాధ్య విశిష్టపక్ష బోధకవాక్యము ప్రతిజ్ఞా వాక్యము.

౨ లింగ బోధకవాక్యము హేతు వాక్యము.

౩ హేతుసాధ్య సహచార బోధక వాక్యము దృష్టాంత వాక్యము.

**3. శబ్దము:-** శాబ్దీజ్ఞానమున వ్యవహార్య, పరమార్థభేదములచే రెండువిధములు. అందు వ్యవహారములు లౌకిక, వైదిక భేదములచే వెండియు రెండు తెఱగులు. ఆకాంక్షా జ్ఞానము, యోగ్యతా జ్ఞానము, తాత్పర్య జ్ఞానము, ఆసత్తియను నాల్గింటిని శబ్దబోధమునకు సహకారులుగ చెప్పుదురు.

## సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్ - సమాధి

శ్లో॥ యోగేన యోగం సంరోధ్యభావం భావేన చాంజసా ।
నిర్వికల్పం పరంతత్త్వం సదా భూత్వా పరం భవేత్ ॥
అహంభావం పరిత్యజ్య జగద్భావమనీదృశమ్ ।
నిర్వికల్పస్థితో విద్వాన్ భూయో నాప్యనుశోచతి ॥
సలిలే సైంధవం యద్వత్సామ్యం భవతి యోగతః । (త్సా)
తథాఽఽత్మ మనసోరైక్యం సమాధి రభిధీయతే ॥
యదా సంక్షీయతే ప్రాణో మానసం చ ప్రలీయతే ।
తదా సమరసత్వం యత్ సమాధిరభిధీయతే ॥
యత్సమత్వం తయోరత్ర జీవాత్మ పరమాత్మనోః ।
సమస్తనష్టసంకల్పః సమాధి రభిధీయతే ॥
ప్రభాశూన్యమనశ్శూన్యం బుద్ధిశూన్యం నిరామయమ్ ।
సర్వశూన్యం నిరాభాసం సమాధి రభిధీయతే ॥
స్వయముచ్చలితే దేహే దేహీ నిత్యం సమాధినా ।
నిశ్చలత్వం విజానీయాత్సమాధి రభిధీయతే ॥
యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర పరం పదమ్ ।
తత్ర తత్ర పరం బ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్ ॥ (6)

తా॥ యోగముచే యోగమును నిరోధించి, భావమును భావముచే నిరోధించి నిర్వకల్పమయిన పరతత్త్వము అయి పరుడగును.

అహంభావమును వదలి నిరుపమమైన జగద్భావము కల్గి నిర్వికల్పస్థితిలో విద్వాంసుడు మరల విచారించడు.

ఉప్పు నీటిలో కరిగి కలిసిపోవునట్లు ఆత్మమనస్సుల ఐక్యము సమాధి అనబడును.

ఎప్పుడు ప్రాణము క్షీణించునో, మానసమును లీనమగునో అప్పుడు సామరస్యమే సమాధి అనబడును.

జీవాత్మపరమాత్మలయొక్క సమత్వము కల్గి సమస్త సంకల్పములు నష్టమై సమాధి అనబడును.

ప్రభాశూన్యము, మనశ్శూన్యము, బుద్ధిశూన్యము, నిరామయము, సర్వ శూన్యము, నిరాభాసమును సమాధి అనబడును.

దేహమందు సమాధిచే నిత్యము దేహి స్వయముగా ఉచ్చలితుడు కాగా నిశ్చలముగా నున్నవాని నెరిగిన సమాధి యనబడును. ఎక్కడెక్కడికి మనస్సు వెళ్లునో అక్కడక్కడ పరమపదమున పరబ్రహ్మ సర్వత్ర ఉన్నాడు.

**4. ఉపమానము:-** సాదృశ్యజ్ఞానమును ఉపమితి ప్రమ యందురు. గోవును తెలియుటచే గవయమును తెలిసికొనుట సాదృశ్యజ్ఞానమువలన నైనది. మరియును తార్కికులు విధర్మజ్ఞానము వలననూ, ఉపమితిని అంగీకరింతురు. ఉష్ట్రవిధర్మ జ్ఞానమువలన ఖడ్గమృగముయొక్క జ్ఞానము చేకూరును.

**5. అర్థాపత్తి:-** సంపాదక జ్ఞానమును అర్థాపత్తిప్రమ యందురు. ఆసంపాదక కల్పనకు హేతువగు సంపాద్యజ్ఞానమును ఉపమాన ప్రమాణమని చెప్పియున్నారు. పగటియందు భుజించని పురుషుడు రాత్రియందు భుజించుచున్నాడను ప్రసంగములో వాని స్థూలత్వమే రాత్రి భోజనమునకు సంపాద్య మైనది. రాత్రి భోజనము సంపాదక మైనది. ఈ అర్థాపత్తియు ౧ దృష్టార్థాపత్తి ౨ శ్రుతార్థాపత్తి యని ద్వివిధము.

**6. అనుపలబ్ధి:-** అనుపలబ్ధి ప్రమాణమువలన అభావజ్ఞానము కలుగును. నిషేధ ముఖప్రతీతికి విషయమైననూ, ప్రతియోగీ సాపేక్షప్రతీతికి విషయమైనను అభావ మందురు. ప్రమాసహితషట్ ప్రమాణములకును నిదియె సంక్షిప్తవివరణము.

## VII. బ్రహ్మము షట్ప్రమాణములకు విషయము కాదు

1. **'అశబ్దమస్పర్శమరూపమవ్యయం'-** అని శ్రుతి చెప్పిన కైవడి బ్రహ్మము శబ్దస్పర్శాది రహితము. కాబట్టి ప్రత్యక్ష ప్రమాణమునకు విషయము కాదు.
2. **'నైవ చ తస్య లింగం'-** బ్రహ్మము లింగ (చిహ్న) రహిత మగుటచే అను మానమునకు విషయము కాదు.

3. 'యత్తదదృశ్యమగ్రాహ్యమగోత్రం'- జాత్యాది రహితమగుటంబట్టి శబ్దమునకు గోచరము కాదు.

4. "న తత్సమశ్చాభ్యధికం చ దృశ్యతే"- "న తస్య ప్రతిమా అస్తి"-సాటి లేనిది కాబట్టి బ్రహ్మము అర్థాపత్తికి విషయము కాదు.

5. "న తస్య కార్యం కరణం చ విద్యతే"- సంపాద్యకార్యము అభావ మగుట వలన బ్రహ్మము ఉపమానమునకు విషయము కాదు.

6. "నిత్యోఽనిత్యానాం"- బ్రహ్మము సదాభావరూపమై యుండుటవలన అనుపలబ్ధి ప్రమాణమునకు విషయము కాదు.

వేదాంతగ్రంథములందు విచారింపబడిన షట్ప్రమాణములకు బ్రహ్మము విషయము కాదని తేలినది.

ముఖ్యముగ తమసిద్ధికొఱకై ప్రమాణములు చేతనమును అపేక్షించును. **"ప్రమాణమప్రమాణం వా ప్రమాంతరమపేక్ష్యతే", "యతో మానానా సిద్ధ్యంతి"-** అనెడి వాక్యములు ప్రసిద్ధములై యున్నవి. ఈ అన్నింటిని బట్టి బ్రహ్మము ఏ ప్రమాణమునకును విషయభూతము కాదని నిష్కర్ష.

వేదముకూడ 'నేతి నేతి' వాక్యములచేతను, అతద్వ్యావృత్తి వలనను బ్రహ్మమును బోధించినది. సీతాదేవి రామచంద్రుని ఋషిపత్నుల కెఱుక పఱచి నట్లును, వృద్ధుడు సేనానిషేధపూర్వముగ బాలకునకు రాజును చూపించినటులను శ్రుతిసైతము అజాడనె అనుసరించి బోధించినది.

**శ్లో॥ సలిలే సైంధవం యద్వత్ సామ్యం భవతి యోగతః।**
**తథాఽత్మమనసైక్యం సమాధిరభిధీయతే** (సౌభాగ్యలక్ష్మి)

**శ్లో॥ తత్త్వావబోధ ఏవ సేవాసనాతృణపావకః।**
**ప్రోక్తః సమాధి శబ్దేన న తు తూష్ణీమవస్థితిః॥** (మహోపనిషత్ 11-12)

తా॥ వాసనామయమగు గడ్డి కుప్పను కాల్చెడి అగ్ని సత్యము నెఱుగుటయే, ఇదియే సమాధి యనబడును గాని ఊరకుండుట మాత్రము కాదు. సత్యదృష్టియే

సమాధి యగునుగాని కదలక మెదలక ఉండుట సమాధి కాజాలదు. అది జడ సమాధి, హఠసమాధి.

శ్లో॥ సంశాంతసర్వసంకల్పాయ శిలావదవస్థితిః ।
జాగ్రన్నిద్రావినిర్ముక్తా సా స్వరూపస్థితిః పరే ॥ (మైత్రేయ 2-31)

తా॥ సర్వసంకల్పరహితమై జాగ్రన్నిద్రలగు విక్షేపావరణ రహితులై రాతి బండవవలె నుండు నిశ్చలస్థితియే స్వరూపస్థితి యగుచున్నది.

శ్లో॥ నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః । (తేజోబిందు)
వృత్తివిస్మరణం సమ్యక్ సమాధిరాజ్ఞానసంజ్ఞకః ॥
(సర్వవేదాంతసిద్ధాంత సం॥ 909 శ్లో॥ అపరోక్షానుభూతి 124)

చిత్తమును వృత్తిరహితము చేసి బ్రహ్మాకారవృత్తి యందు నిలిపి తుదకు ఆవృత్తినికూడ మరచుట అనగా ధ్యాత- ధ్యానం-ధ్యేయం అను త్రిపుటినికూడ విస్మరించుట సమాధి. త్రిపుటిని మరచినపుడు మనస్సు బ్రహ్మాకారముగనే యుండును కావున సమాధి జ్ఞానమే.

శ్లో॥ బ్రహ్మాకారమనోవృత్తి ప్రవాహోఽహంకృతిం వినా ।
సంప్రజ్ఞాతసమాధిస్స్యాద్ధ్యానాభ్యాసప్రకర్షతః ॥ (ముక్తి 2-58)

తా॥ దేహేంద్రియాదికమునందు అహంభావమును వదలి ధ్యానాభ్యాసాతిశయమువలన అఖండైక రసరూపమగు బ్రహ్మమే నేననియెడి బ్రహ్మాకారరూప మనో వృత్తిప్రవాహమే అఖండాకార వృత్త్యాత్మకమగు సంప్రజ్ఞాత సమాధి యగుచున్నది. అగ్ని సంతప్తమగు లోహపిండము అగ్నిరూపముగనె గనబడినట్లు అహంభావమును పరిత్యజించి ధ్యానయోగాభ్యాసబలము వలన మనస్సు బ్రహ్మాకారమును పూనియుండుట సంప్రజ్ఞాత సమాధియని చెప్పుటచేత ధ్యానస్వరూపమగు వృత్తి యున్నటుల మాత్రమే తనకు తెలియవచ్చును కావున సంప్రజ్ఞాత అను విశేషణము సమాధిపదముతో చేర్చబడినది.

## VIII. బ్రహ్మము సమాధిస్థితులకు మాత్రమె అనుభవగమ్యము

సమాధిస్థితానాం:- అనగా సమాధియందుండెడి జీవన్ముక్తులకు మాత్రమె బ్రహ్మము అనుభవమునకు రాగలదు.

అవతారిక:- ఆ సమాధి లక్షణమును చెప్పుచున్నారు.

## IX. సమాధి లక్షణములు - భేదములును

నిరోధసంస్కార ప్రాకట్యమును, చిత్తైకాగ్ర్య పరిణామమును సమాధి యని చెప్ప బడును. అది 1. సంప్రజ్ఞాత 2. అసంప్రజ్ఞాత భేదములచే రెండు విధములు. అందు

1 సంప్రజ్ఞాతము:- అహంకారము లేక బ్రహ్మాకారముగ నుండు మనోవృత్తిని సంప్రజ్ఞాత సమాధి యందురు. దానిని "బ్రహ్మాకారమనోవృత్తి" యని శ్రుతి సైతము పేర్కొన్నది.

2. ప్రశాంతచిత్తవృత్తిని అసంప్రజ్ఞాత సమాధి యందురు. దానిని "ప్రశాంతవృత్తి కంచిత్తం పరమానందదీపకం" అని శ్రుతి చెప్పినది.

మరియును సవికల్ప నిర్వికల్ప భేదములచే సమాధి యిరుతెఱగులై యున్నది. త్రిపుటీభావ సహితముగ బ్రహ్మమునందు చిత్తము నిలిచియుండుట సవికల్పసమాధి. అదియు శబ్దానువిద్ధము, శబ్దాననువిద్ధమని రెండు విధములు. త్రిపుటీభావము లేక అఖండాకారముగ నిర్వాతదీపమువలె చిత్తము నిలిచి యుండుట నిర్వికల్పసమాధి నాబడును "ధ్యాతృ ధ్యానే విహాయ నివాతదీపవత్ యథా దీపో నివాతస్థో" అనెడి శ్రుతిస్మృతులందుకు ప్రమాణము.

అనిర్వికల్పసమాధికూడ 1. అద్వైతభావనారూప మనియు 2. అద్వైతావస్థానరూప మనియు రెండు విధములు. అందు అద్వైత బ్రహ్మాకారమగు అజ్ఞాత వృత్తితోకూడి యుండుట అద్వైతభావనారూపము. వృత్తిరహితమై స్థితిమాత్రమై యుండుట అద్వైతావస్థాన రూపము. మొదటిది సమాధికి సాధన రూపముగను, రెండవది ఫలరూపముగ నున్నది. అస్థితినిగూర్చి "సలిలసైంధవం యద్వత్-యాశిలా వదుస్థితిః", వృత్తివిస్మరణం సమ్యక్- వాసనాక్షయపాపకః" అని శ్రుతులు వర్ణించినవి.

ఆనిర్వికల్ప సమాధియందు 1. లయము 2. విక్షేపము 3. కషాయము 4. రసాస్వాదమునను విఘ్నములు నాల్గు కలవు. శ్రీ గౌడపాదాచార్యుడు చెప్పినట్లు **1. లయే సంబోధయేచ్చిత్తం 2. విక్షిప్తం శమయేత్ 3. సకషాయం విజానీయాత్ 4. వాస్వాదయేత్** అనెడి నాల్గు ఉపాయముల నాశ్రయించి పైని చెప్పిన నాల్గు విఘ్నములను నివారించుకొనవలెను.

మరియును సమాధికి సాధనములగు యమనియమాదులను ఎన్మిదింటిని యోగాంగము లందరు. అవి మున్ముందు చెప్పబడును. సమాధికి మరింత ముఖ్యమగు సాధనములు శ్రవణ మనన నిదిధ్యాసలు. నిదిధ్యాసయొక్క పరిపక్వావస్థనే సమాధి యందురు. ఈ శ్రవణాదులను వెనుక చెప్పియే యున్నాము. శ్రవణానంతరము మనన నిదిధ్యాసన సమాధుల నిమిత్తము తీవ్రయత్న మొనర్పవలెను.

శ్లో॥ **శ్రుతేః శతగుణం విద్యాన్మననం మననాదపి ।**
**నిదిధ్యాసం లక్షగుణమనంతం నిర్వికల్పకమ్ ॥** (వివేకచూ.. 365)

తా॥ శ్రవణమునకంటె మననము నూరురెట్లధికము. మననము కంటె నిదిధ్యాసము లక్షగుణాధికము. దానికంటె నిర్వికల్పసమాధి అనంత గుణితము.

శ్లో॥ **ప్రశాంతవృత్తికం చిత్తం పరమానందదీపకమ్।**
**అసంప్రజ్ఞాతనామాయం సమాధిర్యోగినాం ప్రియః ॥**
(అసంప్రజ్ఞాతసమాధి-ముక్తికోపనిషత్తు 59 శ్లో)

తా॥ స్వాతిరిక్తములగు సకలవృత్తులు నశించుటచేత వృత్తిశూన్యమైన మనస్సు కేవల పరమానంద బోధకమయి యుండునో అదియే యోగిప్రియమగు అసంప్రజ్ఞాత సమాధి యగుచున్నది. వెనుకటి సంప్రజ్ఞాత సమాధియందు ధ్యానరూప మగు వృత్తి యున్నట్లు తనకు తెలియును. కావున "సంప్రజ్ఞాత"యను విశేషణము చేర్చబడినది. ఈ సమాధియందు ధ్యానము, ధ్యేయము, ధ్యాత యనియెడి త్రిపుటి యుండజాలదు. కావున "అసంప్రజ్ఞాత" మను విశేషణము చెప్పబడినది.

శ్లో॥ **ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం చిదాత్మకమ్ ।**
**అతద్వ్యావృత్తిరూపోఽసౌ సమాధిర్మునిభావితః ॥** (60)

తా॥ జాగ్రద్వ్యవహారగోచర వ్యాపారశూన్య మైనదియు, సంకల్ప వికల్పాత్మక మానసిక వ్యాపారశూన్య మైనదియు, సుషుప్త్యవస్థారూప బుద్ధిశూన్య మైనదియు, కేవల చిన్మాత్ర మైనదియు, **"అతద్వ్యావృత్తిరూపసమాధి"**యని మునీశ్వరులు తలచుచున్నారు. బ్రహ్మముకంటె భిన్నములగు సకలపదార్థములను నిషేధించు టయే తత్స్వరూపము అని భావము.

**శ్లో॥ ఊర్ధ్వపూర్ణమధః పూర్ణం మధ్యపూర్ణం శివాత్మకమ్ ।**
**సాక్షాద్విధిముఖో హ్యేష సమాధిః పారమార్థికః ॥** (ముక్తి 61)

పై భాగము, మధ్యభాగము, క్రింది భాగము- అంతయు పరిపూర్ణ స్వరూపమైన, మంగళకరమైన ఆత్మతత్త్వ మేవిధముఖముచే సాక్షాత్తుగ బోధింప బడుచున్నదో అదియే పారమార్థిక సమాధి యందురు.

**శ్లో నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః ।**
**వృత్తివిస్మరణం సమ్యక్సమాధి రభిధీయతే ॥**

సమాధి యనగా అఖండాకారవృత్తి కలిగియుండుట సవికల్పకసమాధి. అట్టి అఖండాకారవృత్తి యను స్మరణముకూడ లేకయుండునట్టి బ్రహ్మాత్మత్వసిద్ధి నిర్వికల్పక సమాధి యనబడును.

ఇట్టి సమాధియందుండెడి జీవన్ముక్తునకు నిషేధావధి యని పరమానంద ఘనమని చెప్పబడు బ్రహ్మము అపరోక్షముగ సాక్షాత్కరించును. అట్టివానిని స్థితప్రజ్ఞుడని చెప్పుదురు. వాని లక్షణములను భగవద్గీత రెండవ అధ్యాయములో చెప్పబడినది.

**శ్లో॥ సంసిద్ధస్య ఫలం త్వేత జ్జీవన్ముక్తస్య యోగినః ।**
**బహిరంతః సదానంద రసాస్వాదనమాత్మని ॥** (వివేక చూ.419)

తా॥ సిద్ధిని బొందిన జీవన్ముక్త యోగియొక్క ఫలవిశేష మేమనిన లోపల బైట నాతని అంతరంగమెల్ల వేళలను పరమానందరస భరితమై యుండును.

అనుభవము లేక కేవల పరబ్రహ్మవిషయకమగు వర్ణనలతో, మాటలతో కాలము బుచ్చుచు అదియె బ్రహ్మానందమని తలంచు వారికి ఫలము శూన్యము.

శ్లో॥ అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే ।
ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్ ॥ (మైత్రేయ 2-3)

తా॥ నీటియందు ప్రతిబింబించిన శాఖాగ్రఫలమును చప్పరించి సంతోషించు కైవడి మూఢుడు అనుభవము లేని (వాచావేదాంతములచే) బ్రహ్మమునందు ఆనందించుచున్నాడు.

దృఢమగు బ్రాహ్మీస్థితి లేనిదే సంసారబంధము తెగిపోదు (21-2-96)

శ్లో॥ సమస్త దుఃఖ సీమేయం యన్మనోదృశ్యగోచరమ్ ।
సమస్త సుఖ సీమేయం యన్మనో బ్రహ్మగోచరమ్ ॥

తా॥ పరాక్ ప్రవణత దుఃఖనిలయముగను; ప్రత్యక్ ప్రవణత సుఖనిలయముగను నున్నది. కాబట్టి సమాధియందుండెడి పురుషునకు బ్రహ్మము లెస్సగ అనుభవగోచర మగుచున్నది.

శంక:- అయినను ఉత్థానకాలమునం దెట్టి వానికిని జాగ్రదాది ప్రపంచము తోచుచున్నది గదా?

సమా:- చెప్పెదను వినుము.

## X. అవస్థా త్రయాతీత స్వరూపము

"అవస్థాత్రయాతీతం" అని మూలమున గలదు. కాలవిశేషము అవస్థ యందురు. ఆ అవస్థ జాగ్రదాది భేదములచే ముత్తెఱగు.

1. స్వప్న సుషుప్తులకు వేరై యింద్రియజన్య జ్ఞానమునకును అజ్ఞానముయొక్క సంస్కారమునకును ఆధారమగు కాలము జాగ్రదవస్థ అనబడును.

2. ఇంద్రియజన్యము కాని విషయములను గ్రహించియుండు అంతఃకరణ వృత్తియొక్క కాలమును స్వప్నావస్థ యందురు.

3. సుఖమును, అజ్ఞానమును విషయీకరించెడి అవిద్యావృత్తి యొక్క కాలము సుషుప్త్యవస్థయని చెప్పబడును.

జాగ్రద్వ్యవహారము త్రిపుటి మూలమున సాగుచున్నది. మూడు పుటలను త్రిపుటి యందురు. పుట యనిన అవయవమునకు పేరు. అధ్యాత్మ-అధిభూత-అధిదైవములను మూటిని త్రిపుటి యందురు.

సర్వవేదాన్తసిద్ధాన్తసంగ్రహము

శ్లో॥ సవికల్పో నిర్వికల్ప ఇతి ద్వేధా నిగద్యతే ।
సమాధిస్సవికల్పస్య లక్షణం వచ్మి తచ్ఛృణు ॥ 809

తా॥ సవికల్పము, నిర్వికల్పము అని సమాధి రెండు విధములు. కాబట్టి సవికల్ప సమాధియొక్క లక్షణమును చెప్పుచున్నాను. వినుము.

శ్లో॥ జ్ఞాత్రాద్యవిలయే నైవ జ్ఞేయ బ్రహ్మణి కేవలే ।
తదాకారాకారితయాచిత్తవృత్తేరవస్థితిః ॥ 810
సద్భిస్సఏవ విజ్ఞేయ స్సమాధి స్సవికల్పకః ॥

తా॥ జ్ఞాత జ్ఞానము జ్ఞేయములను నీవికల్పములు విలయ మొందకయే, చిత్తవృత్తిని బ్రహ్మాకారముజేసి కేవలమగు జ్ఞేయబ్రహ్మమునందు నిలుపుటయే సవికల్ప సమాధియని చెప్పబడును.

| | అధ్యాత్మము | అధిభూతము | అధిదైవము |
|---|---|---|---|
| 1. | శ్రోత్రము | శబ్దము | దిగ్దేవత |
| 2. | చర్మము | స్పర్శము | వాయువు |
| 3. | నేత్రము | రూపము | సూర్యుడు |
| 4. | జిహ్వా | రసము | వరుణుడు |
| 5. | ఘ్రాణము (నాసిక) | గంధము | అశ్వినీకుమారులు |
| 6. | వాక్కు | వచనము | అగ్ని |
| 7. | హస్తము | ఆదాన-ప్రదానము | ఇంద్రుడు |
| 8. | పాదము | గమనము | విష్ణువు |
| 9. | ఉపస్థ | రతి | ప్రజాపతి |

| | | | |
|---|---|---|---|
| 10. | గుదము | మలత్యాగము | యముడు |
| 11. | మనస్సు | మంతవ్యము | చంద్రుడు |
| 12. | బుద్ధి | బోద్ధవ్యము | విధి |
| 13. | చిత్తము | చేతయితవ్యము | వాసుదేవుడు |
| 14. | అహంకారము | అహంకర్తవ్యము | రుద్రుడు |

ఈ పదునాల్గు త్రిపుటులును జాగ్రత్తయందుండునట్లు అంతరమనోమయ త్రిపుటులును స్వప్నమునందు తెలియవలెను. కాని సుషుప్తియందు త్రిపుటులన్నియు లయించును.

జాగ్రదాది అవస్థలయందు నేత్ర కంఠ హృదయము లనెడి ప్రదేశములందు విశ్వ తైజస ప్రాజ్ఞ లనెడి భోక్తలు, స్థూల ప్రవివ్యక్త ఆనందము లనెడి భోగ్యములును, సుఖదుఃఖరూప భోగములును సంభవించుచున్నవి. వాటికి విలక్షణమై సాక్షియగు ఆత్మ ఉన్నది. ఆ ఆత్మయే తానని విద్వాంసుడు భావించును. అట్టి విద్వాంసునకు ఉత్థానకాలమున సైతము అవస్థాత్రయాతీతమగు సాక్షియొక్క స్మరణమె కలుగుచున్నది.

శంక:- సాక్షియగు ఆత్మ మూడు అవస్థలకును అతీతుడైయుండుగాక; అయినను ప్రతిశరీరమందును వేరువేరుగ నుండుటచే అనేకత్వమును పొంది యున్నాడు. కాబట్టి బ్రహ్మముకంటె భిన్నుడు.

సమాధానము:- **"జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే-తద్బ్రహ్మ"** జాగ్రదాది ప్రపంచమునకు ప్రకాశకమైన చేతన బ్రహ్మము, **"ఏకో వశీ సర్వ భూతాంతరాత్మా"=** సర్వభూతాంతరమగు ఆత్మయు నానాత్వభేదరహిత మనెడి శ్రుత్యర్థములను ప్రతిపాదించుచున్నారు.

## XI. అద్వైత స్వరూపము

మూలశ్లోకమున "అద్వైతమేకం" అని కలదు. ఈప్రత్యగభిన్న చేతనము ఏకాద్వైతరూపమై యున్నది. దానినే "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని శ్రుతి చెప్పినది. ఏకం-ఏవ-అద్వితీయం అనుమూడు పదములతో సజాతీయాది

భేదములను మూడింటిని శ్రుతి పరిహరించినది. ఈ మూడు భేదములును అవయవములు గల జడపదార్థములందే సంభవించును. చేతనయందు సంభవించవు.

1. వృక్షమునకును మరియొక వృక్షమునకును గల భేదమును సజాతీయ భేద మందురు.
2. వృక్షమునకును రాతికిని గల భేదము విజాతీయభేదము.
3. వృక్షమునకును దానియందు గల కొమ్మలు రెమ్మలు ఆకులు పూలు మొదలగువాని అన్యోన్యభేదము స్వగతభేదము.

ఈ మూడు భేదములును చేతనమగు బ్రహ్మమునందు సంభవింపవు.

1. సత్యవస్తువు మరియొకటి లేదు కావున సజాతీయభేదము పొసగదు.**"సదంతరం సజాతీయవైలక్షణ్య వివర్జనాత్"** అని శాస్త్రముకూడ చెప్పినది.
2. తనకు ప్రతియోగి వేరొకటి లేదు కాబట్టి విజాతీయభేదము సంభవింపదు. **"నా స్యాతః ప్రతియోగిత్వం విజాతీయాద్భిదా కుతః"** అని ఒకానొక వాక్యము.
3. బ్రహ్మము అవయవములు లేనిది కాబట్టి అందు స్వగతభేదము సిద్ధించదు **"సతో నావయవాః"** అనెడి వాక్యప్రమాణము గలదు.

ఈ కారణములనుబట్టి సజాతీయాది భేదత్రయము బ్రహ్మమునందు లేదు. ఇది శ్రుతిసిద్ధము.

## XII. పంచభేదములును, వాటిపరిహారములును

1. జీవునకును ఈశ్వరునకును గలభేదము 2. జీవులలో గల పరస్పర భేదము 3. జీవునకును జడవస్తువులకును గల భేదము 4. ఈశ్వరునకును జడ వస్తువులకును గల భేదము 5 జడవస్తువులలో గల పరస్పర భేదము.

ఇట్లీ పంచభేదములను వేదాంతమునకు విముఖులగు కొందరు మత వాదులు అంగీకరింతురు. ఆ భేదసిద్ధిని ప్రతిపాదించుటకై నానాశాస్త్ర యుక్తులను సేకరించెదరు. వారందరును కేవలము భ్రాంతులే. పామరజనులకు భేదబుద్ధిని గలిపి వ్యాకుల పఱచెదరు **"ఈశాపీశాది భేదేన వ్యాకులం సకలం జగత్"** ఈ

అనన్తగు ఈశానీశభేదముచే జగత్తంతయు కలవళపడుచున్నది.

**1. జీవఈశ్వరభేదము మొదటిది.** అది సమ్మతము. తత్త్వమస్యాది మహా వాక్యములందు జీవాత్మపరమాత్మలకు ఏకత్వమే చెప్పబడియున్నది.

శంక:- జీవ-ఈశ్వరుల ఏకత్వము నంగీకరించినచో అధికారియు, ఫలదాతయు నను వ్యవస్థ లేకపోవుటచే కర్మోపాసనలు నిష్ఫల మగుచున్నవి.

సమాధానము:- కర్మోపాసనలయొక్క కర్తృత్వబుద్ధి విశిష్టచేతన యందును, ఫలదాతృత్వము మాయావిశిష్ట చేతనమునందును సంభవించునెగాని శుద్ధచేతనము నందు ఆ విభాగము లేదు. శుద్ధమగు చైతన్య పక్షమున రెంటికిని అభేదము గలదు. ఆ విషయము చతుర్విధాకాశ దృష్టాంత మూలమున వివరింప బడుచున్నది.

**శ్లో॥ కూటస్థో బ్రహ్మజీవేశా విత్యేవం చిచ్చతుర్విధా।**
**ఘటాకాశమహాకాశౌ జలాకాశాభ్రఖే యథా॥**

తా॥ ఘటాకాశ, మహాకాశ, జలాకాశ మేఘాకాశములయొక్క భేదములు ఆకాశమున కల్పింపబడునట్లు ఒకే చేతనమందు కూటస్థ బ్రహ్మ జీవేశ్వరభేదములు కల్పింపబడినవి. వాటియందు ప్రతిబింబ సహితజలమును, మేఘదృష్టిని పరిత్యజించినచో, ఘటాకాశ మహాకాశములకు సదా అభేదమే సిద్ధించియున్నది. ఇట్లే ఆభాసబుద్ధిని, మాయను త్రోసిపుచ్చినచో కూటస్థునకును బ్రహ్మమునకునూ సర్వదా అభేదమే ఏర్పడియున్నది.

**"ప్రజ్ఞానమానందం బ్రహ్మ అయమాత్మా బ్రహ్మ-క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి"**- అనెడి శ్రుతిస్మృతులును మరియు ననేకశాస్త్రవాక్యములును గజఘంటా న్యాయమున జీవబ్రహ్మముల యేకత్వమును ఉద్ఘోషించుచున్నవి.

మరియును **"ద్వితీయాద్వై భయం భవతి- పశురేవ సదేవానాం-ఏతస్మిన్నా దర మంతరం కురుతే అథ తస్య భయం భవతి-ఈషదప్యంతరం కృత్వా రౌరవం నరకం వ్రజేత్"** అని భేదవాదికి ప్రాప్తించెడి భయంకరహానిని శ్రుతిస్మృతులు చాటిచెప్పినవి. దీనినిబట్టి జీవబ్రహ్మభేదము అసంగతమని నిష్కర్ష.

**2. జీవులకు గల పరస్పరభేదము రెండవది.** జీవునియందు తోచు కర్తృత్వ భోక్తృత్వములయొక్క, నేను నీవనెడి శబ్దప్రయోగములయొక్క భేదములు కేవలసాభాసాంతఃకరణమువలనను, దేహదృష్టివలనను ఏర్పడినవెకాని చైతన్యాత్మ యందు లేవు.

తార్కికులు ఏ ఆత్మను కర్తయని, భోక్తయని, అనేకమని, విభువని, జడమని, జ్ఞానగుణము కలవాడని పలుకుదురో- సాంఖ్యులు ఏ ఆత్మను ఈశ్వరునికంటె భిన్నునిగ కర్మక్లేశాదికములు గలవానినిగ, అనేకముగ నున్నవానినిగ చెప్పుదురో- కర్మ వాదులు యే ఆత్మను కర్తయని భోక్తయని అనేకుడని నిశ్చయింతురో- ఆత్మను గురించిన వారి వారి వివాదము లన్నియు సత్యదూరములు, వేదసమ్మతములు గావు.

మిథ్యాఉపాధులచే ఆత్మకు నానాత్వము తోచినను, వివిధమగు ఉపాధుల యందుండు ఆకాశమువలె చరాచరములం దన్నింటియందును అనుస్యూతమై యుండు ఆత్మ నిజమునకు ఒకటే ఒకటి.

**"ఆకాశవత్సర్వగతశ్చ నిత్యం ఏకో దేవ సర్వభూతేషు గూఢః -**

**ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్- సమస్సర్వేషు భూతేషు"**- అనెడి శ్రుతిస్మృతులు ఆత్మ ఒకడే యనుటను సిద్ధాంతము చేయుచున్నవి. అట్టి ఆత్మ సంసారధర్మములను అంటనివాడు.

ఈ సిద్ధాంతమును అంగీకరించని భేదవాదుల నుద్దేశించి శ్రుతిస్మృతులు **"మృత్యోస్స మృత్యుమాప్నోతి-కిం తేన న కృతం పాపం-న పశ్యతి దుర్మతిః- మాయ యా వంచితో నరః-"** అని వివిధానర్థములకు గురికాగలడని హెచ్చరించు చున్నది. కావున జీవులయొక్క పరస్పరభేదములు అసంగతము.

**3. జీవునకును జడవస్తువులకును గల భేదము మూడవది.** అదియుగూడ అసంగతము. జీవునియందును, జడపదార్థములయందును కానవచ్చు శేషిశేష- కర్తృకార్య-జ్ఞాతృజ్ఞేయ, చేతనాచేతన రూపమగు భేదము స్వప్నద్రష్టకు స్వప్నపదార్థ ములవలె అవిద్యయనెడి నిద్రవలన తోచుచున్నవెకాని పరమార్థతః లేవు. ఈ

విషయమున **"తస్య త్రయ అవస్థాత్రయః స్వప్నాః", "ఆత్మజ్ఞానాదిదం సర్వం"** - అని శ్రుతిస్మృతులు ప్రమాణము కావున జీవజడభేదము అసంగత మైనది.

**4.** ఈశ్వరునకును జడవస్తువులకును గల భేదము నాల్గవది. అదియును ఒప్పదగినది కాదు. ఈశ్వరుడు సమస్తజగత్తునకును అభిన్ననిమిత్తోపాదాన కారణము. ఉపాదానమును వదలి కార్యమునకును ఉనికి లేదు. పరమార్థదృష్టితో ఈశ్వరుడు బ్రహ్మరూపమే అయిఉన్నాడు. వానియందు తోచెడి జగత్ప్రతీతి మిథ్య యైనది. ఈ విషయమునందు శ్రుతి ఇట్లు చెప్పుచున్నది. **"వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం"**= ఘటాదికార్యములయొక్క వ్యపదేశము మాత్రము నామము లేర్పడినవి. మృత్తికే సత్యము **"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే"**= పరమేశ్వరుడు మాయాశక్తివలన నానారూపమై తోచుచున్నాడు. **"మాయామాత్ర మిదం సర్వం"**- ఈద్వైతము మాయా మాత్రమై యున్నది. ఇన్నింటినిబట్టి ఈశ్వర జడభేదము సమ్మతింపదగినది కాదు.

**5.** జడపదార్థములలో గల పరస్పరభేదము అయిదవది. జడపదార్థములు స్వయముగ తామే మిథ్యలైయున్నవి కాబట్టి వాటియందు గల పరస్పరభేదము సైతము స్వప్నపదార్థములవలె మిథ్య యైనది. **"నాస్తి నాస్తి జగత్సర్వం వికల్పో న హి వస్తు"** అని శ్రుతివాక్యములు కూడగలవు.

ఈ పంచభేదములను నిరసించెడి యుక్తులు గూడ కలవు.

1. పరమార్థరూపమున జీవేశ్వరులకు భేదము లేదు.

**"ఔపాధికత్వాత్ - సోఽయం దేవదత్తవత్"**

2. జీవులకు గల పరస్పరభేదము అసత్యమైనది.

**"ఔపాధికత్వాత్ - జలచంద్రవత్"**

3. జీవజడవస్తువుల పరస్పరభేదము అసత్తు.

**"అవిద్యకత్వాత్ - స్వప్నపురుషభోగ్యవత్"**

4. ఈశ్వరజడముల భేదము సత్యము కాదు.

**"మాయకత్వాత్ - నటభావివత్"**

5. జడాజడభేదము అసత్తు.

"భ్రాంతిమూలకత్వాత్ - స్వాప్నికపదార్థభేదవత్"

గురుముఖమున చక్కగ వేదాంతవిచార మొనర్చువారి కీపంచవిధభేదముల నివృత్తి సిద్ధించును. అద్వయబోధ లభించును. దీనికి విముఖులగు మతవాదులకు పంచభ్రమలు సైతము ఏర్పడుచున్నవి.

## XIII. పంచభ్రమస్వరూపము

1. జీవపరమాత్ములయందలి భేదభ్రమ 2. ఆత్మయందు కర్తృత్వభ్రమ 3. ఆత్మయందు సంగిత్వభ్రమ 4. బ్రహ్మమునందు వికారిత్వభ్రమ 5. జగత్తునందు సత్యత్వభ్రమ.

ఇవియె పంచవిధభ్రమలు. వీటి నివృత్తిని గూర్చి చెప్పుచున్నారు.

## XIV. భ్రమనివృత్తి విచారము

1. భేదభ్రమయొక్క నిరసనము ముందే చెప్పబడినది.

2. సర్వకర్మములును సిద్ధించుటకు అయిదు హేతువులు కలవు. ౧ శరీరము నధిష్ఠించి యుండుటయు ౨ కర్తయగు అహంకారమువలనను ౩ కరణములగు ఇంద్రియములవలనను ౪ చేష్టారూపమగు ప్రాణములవలనను ౫ అధిదేవతల సహాయమువలనను- ఇట్లు పంచహేతువులచే కార్యములు, కర్మములు సిద్ధించు చున్నవి. వీటికన్నింటికిని ఆత్మ సాక్షియై యున్నాడు. అతడు సదా అకర్త. అకర్తయగు ఆత్మయందు కర్తృత్వము నారోపించువానిని దుర్మతియని భగవద్గీత తూలనాడినది.

3. మరియును దేహాదులతోడి సంగము ఆత్మకు లేదు. ఆత్మ అసంగుడు. సంగమనిన సంబంధమని యర్థము. సంబంధము సజాతీయ విజాతీయ స్వగత పదార్థములందె సంభవించును. ఘటమునకు ఘటమునందు సజాతీయ సంబంధము. పటము (వస్త్రము)నకును దారముల (తంతువుల)కును స్వగత

సంబంధము. ఘటమునకు పటమునందు విజాతీయ సంబంధము. ఆత్మయో యీత్రివిధ సంబంధములకును అతీతుడు. అందుచే అసంగుడు. దీని వివరణము ముందు చెప్పబడును.

4. బ్రహ్మము జగత్తునకు వివర్తోపాదాన కారణము. అంతియెకాని పరిణామము కాదు. ఆరంభియు కాదు. అందుచే బ్రహ్మము వికారి కాదు. తనస్వరూపమును వదలక యుండియె కార్యరూపమున తోచుటను వివర్తోపాదాన మందురు. దానికి దృష్టాంతము రజ్జుసర్పన్యాయము.

5. షట్ప్రమాణముల ననుసరించి జగత్తు మిథ్యయనియె సిద్ధాంతము.

౧ "విద్యుత్‌వత్" దృష్టనష్టస్వభావము కలిగియుండుటంబట్టి ప్రత్యక్షప్రమాణముచే మిథ్య-

౨ "జ్ఞానవివర్త్యత్వాత్" ఇత్యాది అనుమానముచే మిథ్య.

౩ "నేహ నానాస్తి-వికల్పో న హి వస్తు" ఇత్యాది శబ్దప్రమాణముచే మిథ్య.

౪ "గంధర్వనగరోపమం-స్వప్నేంద్రజాలవత్" ఇత్యాది ఉపమానము వలన మిథ్య-

౫ "తరతి శోకమాత్మవిత్" అను శ్రుతినిబట్టి శ్రుతార్థాపత్తివలన మిథ్య.

౬ సుషుప్తిసమాధులందు అనుపలంభ మగుటంబట్టి అనుపలబ్ధి ప్రమాణముచే సైతము జగత్తుమిథ్య-

ఇట్లు షట్ప్రమాణములచే జగత్తు మిథ్యయని తేలినది. సత్యము కాదు. ఇట్లు భ్రమను పరిహరించుకొన్న విద్వాంసునకు జగత్తు అనర్థకారి కాదు. అట్లు గానివానికి క్లేశకరమై యున్నది.

శ్లో॥ అపామార్గలతేవాసౌ విషమోఽపి భవభ్రమః ।
ప్రత్యగ్దృశాం విమోక్షాయ నిబంధాయ బహిర్దృశామ్ ॥

తా॥ ఉత్తరేణికాడవలె భవభ్రాంతి విషమమైనది. అనగా ఒకే ఉత్తరేణికాడ పట్టుకొనువాని తెలివితేటలనుబట్టి ముండ్లతో బాధించునదియు బాధించనిదియునై యున్నది. ప్రత్యగాత్మ దృష్టిగల విద్వాంసునకు భవము (ప్రపంచము) మోక్ష

నిమిత్తముగను, బాహ్యజగద్దృష్టి గల మూఢులకు బంధహేతువుగను పరిణమించు చున్నది. త్రాడునందు సర్పమును చూచువానికి త్రాడే భ్రాంతిచే సర్పమై భయహేతు వైనట్లును యథార్థదృష్టి గలవానికి సుఖసాధనభూత మైనట్లును తలంచునది.

1. అస్తి 2. భాతి 3. ప్రియ 4. నామ 5. రూపములను అయిదంశములు విశ్వమందు గలవు. వాటియందు మొదటిమూడును బ్రహ్మరూపములు. తక్కిన నామరూపములు అనగా జగత్తు మాయాకృత మౌటచే మిథ్యయై యున్నవి. జగద్దృష్టి కలవానికి జగత్తు క్లేశకరమై యున్నది. బ్రహ్మదృష్టి కలవాని కెట్టి క్లేశమును కల్గింప జాలదు.

**శ్రుతి॥ బ్రహ్మైతద్ధి సర్వాణి నామాని బిభర్తి ।**
**బ్రహ్మైతద్ధి సర్వాణి రూపాని బిభర్తి ।**
**బ్రహ్మైతద్ధి సర్వాణి కర్మాణి బిభర్తి ॥**

అని బృహదారణ్యకమున తృతీయాధ్యాయమున ఆరవబ్రాహ్మణమందు చెప్పబడి యున్నది. పరమార్థదృష్టితో చూచినచో నామరూప క్రియాత్మక ప్రపంచము బ్రహ్మ రూపమే అయియున్నది. జగత్తుయొక్క కల్పన మిథ్యామాత్రము. ఇట్లు విచారించు టచే పంచవిధభ్రమలు నివృత్తి కాగలవు. ఇందుకు అనుకూలమగు అయిదు దృష్టాంతములు క్రింద నుదాహరించుచున్నారు.

1. భేద భ్రమకు - బింబ ప్రతిబింబ దృష్టాంతము
2. కర్తృత్వభ్రమకు - జపాకుసుమ స్ఫటిక దృష్టాంతము
3. సంగభ్రమకు - ఘట ఆకాశ దృష్టాంతము
4 వికారభ్రమకు - రజ్జుసర్ప దృష్టాంతము
5. జగత్సత్యత్వభ్రమకు - సువర్ణభూషణ దృష్టాంతము

ఈ దృష్టాంతములను శాస్త్రములు చెప్పును. బ్రహ్మమందు భేదము కేవలము భ్రాంతపురుషులచే మాత్రము కల్పింపబడినది.

కూటస్థబ్రహ్మలకు ముఖ్యసమానాధికరణముచే సదా అభేదమే గలదు.

మాయకును మాయాకార్యమగు జగత్తునకును బ్రహ్మముతో బాధాసమానాధి కరణము ద్వారా అభేదము గలదు. అందుచే బ్రహ్మ మెల్లపుడును ఏకాద్వైత రసమైనది. ఆ విషయమును జీవన్ముక్తుడగు స్థితప్రజ్ఞు డనుభవించును. ఆనిత్య పరబ్రహ్మమే నేనైయున్నానని అయిదవ శ్లోకముయొక్క అర్థము.



## ఆరవ శ్లోకం

అవతారిక:- వెనుక మూడవ శ్లోకమునందు ఆనంద ప్రకాశనిష్ప్రపంచ రూపమగు జ్ఞేయబ్రహ్మమును ప్రతిపాదించియున్నారు. ఇప్పుడు ఈ ఆరవ శ్లోకముతో దానినే సింహావలోక మనెడి ఉపపత్తిచే వెండియు ప్రతిపాదించుచున్నారు.

**మూల శ్లో॥ యదానందలేశైః సదానందవిశ్వం**
**యదాభాతి సత్త్వే తదాభాతి సర్వమ్ ।**
**యదాలోచితే హేయమన్యత్సమస్తం**
**పరంబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి ॥ 6**

టీక॥ యత్ = ఏ, ఆనందలేశైః = బ్రహ్మానందలేశమువలన, విశ్వం = ప్రపంచము, సదానంద = శాశ్వతానంద తుందిల మగుచున్నదో, యథా = ఏ ప్రకారము, బ్రహ్మము, భాతి = ప్రకాశించుచున్నదో; అన్యత్+చ = బ్రహ్మ భిన్నమగు, సర్వం= సమస్తవిశ్వమును, తథా = ఆ ప్రకారమే, భాతి = ప్రకాశించు చున్నదో, యత్ + ఆలోచనే = ఏ బ్రహ్మావలోకన మాత్రమున, అన్యత్+సమస్తం= బ్రహ్మభిన్నమగు సమస్త విషయసుఖములును, హేయం = (క్షణభంగురములని) తెలిసి విడువదగినవి గానున్నవో, తత్ = ఆ, నిత్యం = నిత్యమైన, పరం = సర్వోత్తమమైన, బ్రహ్మ+ఏవ = బ్రహ్మమే, అహం = నేను, అస్మి = అగుచున్నాను.

తా॥ ఎద్దాని ఆనందకణమువలన విశ్వమంతయును ఆనందమయముగ భాసించుచున్నదో, దేని ప్రకాశముచే యావత్ప్రపంచమును ప్రకాశించుచున్నదో, దేనిని పర్యాలోచించుటచేత తదితర మంతయును పరిత్యజింపదగిన దగుచున్నదో అట్టి నిత్యపరబ్రహ్మము నేనే అయియున్నాను.

## XV. నామ బ్రహ్మానంద విచారము

బ్రహ్మానందముయొక్క లవలేశముచే బ్రహ్మాది పిపీలికా పర్యంతమగు సర్వ ప్రాణులును ఆనందితము లగుచున్నవి. ఈవిషయమున "ఏషహ్యేవానందయాతి-

**పితస్యైవానంద స్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతీతి"**- అని శ్రుతి చెప్పినది. ఈ ప్రత్యగభిన్న పరమాత్ముడే సర్వజగత్తునకును ఆనందము నొసగు వాడనియు ఇతని ఆనందస్వరూపముయొక్క (మాత్ర) లేశముననే యీసర్వభూత ప్రాణులును జీవించుచున్న వనియు పై శ్రుతుల కర్థము.

తైత్తిరీయోపనిషత్తునందు ద్వితీయాధ్యాయరూపమగు ఆనందవల్లియందు **"సైషానందస్యమీమాంసా భవతి"** అని ఉపక్రమించి (1) మనుష్యసుఖముయొక్క అవధిని చక్రవర్తియగు రాజునందు నిరూపించినారు. (2) దానికంటె నూరురెట్లు మనుష్యగంధర్వులయొక్క ఆనంద మనియు (3) అంతకు నూరురెట్లు దేవగంధర్వుల కనియు అట్లే వరుసగా శతగుణాధికమగు ఆనందము (4) పితృదేవతలును (5) ఆజానదేవతలును (6) కర్మదేవతలును (7) ముఖ్యదేవతలును (8) ఇంద్రుడు (9) బృహస్పతి (10) ప్రజాపతి (11) బ్రహ్మదేవుడును పొందుచున్నారు. మహారాజు మొదలుకొని బ్రహ్మదేవుని పర్యంతమును అగు ఆనంద మంతయు బ్రహ్మానంద మునందు అల్పస్వల్పమగు రేణుమాత్రము. సముద్రమునం దొకానొక భాగమగు జలముచే మేఘమేర్పడి పెరిగి సమస్త ప్రపంచ ప్రాణికోట్ల కన్నింటికిని జీవనదాన మిచ్చుచున్నట్లు బ్రహ్మానంద లేశమును బొంది జగత్తు ఆనందపులకిత మగుచున్నది.

**"యస్యానందసముద్రస్య లేశమాత్రం జగద్గతం ప్రసృతం బ్రహ్మలోకాదే"** అని శాస్త్రవాక్యము

1. ఇట్లు బ్రహ్మము ఆనందస్వరూపము కానిచో విశ్వమునకు ఆనంద మెక్కడిది? అనెడి ఉపపత్తిచేత బ్రహ్మము ఆనందస్వరూపమని చెప్పబడినది. మరియును

2. వెనుక చెప్పిన శ్రుతియొక్క అభిప్రాయము లోకలోకములందు ఆయా ఆనందముయొక్క అతిశయమును ప్రకటించుట కాదు. ఆయా లోకము వారనుభవించు విషయానందమును అనువదించి బ్రహ్మానందముయొక్క నిరతిశయత్వమును ప్రకటించినది. కామహతుడు కానివాడును, శ్రోత్రియుడును నగు జ్ఞానికి గల సంపూర్ణసుఖమును నిరూపించినది.

3. ఆ ఆనందము అక్షయము, అనంతమని వెల్లడించి బ్రహ్మలోకపర్యంత మగు మూఢులచే ఆరోపితమగు తుచ్ఛసుఖమునుండి వారిని పరాఙ్ముఖుల నొనర్చి నది **"యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి"** అనెడి శ్రుతియు స్పష్టముగ బ్రహ్మమే సుఖరూపమని పేర్కొన్నది. దానికి భిన్నమగు పరిచ్ఛిన్న ప్రపంచమునందు సుఖము లేదని నిషేధించినది. జగత్తునందు స్వతఃసుఖము లేనట్లే సత్తాభావము (అస్తిత్వప్రకాశము)లు సైతము లేవు. యాచితమండనన్యాయమువలె చేతనము యొక్క ఉనికివలననె జగత్తునకు కూడా ఉనికి యేర్పడినది. ఆఅర్థమునే చెప్పుచున్నారు.

స్వయముగ సత్తాభావము లేని జగత్తు పరమార్థ మైనది కాదు **"యదాభాతి సర్వే"** అని మూలము. అధిష్ఠాన బ్రహ్మము సామాన్యరూపమున ప్రకాశించుటచే జగత్తంతయు ప్రకాశించుచున్నది. **"తమేవ భాంతమనుభాతి సర్వం"** =స్వయంజ్యోతి యగు పరమాత్మని ప్రకాశముచే సమస్తమును వెంటవెంట ప్రకాశించుచున్నదని శ్రుతి చెప్పినది. రజ్జుశుక్త్యాదికములు సామాన్యరూపముచే ప్రకాశించుటచే అనంతరము తోడ్తో కల్పిత సర్పరజతాదికములు తోచుచున్నట్లు సర్వాధిష్ఠాన బ్రహ్మముయొక్క ప్రతీతికి పిదప "ఘటోఽస్తి పటోఽస్తి" యనెడి అస్తిత్వ వ్యవహారమునకు స్వప్నపదార్థములును యోగ్యమగుచున్నవి. అందుచే సమస్త వ్యవహారసిద్ధియు బ్రహ్మమువలననే ఘటించుచున్నది.

**శ్లో॥ సర్వోఽపి వ్యవహారస్తు బ్రహ్మణా క్రియతే జనైః**
**అజ్ఞానాన్న విజానంతి మృదేవ హి ఘటాదికమ్ ।**
**సదైవాత్మాపి శుద్ధోఽస్తి హ్యశుద్ధో భాతి వై సదా**
**యథైవ ద్వివిధా రజ్జుః జ్ఞానినోఽజ్ఞానినోఽనిశమ్ ॥**

తా॥ జనులొనర్చెడి వ్యవహార మంతయు బ్రహ్మమువలననే యేర్పడు చున్నది. మట్టివలన ఘటస్వరూపసిద్ధియు, వ్యవహారసిద్ధియు చేకూరుచున్నది. దానిని మూఢు లెరుంగరు.

జ్ఞానికి ఆత్మ శుద్ధమై ప్రకాశించును. అజ్ఞానికి భ్రాంతితో అశుద్ధుడై తోచును. త్రాడు రెండు విధముల గోచరించుచున్నది. రజ్జుస్వరూపమును తెలిసికొన్న జ్ఞానికి

పాము తోచుట లేదు. కాబట్టి భయముకూడ లేదు. అజ్ఞానికి భ్రమవలన సర్పరూపమై భయమును కల్గించినది. అట్లే జగత్తు పరమార్థము గాదు. రజ్జుసర్పము వలె ప్రతీతి మాత్రము. అధిష్ఠానరూపమగు బ్రహ్మముయొక్క జ్ఞానముచేత బాధింపబడు చున్నది.

ఆ విషయమునే చెప్పుచున్నారు.

అధిష్ఠాన జ్ఞానముచే జగత్తు బాధించబడును. "యదాలోచితే" అని మూలము. బ్రహ్మమును విచారించినంతనే తదితరమగు జగత్తంతయు హేయ(త్యాగయోగ్య) మగుచున్నది. అనగా మూడుకాలములందును మిథ్యయే అగుచున్నది. మూడు కాలములందును గంధర్వనగరము ఆకాశమున నెట్లు లేదో అట్లే ఆత్మయందు త్రికాలములందును జగత్తు లేదు.

**శ్లో॥ గంధర్వనగరం యద్వ న్నాసీదస్తి భవిష్యతి ।**
**గగనే తద్వదేవేదం విశ్వమాత్మని సర్వదా ॥**

అని శాస్త్ర వాక్యప్రమాణముకూడ కలదు. విచారించి చేతనసత్తను వేరు చేసినచో ఆకాశాది భూతము లన్నియు నిస్సత్త్వములు కాగలవు. సత్యస్వరూపమగు బ్రహ్మముయొక్క విచారణచే జన్మించిన సమ్యక్‌జ్ఞానము ద్వారా విశ్వము బాధింపబడుచున్నది. అపరోక్షమిథ్యాత్వ నిశ్చయముయొక్కపేరు "బాధ" యనబడును. **"అధ్యస్య మానం నాస్తీతి బాధ ఇత్యుచ్యతే బుధైః"**= అధ్యస్తప్రపంచము పరమార్థమునకు లేదు అనెడి నిశ్చయమునే బాధ యందురు.

శం:- తత్త్వజ్ఞానమువలన సమూల ప్రపంచము బాధింపబడినచో జ్ఞానికి వ్యవహారలోప మేర్పడును కదా?

సమాధాన:- జ్ఞానియొక్క దృష్టియందు వ్యవహారమే లేదు. లౌకిక దృష్టి ననుసరించి చెప్పిననుకూడ ప్రారబ్ధాధీనమగు దేహమున్నంతకు ప్రతిభాస మాత్రముగ లౌకికవైదిక వ్యవహారములు నడచును. అందుచే విద్యోపదేశరూపమగు సంప్రదాయ వ్యవహారమునకు లోపము లేదు. దానిచే జ్ఞానికి హానియు కలుగదు. తత్త్వ జ్ఞానము వలన సర్వానర్థములును నివర్తించుచున్నవి

"జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః।"
"క్షీణైః క్లేశైః జన్మమృత్యుప్రహాణిః॥"

తా॥ పరమాత్మ దేవుని జ్ఞానముచే సర్వపాశములును నశింపబడును. క్లేశములు తొలగుటచే జన్మాద్యనర్థములు తుదముట్ట నివృత్త మగుచున్నవని శ్రుతి చెప్పినది.

శ్లో॥ పాశాశ్చతుర్విధాశ్చైవ శాస్త్రేషు ప్రతిపాదితాః।
మలో మాయాకర్మ తత్త్వతిరోధానం చ తే మతాః॥

తా॥ 1. మలము 2. మాయ 3. కర్మము 4. తత్త్వతిరోధానమునని పాశములు నాల్గువిధములు. వాటిని వివరించుచున్నారు.

1. జ్ఞానక్రియాశక్తులను ఆచ్ఛాదించు ఒకానొక దోషము "మలము"

2. రాగద్వేషాదులకు హేతువైనది "మాయ" యనబడును.

3. "కర్మ" మనునది పుణ్యాపాప మిశ్రభేదములచే త్రివిధము

4. తత్త్వతిరోధాన మనునది ప్రాపంచిక మూఢులకు అనుభవసిద్ధమై యున్నది.

ఇట్లే క్లేశములు సైతము అయిదు విధములై యున్నవి. సూత్రము "అవిద్యాస్మితా రాగద్వేషాభినివేశాః పంచక్లేశాః" అని పతంజలి మహర్షియొక్క ఉపదేశము. అందు మొదటిది యగు అవిద్య నాలుగు విధములు.

1. అనిత్యమునందు నిత్యబుద్ధి 2. అశుచియందు శుచిబుద్ధి 3. దుఃఖము నందు సుఖబుద్ధి 4. అనాత్మయందు ఆత్మబుద్ధి.

సూ- "అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మఖ్యాతిః" అని సూత్రము. జగత్తు అనిత్య మైనది. ఈ మాటకు శ్రుతిస్మృతులు ఒప్పుకొన్నవి. పండితుల అనుభవము సైతము అట్లే యున్నది. మరియును ప్రత్యక్షాది ప్రమాణముల చేతకూడ ప్రపంచముయొక్క అనిత్యత్వము సిద్ధ మగుచున్నది.

1. స్వప్నమువలె, గంధర్వనగరమువలె దృష్టనష్టమై యుండుటవలన ప్రత్యక్ష ప్రమాణముచేత అనిత్యము.

2. జ్ఞానముచే నివృత్త మగుచుండుటంబట్టి రజ్జుసర్పమువలె అనుమాన ప్రమాణముచేత అనిత్యము.

3. "నేహ నానాస్తి - నేతి నేతి" అనెడి శ్రుతిరూపమగు శబ్దప్రమాణముచేత సైతము అనిత్యము.

4. "స్వప్నోపమమిదం సర్వం" అనెడి ఉపమానముచేతను అనిత్యమే అయియున్నది.

5. ఆత్మజ్ఞానముచేత నివర్తించుచున్నది. నిత్యవస్తువు జ్ఞానముచేత సైతము నశించదు. అందువలన అర్థాపత్తి ప్రమాణముచేతకూడ జగత్తు అనిత్యము.

6. పరమార్థముగ జగత్తు నిత్యమై యున్నచో వ్యవహార ప్రతీతివలె పరమార్థముగను కూడ తోచవలసియున్నది. అట్లు తోచకుండుటచే అనుపలబ్ధిప్రమాణమును బట్టి కూడ ప్రపంచము అనిత్యమైనదే.

అట్టి ప్రపంచమునందు నిత్యత్వబుద్ధి నుంచుట అవిద్యాలక్షణము. శరీరము అశుచియైనది. దానికి "హేతువులను 1. జాత్ 3.స్థానాత్ 3. ఉపష్టంభాత్ 4. నిష్పందాత్ 5. నిధనాత్"- అని అయిదు విధములచే శ్రీవ్యాసభగవంతుడు చెప్పియున్నాడు. అధేయ శుచిత్వము భ్రాంతివలన నైనది. అందు శుచిత్వబుద్ధిని అవిద్య యందురు.

విషయము లన్నియు దుఃఖరూపములేయై యున్నవి. అవి పరిణామతాప సంస్కారములచే సర్వమును వివేకులకు దుఃఖరూపమే యని యోగసూత్రము కలదు. ఆ విషయమునే సర్వశాస్త్రములును పేర్కొనుచున్నవి. అట్టి వాటియందు గల సుఖబుద్ధిని అవిద్యా లక్షణ మందురు.

మరియును అనాత్మరూపములగు పంచకోశములందు జ్ఞానహీనుడు ఆత్మ బుద్ధి నుంచుచున్నాడు. అది కూడ అవిద్యయె యనబడును. ఈనాల్గింటిని కార్యావిద్య యందురు. వాటికి కారణము మూలావిద్యయై యున్నది.

దృగ్దృశ్యములయొక్క తాదాత్మ్యమును అస్మిత యందురు. "సుఖానుశయీ రాగః'', "దుఃఖానుశయీ ద్వేషః" "స్వరసవాహీ అభినివేశః"- ఈ నాల్గుక్లేశము లును వ్యక్ష

మునకు బీజము అంకురము స్కంధము శాఖలవలె ప్రసుప్తము తను, విచ్ఛిన్నము, ఉదారమునను నాలుగవస్థలై యున్నవని పతంజలి చెప్పియున్నారు. ముందటి అవిద్య యనెడి క్లేశము. తర్వాత నుండు నాలుగు క్లేశములకును క్షేత్రమై యున్నది.

సూ-"అవిద్యాక్షేత్రముత్తరేషాం" అని సూత్రము. ఇట్లు ముందు చెప్పిన చతుర్విధపాశములును, ఈపంచక్లేశములును జ్ఞానముచే నివృత్తి యైనచో అట్టి విద్వాంసునకు జన్మాదులు లేవు.

సుఖదుఃఖములకు జీవసృష్టియే కారణము. ఈశ్వరసృష్టి కాదు. అహంతామమ తాధ్యాసలును జాగ్రదాది మోక్ష పర్యంతమగు సర్వప్రపంచమునూ జీవసృష్టియే అయి యున్నది. మరియు ఈక్షణాది ప్రవేశాంతమువరకు ఈశ్వరసృష్టి. ఇందు జీవద్వైతము శాస్త్రీయ అశాస్త్రీయములని రెండువిధములు. అందు అశాస్త్రీయము మందతీవ్రమని యిరు తెఱగులు. విస్తారభయముచేత దానినంతయు ఇచ్చట వివరింపలేదు. ఈ అనర్థకరమగు జీవద్వైతమును నివర్తింపజేసికొని, ఈశ్వరసృష్టిని మిథ్యయని నిశ్చయించి, శరీర ప్రారబ్ధక్షయ పర్యంతమును బాధితానువృత్తివలన శరీరనిర్వాహకములగు లౌకికవైదిక వ్యవహారమును నడుపుకొను జ్ఞానికి ఎట్టి హానియు లేదు. హానిని కలిగించెడి అవిద్య జ్ఞానకాలముననె నశించినది. దాని కార్యమగు ప్రపంచము సోపాధికభ్రమ యగుటంబట్టి మృగతృష్ణయందలి జలమువలె ప్రతిభాసమాత్రమై తోచుచుండుటంబట్టి దాని యందు సత్యత్వభ్రమ కాని, నిజ స్వరూపము నందు ద్వైతాపత్తికాని జ్ఞానికి సంభవింపదు. ఇంతకును నిష్కర్ష మేమనిన అధిష్ఠాన బ్రహ్మముయొక్క సాక్షాత్కార మైనంతనే తదితర మంతయును హేయ మగును. అనగా బాధింపబడును.

"ఏ బ్రహ్మముయొక్క లేశానందముచేత విశ్వము ఆనందమయమై కన్పట్టు చున్నదో, దేని సత్తా స్ఫూర్తులచే జగత్తు ప్రకాశమాన మైనదో, దేనియందు సమస్త ప్రపంచమును బాధను బొందినదో అట్టి బాధావధియగు నిత్యపరబ్రహ్మము నేనే అయియున్నాను" అని ఆరవశ్లోకముయొక్క అర్థము.

ఇట్లు అనుభవ మనెడి ద్వితీయోపదేశము ముగిసినది.



## ఏడవ శ్లోకం

### అథ తృతీయోపదేశః

మూల శ్లో॥ అనంతవిభుం సర్వయోనిం నిరీహం
శివం సంగహీనం యదోంకారగమ్యమ్ ।
నిరాకారమత్యుజ్జ్వలం మృత్యుహీనం
పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ 7

టీక॥ అనంతం = అంతము లేనిదియు, విభుం = సర్వవ్యాపక మైనదియు, సర్వయోనిం = జగత్కారణ మైనదియు, నిరీహం = కోరికలు లేనిదియు. శివం= మంగళకర మైనదియు, సంగహీనం = అసంగ మైనదియు, ఓంకార గమ్యం= ఓంకారముచే బొందదగినదియు, నిరాకారం = రూపము లేనిదియు అతి+ ఉజ్జ్వలం= మిక్కిలి తేజోమయమును, మృత్యుహీనం = అమృత స్వరూపమును, అగు, యత్= ఏసద్వస్తువు కలదో, తత్ = ఆ, నిత్యం = నిత్యమైన పరం = సర్వోత్తమమైన, బ్రహ్మ+ఏవ = బ్రహ్మమే; అహం = నేను, అస్మి = అగుచున్నాను.

తా॥ అనంతమును, వ్యాపకమును, సర్వకారణమును, నిరీహమును, శివ రూపమును, సంగహీనమును, ఓంకారగమ్యమును, నిరాకారమును, మహోజ్జ్వ లమును, మృత్యురహితమును నగు నిత్యపరబ్రహ్మము నేనే అయి యున్నాను.

### I. జ్ఞేయబ్రహ్మముయొక్క స్వరూపలక్షణము

1. బ్రహ్మము అనంతము. అనంతమనగా ఇంతమాత్రమని ప్రమాణము లేకుండుట. అనగా పరిచ్ఛేదము లేకుండుట. త్రివిధపరిచ్ఛేదములను గూర్చి ముందే చెప్పియున్నారు.

శ్లో॥ న వ్యాపిత్వాద్దేశతోఽంతో నిత్యత్వాన్నాపి కాలతః ।
న వస్తుతోఽపి సర్వాత్మ్యా దానంత్యం బ్రహ్మణి త్రిధా ॥

తా॥ సర్వవ్యాపి యగుటంబట్టి దేశమువలనను, నిత్యమగుటంబట్టి కాలము

వలనను, సర్వాత్మక మగుటంబట్టి వస్తువువలనను బ్రహ్మమునకు అంతము లేదు. కాబట్టి బ్రహ్మము అనంతము.

ఏది అనంతమో అదియే సత్యస్వరూపమును, జ్ఞానస్వరూపమునునై యున్నది. అందుచే బ్రహ్మము సత్యజ్ఞానానంతస్వరూప మనబడినది. ఈ సత్య జ్ఞానానంతత్వము బ్రహ్మమునకు స్వరూపలక్షణము- మరియు ఇతరభిన్నముల నుండి వ్యావృత్త మొనర్చి స్వలక్ష్యమునకు స్వరూపమే అయి యుండునది స్వరూప లక్షణ మనబడుచున్నది. ధవళత్వాదికములు గృహమునకు స్వరూపమే అయి ఉండుటచే గృహమునకు స్వరూపలక్షణములై యున్నవి. అట్లే సత్యజ్ఞానానంత గుణములు బ్రహ్మమునకు స్వరూపమై యుండుచే స్వరూపలక్షణము లైనవి. అవి అనృతాది గుణములకు వ్యావృత్తకములు కూడనైనవి.

బ్రహ్మము విభువు - అనగా వ్యాపకరూప మైనది

## II. బ్రహ్మముయొక్క తటస్థలక్షణము

బ్రహ్మము సర్వయోని. సర్వప్రపంచమునకును కారణమై యున్నది. **"జన్మాద్యస్య యతః"=** ఏ బ్రహ్మమువలన ఈజగత్తునకు జన్మాదికములు కలుగు చున్నవో యని బ్రహ్మసూత్రవచనము. **"యతో వా ఇమాని భూతాని జాయంతే=** ఏ బ్రహ్మమునందుండి యీభూతప్రాణు లుదయించుచున్నవో అని శ్రుతి చెప్పినది. ఇట్లు బ్రహ్మము జగత్తునకు కారణమనుట ప్రసిద్ధము.

అయినను శుద్ధబ్రహ్మమునందు కారణత్వమును చెప్పుట అసంభవమై యున్నది. జగత్కారణత్వము శబలబ్రహ్మమునందే సంభవించుచున్నది. అదియును ఉపాదానకారణము, నిమిత్తకారణమునని రెండువిధములు (1) కార్యమునందు ప్రవేశించి యుండునది ఉపాదానకారణ మందురు. ఘటమనెడి కార్యమునందు మృత్తిక ప్రవేశించి యుండుటచే మృత్తిక ఉపాదానకారణమై యున్నది. (2) కార్యమునందు ప్రవేశింపక తటస్థముగ నుండి కార్యమును నిర్మించునది నిమిత్తకారణ మనబడును. ఘటకార్యమునందు కుమ్మరి వాడు నిమిత్తకారణము.

ఇందు జగత్తునకు పరమేశ్వరు డొకడే ఉపాదాననిమిత్తములను రెండు విధముల కారణమై యున్నాడు. వలను నేయుటకు ఉపాదాననిమిత్తము లనెడి కారణములు రెండునూ సాలెపురుగు అయియుండునట్లు ప్రపంచమునకు ఉపాదాననిమిత్తము లనెడి కారణములు పరమాత్మయై యున్నాడు. ఇందుకు స్వప్నముకూడ దృష్టాంతము. పరమాత్ముడు తన మాయవలన, ఉపాదానకారణమైనవాడు చేతనము వలన నిమిత్త కారణమైనవాడు **"మాయాం తు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరం"** అని శ్రుతి కూడ పలికినది.

1. సాంఖ్యులు కేవలప్రధానమునె జగత్తునకు కారణమని చెప్పియున్నారు. కాని ఆమాటను సూత్రకారులు (వ్యాసులును), భాష్యకారులు (శంకరులు)ను ఖండించియున్నారు. మరియును **"సత్యావృతే మిథునీకరోతి"**యని శ్రుతి చెప్పినది. పరమాత్ముడును మాయయు జగత్తునకు కారణమని దాని అర్థము.

చేతనసత్తను పొందిన తమఃప్రధాన మాయయందు తొలుత శబ్దగుణ సహితమగు ఆకాశము పుట్టినది. దాని నుండి వాయువును, వాయువునుండి అగ్నియు, అగ్నినుండి జలమును, జలమునుండి భూమియును, ఇట్లు పంచ భూతములు గుణసహితముగ పుట్టుచున్నవి. ఆ పంచభూతములచే స్థూలసూక్ష్మ సృష్టి క్రమముగ ఏర్పడినది. ఈక్రమమున జగత్తునకు ఉత్పత్తి కారణము ఈశ్వరుడేనని శాస్త్రము లుగ్గడించినవి. అందుచే శబల బ్రహ్మము విశ్వమునకు కారణమై యున్నది.

2. అన్యమతవాదులు కొందరు జగత్కారణమునుగూర్చి వివిధ భంగుల పేర్కొందురు. ౧ అభావమనియు ౨ అసత్తనియు ౩ శూన్యమనియు ౪ ప్రధానమనియు ౫ పరమాణువనియు ౬ కర్మమనియు ౭ కాలమనియు ౮ కాలాది సంయోగమనియు ౯ అసంగపురుషుడనియు ౧౦ యదృచ్ఛ యనియు ౧౧ పంచ భూతము లనియు- పెక్కుభంగుల ఆయా మతవాదులు చెప్పుదురు. ఆమతము లన్నియు ఒప్పదగినవి కావు.

౧ అభావమువలన కార్యము కలుగదు. లోకమునందు భావరూపములై

యుండు మృత్తికాదులవలననే ఘటాది కార్యములు ఉత్పన్న మగుచున్నవి. ఇందుకే అభావవాదమున ప్రత్యక్ష మగు దోష మున్నది.

౨ అసత్తులగు వంధ్యాపుత్రాదులవలన కార్యరూపము లేదు. కావున అసద్వా దము సంగతము కాదు.

౩ శూన్యము నిస్తత్వ మగుటవలన కార్యోత్పత్తి యేనాడును సంభవించదు అందుచే శూన్యవాదము అసంగతము.

౪ ప్రధానము జడమగుటవలన నిరపేక్షముగ కార్యమును కల్గించజాలదు.

౫ జడములగు పరమాణువులకు స్వతః సంయోగము అసంభవము కాబట్టి వాటికి కారణత్వము సిద్ధించదు.

౬ కర్మము స్వయముగ జడమై యుండుటంబట్టి దానివలన సైతము నిరపేక్షముగ కార్యసిద్ధి కాజాలదు.

౭ కాలమునకు కారణత్వము వంగీకరించినచో ఎల్లప్పుడుకూడ సృష్టి జరగవలసి యుండును. కాని అది యట్లు కానరాదు. అందుచే కాలవాదము అసంగతము.

౮ కాలాదికములు స్వభావమువలననే జడములై యుండుటంబట్టి వాటికి నిరపేక్ష పంగాదికములు లేక పోవుటచే కర్మోత్పాదనము సంభవింపజాలదు. అందుచే కాలాది సంయోగవాదము అసంగతమై యున్నది.

౯ పురుషుడు అసంగుడు కాబట్టి వానియందు కార్యజనన వ్యాపారము కల్గుట వీలులేదు. అందుచే పురుషవాదము అసంగతము. మరియును జీవునకు సర్వజ్ఞత్వ స్వతంత్రత్వాదులు లేకపోవుటచే జగత్తును నిర్మించుటయందు వానికి సమర్థత లేదు. అందుచే జీవవాదము పొసగదు.

౧౦ ధర్మినిరపేక్షముగ కేవలధర్మమువలననే కార్యోత్పాదనము కాదు. అందుచే యదృచ్ఛావాదము ఒప్పరానిది.

౧౧ భూతములు కార్యరూపములుగను జడరూపములుగను నుండుటచే నిరపేక్షకములు కార్యమును కల్గింపజాలవు. ఇట్లు భూతవాదము సైతము అసమ్మతము.

౨ ఈ విధమున జగత్కారణ వాదములందు గల అనేక దోషములను సిద్ధాంతగ్రంథములు విరివిగ పేర్కొన్నవి. కాబట్టి పరమేశ్వరుడొక్కడే జగత్తునకు కారణమనుట నిష్కర్ష.

౩ మరియును శ్వేతాశ్వతరోపనిషత్తునందు ౧ కాలము ౨ నియతి ౩ స్వభావము ౪ యదృచ్ఛ ౫ భూతపంచకము ౬ ప్రధానము ౭ జీవుడు నను ఏడింటియందు కారణత్వమును నిషేధించి మాయాశక్తి సహితుడగు పరమేశ్వరుడే కారణమని చెప్పబడియున్నది. కాబట్టియే బ్రహ్మమును సర్వయోని యని శ్రీశంకరులవారు చెప్పిరి. దీనిచే తటస్థ లక్షణము చెప్పబడినది- ఏలక్షణము, లక్ష్యముయొక్క యేదేనొక చోట, ఏదో ఒక విధముననుండి, తనయొక్క లక్ష్యమును భిన్నవస్తువుల నుండి యేర్పరించి చూపుచున్నదో, దానిని తటస్థ లక్షణ మందురు.

ఉదా॥ కాకి యుండు గృహము దేవదత్తునిది అనుటలో కాకి దేవదత్తుని గృహముపై ఒకానొక మూల నొకానొక వేళ మాత్రమె యుండునది యైనను తదితరులగు యజ్ఞదత్తాదుల గృహములనుండి దేవదత్తుని గృహమును విడదీసి యేర్పరించి చూపించుచున్నది. అందుచే కాకి గృహమునకు తటస్థలక్షణమై యున్నది.

గంధము గలది భూమి- అనుచోట భూమికి గంధము తటస్థలక్షణమై యున్నది. అట్లే జగత్తునకు కారణము బ్రహ్మ మనుచోట బ్రహ్మమునకు జగత్కారణత్వము తటస్థలక్షణ అనబడును. జగత్తుయొక్క ఉత్పత్తికాలముమాత్రము తోచు ఆకారణత్వము బ్రహ్మము నందు మాయయొక్క కల్పనమెంత భాగమున కలదో అంతప్రదేశమున మాత్రముండును. ఘటమును చేయుటకు యోగ్యమగు మట్టి భూమియందన్ని తావుల నుండదు. ఒకానొక చోట మాత్రమె యుండును. అట్లే బ్రహ్మమందంతటను జగత్కారణత్వము లేదు. ఈ జగత్కారణలక్షణము తదితరమగు ప్రధానాది కారణములను నైదొలగించి స్వలక్ష్యమగు బ్రహ్మమును

తోపింపజేయుచున్నది. కాబట్టి జగద్యోనిత్వము బ్రహ్మముయొక్క తటస్థలక్షణమై యున్నది. దానిని పరమదయాళురగు ఆచార్యులు మందబుద్ధులగు పురుషుల కొరకు ప్రతిపాదించి బోధించియున్నారు.

5. పరమార్థమునకు బ్రహ్మమునందు జగద్యోనిత్వము కాని సర్వజ్ఞత్వాది ధర్మములు గాని లేవు. అవి మాయచే ఆరోపింపబడియున్నవి. **"మాయోపాధిర్జగద్యోనిః సర్వజ్ఞత్వాది లక్షణః"** అని శాస్త్రవాక్యము అంశకల్పనము. ఈక్షణము ప్రవేశత్వమును నియామకత్వమును మాయచే కల్పింపబడిన ధర్మములే.

6. తైత్తిరీయోపనిషత్తు పరమాత్మునియందు కామన, లోచన, స్రష్టృత్వ, భోగ్యాకార పరిణామాదులు చెప్పినది. అట్లు చెప్పుట సత్యత్వ జ్ఞాపకమునకె గాని ఆధర్మములు కలవా డనుట కాదు. సత్తాస్ఫూర్తిని ఇచ్చుట దప్ప మరియే ఐశ్వర్యమును అందు లేదు.

**బ్రహ్మ నిరీహము:-** ఈహ యనిన చేష్టయని అర్థము. బ్రహ్మము చేష్టారహితము. **"యద్యద్ధి కురుతే జంతుః తత్తత్కామస్య చేష్టితం"** అనునట్లు కామమూలముననే జీవులు చేష్ట లొనర్చుచున్నారు. **"ఆప్తకామస్య కా స్పృహా"** ఆప్తకామునకు కోర్కెలు నశించినవి. అనుటచే బ్రహ్మము నిరీహ మనుట స్పష్టము. సర్వభూతముల అభిలాషలును, చేష్టలును దుఃఖనివృత్తికై సుఖప్రాప్తికై సంభవించుచున్నవి. బ్రహ్మమునందో దుఃఖము లేశ మాత్రమును లేదు. అది సదానందస్వరూపము.

**బ్రహ్మము శివము:-** శివమనిన, కల్యాణ మనినను, మంగళ మనినను ఒక్కటే. ఆ బ్రహ్మము పరమమంగళస్వరూపము **"బ్రహ్మ తన్మంగళం విదుః", "మంగళానాం చ మంగళమ్"-** అని శ్రుతిస్మృతులు చెప్పినవి.

శంక:- శివు డనిన కైలాసవాసికి పేరు. ఆతని విగ్రహమును శివు డందురు.

సమా:- విగ్రహము దేశపరిచ్ఛేదము కలదగుటచే శివరూపము కాదు. ఆకారము లన్నియు మాయారచితములని శాస్త్రముల మాట. వ్యాపకమై యుండు నిజ స్వరూపమునె శివుడు అందురు. **"సర్వవ్యాపీ భగవాన్ తస్మాత్సర్వగత శ్శివః"** ఆ భగవంతుడు సర్వవ్యాపియై యుండుటచే సర్వగతుడని, శివుడని చెప్పబడెను.

అని శ్రుతి చెప్పినది. మరియు వాసిష్ఠమునందు మహాదేవుడు స్వయముగ తన నిరవయవ వ్యాపకస్వరూపము పరమపూజ్య మైనదని నుడివియున్నాడు- ధ్యాన సాధకులకు ప్రోత్సహము కల్గించుటకు విగ్రహముకూడ పరమేశ్వరుడని పురాణములు చెప్పినవి కాని దాని నిజస్వరూపమే శివుడన జెల్లును. అదియె బ్రహ్మము.

శంక:- ఆ బ్రహ్మము శివమై సర్వవ్యాపకమై యున్నచో సంగదోషము కలది యగును కదా?

ఈ శంకకు ఆచార్యులవారు సమాధానము చెప్పుచున్నారు.

**బ్రహ్మము సంగహీనము:-** ఆ బ్రహ్మము అసంగము. దానికి దేనితోడను సంగము లేదు. సంగజన్యములగు వికారనాశములు దానికి లేవు. ప్రత్యాసత్తి సంగహీనమని, సంయోగాది సంగహీనమని సంగము రెండు విధములు. ఈ రెండును జడ పదార్థములయందె కలుగుచున్నవి. "ప్రతి" యనగా అభిముఖము. "ఆసత్తి" యనగా లాభము. ప్రతిగుణీభావమునకు ప్రత్యాసత్తి యనిపేరు. అగ్ని సంబంధముతో జలము ఉష్ణత్వమును బొంది అగ్నిమయ మగుచున్నది. అదియు సజాతీయ విజాతీయ స్వగత సంబంధముచే ఫలశాలి యైనది. బ్రహ్మము సజాతీయాది రహితము.

సంయోగాది సంబంధముకూడ ద్రవ్యపదార్థములందె సంభవించును. న్యాయశాస్త్రరీతితో (1) సంయోగము (2) సమవాయము (3) తాదాత్మ్యమని అందు మూడు విభేదములు.

1. అవచ్ఛేదక భేదముచే స్వాత్యంతాభావాధి కరణవృత్తి సంయోగ సంబంధము. అదియు అన్యోన్యము, అన్యతరము, సంయోగ సంయోగము, సహజ సంయోగమని నాలుగు భేదములు.

2. నిత్య ఏక అనేక ద్రవ్యముల సమవేతము సమవాయ సంబంధ మనబడును. అదియును జాతి వ్యక్తి గుణగుణీ,క్రియ క్రియావాన్, కార్య కారణ-భేదములతో నాలుగు విధములు. ఇందు కారణపదముచే ఉపాదానకారణమనితెలియవలెను.

3. పరస్పరము రెండు పదార్థములు అభేదముగ తోచుట తాదాత్మ్య సంబంధము. అదియుకూడ ముఖ్యకల్పిత భేదములచే ద్వివిధము. అగ్నికిని లోహమున కును ముఖ్యతాదాత్మ్యము. రజ్జువునకును సర్పమునకును కల్పిత తాదాత్మ్యము. ఈ కల్పిత తాదాత్మ్యమునే మిథ్యా తాదాత్మ్య మందురు. ఈ మిథ్యా తాదాత్మ్యమునే బ్రహ్మమునకును ప్రపంచమున కును కలదిగా ఎన్నినచో బ్రహ్మముయొక్క అసంగత్వమునకు ఎట్టి హానియు లేదు.

**"నిష్కలం నిష్క్రియం శాంతం", "కేవలో నిర్గుణశ్చ"**- అనెడి శ్రుతిప్రమాణము లనుబట్టి బ్రహ్మము కలావయవ రహితమును, క్రియాక్షోభ హీనమును, ద్రవ్యగుణ క్రియాజాత్యాది శూన్యమును, నిరవయవమును, నిరుపాధికమును, నిర్గుణమునునై యున్నది. **"యోగ్యయోగ్యేన సంబంధ్యతే"** అనెడి న్యాయమునుబట్టి పరిచ్ఛిన్నము లగు మూర్తపదార్థములందే సంబంధము సంభవించును. కాని అమూర్తమగు బ్రహ్మమునందు సంభవించదు. కాబట్టి బ్రహ్మమునందు ప్రత్యాసత్తి సంగము కాని సంయోగాది సంగముగాని యేర్పడవు **"అసంగో హ్యాయం పురుషః- అసంగో న హి సజ్జతే"** అని పరమాత్మని సంగరహితునిగ శ్రుతులు నుడివినవి. అందుచే బ్రహ్మము సంగహీనము. ఇట్లు జ్ఞేయవస్తువును గూర్చి ఆరువిశేషణములతో చెప్పి యిట్టి మహావాక్యవిచారమును సహింపనేరని సామాన్యాధికారులకొఱకై ఆచార్యులవారు బ్రహ్మముయొక్క ధ్యేయరూపమును ప్రతిపాదించుచున్నారు.

## ధ్యేయబ్రహ్మ నిరూపణము (సగుణోపాసనము)

**"యదోంకారగమ్యం"**- అని మూలమందు గలదు. ప్రణవోపాసనమువలన పరబ్రహ్మప్రాప్తి కలుగునని శ్రుతి చెప్పినది. **"పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః"** నిర్గుణ బ్రహ్మమునె పరబ్రహ్మ మందురు. సగుణ బ్రహ్మమును అపరబ్రహ్మ మందురు. అందు మొదట సగుణోపాసనను గూర్చి సంక్షేపముగ చెప్పుచున్నారు. ఆ సగుణోపాసనయందును సప్తసిద్ధాంతములు గలవు-

1. హిరణ్యగర్భుని సిద్ధాంతము 2. కపిలముని సిద్ధాంతము 3. అపాంతర ముని సిద్ధాంతము 4. సనత్కుమార సిద్ధాంతము 5. బ్రహ్మనిష్ఠుల సిద్ధాంతము

6 పశుపతి సిద్ధాంతము 7 పంచరాత్రసిద్ధాంతము-

**1. హిరణ్యగర్భుని సిద్ధాంతము:-** త్రిమాత్ర, త్రిబ్రహ్మ, త్రిఅక్షరరూప ఓంకారమును చింతించవలెను. అగ్నివాయుసూర్యులు మూడుమాత్రలు, ఋక్‌యజుః సామములు మూడు బ్రహ్మలు. అకార ఉకార మకారములు మూడు అక్షరములు. ఈ సమస్త మును ఓంకార స్వరూపమే. ఆ ఓంకారమే నాస్వరూపమని తెలిసి చింతించు వాడే వేదవేత్త.

**2. కపిలముని సిద్ధాంతము:-** త్రిజ్ఞాన, త్రిగుణ, త్రికరణ రూపమై ఓంకార మున్నది. వ్యక్తము, అవ్యక్తము, జ్ఞేయములని జ్ఞానములు మూడు. సత్త్వరజస్తమస్సులు మూడు గుణములు. మనోబుద్ధ్యహంకారములు కరణములు మూడు. ఇట్టి వ్యష్టి సమష్టిరూప మగు.ఓంకారమే నాస్వరూపము అని తలంచి చింతించవలెను.

**3. అవాంతరముని సిద్ధాంతము:-** త్రిముఖ, త్రిదేవతా, త్రిప్రయోజనరూపము ఓంకారము. గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని- యీమూడును ముఖములు. బ్రహ్మవిష్ణురుద్రులు ముగ్గురు దేవతలు. ధర్మఅర్థకామములు మూడు ప్రయోజ నములు. ఇదంతయు ఓంకారస్వరూపము. ఆ ఓంకార బ్రహ్మమే నాస్వరూపము అని చింతించవలెను.

**4. సనత్కుమార సిద్ధాంతము:-** త్రికాల, త్రిలింగ, త్రిసంజ్ఞారూపము- ఓంకారము. అందు భూత వర్తమాన భవిష్యత్తులు మూడుకాలములు. స్త్రీ పురుష నపుంసకములు మూడు లింగములు. విశ్వ తైజస ప్రాజ్ఞులు మూడు సంజ్ఞలు. ఈ సర్వమును ఓంకార రూపమే. ఆ ఓంకార బ్రహ్మమే నా స్వరూపము అని చింతించవలయును.

**5. బ్రహ్మవిష్ణుల సిద్ధాంతము:-** త్రిస్థాన, త్రిపద, త్రిప్రజ్ఞారూపము ఓంకారము. అందుహృదయ కంఠతాలువులు మూడుస్థానములు. జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడు పదములు. బహిః ప్రజ్ఞ, అంతః ప్రజ్ఞ, ఘనప్రజ్ఞలుమూడు ప్రజ్ఞలు. ఈ సమస్తమును ఓంకారరూపమే. ఆ ఓంకార బ్రహ్మమే నేను అని చింతించవలెను.

**6. పశుపతిసిద్ధాంతము:-** త్రిఅవస్థ, త్రిభోగ, త్రిభోక్తారూపము ఓంకారము. అందు శాంతము, ఘోరము, మూఢము అనునవి మూడవస్థలు. అన్నజలసోములు మూడు

భోగములు. ప్రాణ అగ్ని సూర్యులు ముగ్గురు భోక్తలు. ఈ సర్వమును ఓంకారమే. ఆ ఓంకారబ్రహ్మమే నేనని చింతించవలెను.

**7. పంచరాత్రసిద్ధాంతము:-** త్రిఆత్మ, త్రిస్వభావ, త్రివ్యవహారరూపము ఓంకారము. బలవీర్యతేజములు మూడు ఆత్మలు. జ్ఞాన ఐశ్వర్య శక్తులు మూడు స్వభావములు సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధులు మూడును వ్యవహారములు. ఇవి యన్నియును ఓంకారరూపమే. ఆ ఓంకార బ్రహ్మమే నాస్వరూపము అని చింతించవలెను.

ఈ యేడు సిద్ధాంతములందును అరువది మూడు అంతర్భేదములు గలవు. వీరందరును సగుణ బ్రహ్మమును ఓంకారరూపముగ నుపాసించవలెనని చెప్పుదురు. అరువది నాల్గవది అమాత్రరూపమగు నిర్గుణోపాసనము. మరియును మాత్రాభేదమువలన ఓంకారచింతనము బహుప్రకారములై యున్నది.

1. బాష్కలఋషి ఏకమాత్రను 2. శాలఋషి రెండుమాత్రలను 3 నారదుడు రెండున్నరమాత్రలను 4. మాండవ్యుడు మూడుమాత్రలను 5. పరాశరాదులు నాల్గు మాత్రలను 6. వసిష్ఠాదులు నాల్గున్నరమాత్రలను 7 యాజ్ఞవల్క్యుడు అమాత్ర రూపమునను ఉపాసించియున్నారు.

విరాట్టు ఒకమాత్ర. జాగ్రత్స్వప్నములు ద్విమాత్రలు. జాగ్రత్స్వప్నసుషుప్తులు లేదా వైశ్వానర హిరణ్యగర్భ-ఈశ్వరులు త్రిమాత్రలు. రెండున్నర మాత్ర లనినను దీని యందే అంతర్భూతము. అకార ఉకార మకారములు అర్ధమాత్ర యగుటచే తన తురీయము మూడున్నరమాత్రలు. జాగ్రదాదులు మూడును నాదరూపశక్తియు నాల్గు మాత్రలు. అకార ఉకార మకార రూపమగు స్థూల సూక్ష్మ కారణ ప్రపంచమును నాద రూపమున మిగిలియున్న అర్ధమాత్ర బిందుచేతనమును నాల్గున్నర మాత్రలు. ఇట్లే ఆరు ఏడు ఎనిమిది మాత్రభేదములచే సగుణోపాసనమును బహువిధముల చెప్పుదురు.

కార్యకారణ బ్రహ్మలయొక్క వివిధోపాసనలు సగుణరూపమ్మై యున్నవి. ఓంకార రూపసగుణోపాసనచే బ్రహ్మలోకప్రాప్తి కలుగుచున్నది.

ఆ ఓంకారమునకు పదిపేర్లను శ్రుతి చెప్పినది. 1 ఓం. 2 ప్రణవము 3 సర్వవ్యాపి 4 అనంతము 5 తారము 6 శుక్రము 7 వైద్యుతము 8 హంసము

9 తురీయము 10 పరబ్రహ్మము- వీటిని అర్థసహితముగ చింతించినచో సర్వాభీష్ట లాభము చేకూరును.

**నిర్గుణోపాసనము:-** ఓంకారమును పరబ్రహ్మరూపముగ తెలిసి ధ్యానించవలెను. ఓంకారము బ్రహ్మముయొక్కవాచకము. బ్రహ్మము దాని వాచ్యము. వాచ్యవాచకములకు భేదము లేదు. అదియునుగాక ఓంకారము బ్రహ్మమువలె సర్వవ్యాపకము **"ఓమిత్యేతదక్షర మిదం సర్వం"** అని శ్రుతి చెప్పినది- ఓం అనెడి వర్ణము బ్రహ్మము నందు అధ్యస్తమై యున్నది. అధ్యస్తము అధిష్ఠానమునకంటె భిన్నముగ లేదు.

బ్రహ్మమునకును, ఆత్మకునువలె ఓంకారమునకు మాత్రారూపములగు నాల్గు పాదములు గలవు. అందుచే ఓంకారము బ్రహ్మాత్మలతోడ అభేదరూపమై యున్నదని తెలిసి చింతించవలెను.

అభేదచింతనాక్రమము:- 1 విరాట్టు, 2. హిరణ్యగర్భుడు, 3. ఈశ్వరుడు, 4. ఈశ్వరసాక్షి ఈ నాల్గును బ్రహ్మమునకు పాదములు. 1 విశ్వ 2 తైజస 3 ప్రాజ్ఞ 4 జీవసాక్షులు నల్వురును ఆత్మకు పాదములు- 1 అకారము 2 ఉకారము 3 మకారము 4 అమాత్రరూప మగు తురీయము- ఇట్లు ఓంకారమునకు నాల్గు పాదములు. ఓంకారమును బ్రహ్మాత్మలతో అభేదముగ భావించి లయచింతన మొనర్చవలయును.

1. స్వర్గాది సప్తాంగసహితుడగు విరాట్టును, పందొమ్మిదిముఖములు గల విశ్వుడును అభేదమని తెలియవలెను. ఇద్దరునూ సమష్టివ్యష్టి స్థూలోపాధి గలవారు. ప్రథమపాదమునకు చెందినవారు. భోగసాధనములగు పది యింద్రియములు, నాలుగంతఃకరణములు, ఐదుప్రాణములును- విశ్వునకు ముఖములని చెప్ప బడినవి. అందు దశేంద్రియములును అంతఃకరణ చతుష్టయమును త్రిపుటి రూపమై యున్నది. ప్రాణమునందు త్రిపుటి లేదు. అట్టి విరాట్స్వరూపుడగు విశ్వుని అకారముతో అభేదముగ చింతించవలెను. విరాడ్విశ్వ అకారములు మూడును ప్రథమపాదమునందే ఉన్నవి.

2. హిరణ గర్భుని మరియు తైజసుని అభేదముగ తెలియవలెను. ఇద్దరునూ సూక్ష్మోపాధి గలవారు. ఆ హిరణ్య గర్భరూపుడగు తైజసుని ఉకారముతో

అభేదముగ చింతించుము. ముప్వురునూ ద్వితీయపాదమునకు చెందియుండుటచే సమానధర్మము కలవారై యున్నారు.

3. ఈశ్వరునకును, ప్రాజ్ఞునకును అభేదమని తెలియవలెను. ఇద్దరునూ కారణోపాధి కలవారు. ఈశ్వరరూపుడగు ప్రాజ్ఞుని మకారముతో అభేదముగ చింతించవలెను. తృతీయపాదరూపమగు ధర్మము ముప్వురియందును సమానమై యున్నది.

4. ఈశ్వరసాక్షియు, జీవసాక్షియును సదా అభేదమయ్యే ఉన్నారు. ఓంకారముయొక్క పరమార్థ రూపమై యుండు తురీయముతో వారిని అభేదముగ తెలియవలెను. సమష్టి ఉపాధులు మూడింటిలో చేతనరూపమున వ్యాపించి యుండు ఈశ్వర సాక్షి యెట్లు శుద్ధమై యున్నదో, అట్లే వ్యష్టి ఉపాధులు మూడింటిలో అనుస్యూత చేతనమగు జీవసాక్షి సైతము శుద్ధమై యున్నదో, అట్లే అకారాది మూడు మాత్రల యందును వ్యాపించియుండు చేతనరూపము అమాత్ర యనెడి తురీయముకూడా పరిశుద్ధమై యున్నది. అందుచే ఈశ్వరసాక్షికి జీవసాక్షికిని తురీయముతో ముఖ్యముగ అభేదము గలదు.

మరియును ముందు జెప్పిన అకారాదులను అమాత్రారూపమగు తురీయమునందు లయచింతన మొనర్చవలెను 1 విరాడ్విశ్వసహిత అకారమును ఉకారమునందును 2 హిరణ్యగర్భ తైజస సహిత ఉకారమును మకారమునందును 2 ఈశ్వరప్రాజ్ఞ సహిత మకారమును అమాత్రారూపమగు తురీయమునందును లయచింతన మొనర్చవలెను "ఆతురీయరూపమగు శుద్ధబ్రహ్మమె నేనై యున్నాను' ' ఇట్లు గురుముఖమున చక్కగ తెలిసి యత్నశీలుడగు ముముక్షువు ఏకాంతము నందు ఓంకారమును పరబ్రహ్మరూపముగ చింతించినచో జ్ఞానము కలిగి కైవల్య మోక్షప్రాప్తి యగుచున్నది. కామనారూపమగు ప్రతిబంధ మేదైన ఉన్నచో దేవయాన మార్గమున బ్రహ్మలోకమునకు జని ఆ ఉపాసకుడు హిరణ్యగర్భునితో సమానముగ భోగముల ననుభవించి సత్త్వప్రధాన మగు నాచోట జ్ఞానమును బొంది విదేహముక్తు డగుచున్నాడు.

ఉపనిషత్తులు పెక్కింటిలో ఈ ఓంకారోపాసనము ప్రతిపాదించబడి యున్నది. మాండూక్యమునందు విశేషించి గలదు. దాని సారము పంచీకరణ సూత్రములందు చెప్పియున్నారు. విస్తారముగ గ్రహింప గోరువారు ఆయా చోట్ల చూచునది. బ్రహ్మము నిరాకారము. ఆకారరహితమని చెప్పుటచే నిత్య నిర్వికార మని గ్రహించవలెను. **"సాకారమనృతం విద్ధి నిరాకారం తు నిశ్చలం"** అని చెప్పి నట్లు సాకారపదార్థము వినాశవంతమును, వికారవంతమునునై యుండును. బ్రహ్మమతి యుజ్జ్వలము. మిగుల స్వచ్ఛమును దృక్స్వరూపమును. సర్వదోష రహితమునునై యున్నది. అందుచే శ్రుతి సైతము **"నిరవద్యం నిరంజనం"** అని పేర్కొన్నది. బ్రహ్మము అమృతస్వరూపము. మృత్యుహీన మైనది. **"యో వై భూమా తదమృతం"** అని శ్రుతి చెప్పినది. జన్మము గల పదార్థములకు మృత్యువు కూడ నుండును. బ్రహ్మమునకు జన్మము లేదు కావున మృత్యువునూ లేదు **"తమేవ విదిత్వాతిమృత్యు మేతి"** అని శ్రుతి చెప్పిన వడుపున, దేనిని తెలిసికొని జ్ఞానులు మృత్యువును దాటుచున్నారో, అట్టి బ్రహ్మము మృత్యుధర్మ రహితమని వేరుగ జెప్పబనిలేదు. అదియునుగాక **"మృత్యుర్వై తమః"**= మృత్యువను శబ్దమునకు తమస్సనిపేరు. తమస్సనిన అజ్ఞానము. **"తమసః పరస్తాత్"**= బ్రహ్మము తమస్సునకు ఆవలిది యని నిగమములు వాకొన్నవి.

ఇట్లు అనంతము మొదలుకొని మృత్యుహీన పర్యంతమునైన పది విశేషణములతో కూడియుండు నిత్యపరబ్రహ్మమే నేను" అని యేడవశ్లోకము యొక్క తాత్పర్యము.



## ఎనిమిదవ శ్లోకం

### IV. నిర్విశేష భూమానంద స్వరూపము

**మూలం॥శ్లో॥ యదానందసింధౌ నిమగ్నః పుమాన్ స్యా**
**దవిద్యావిలాసః సమస్త ప్రపంచః ।**
**తదా న స్ఫురత్యద్భుతం యన్నిమిత్తం**
**పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి ॥ 8**

టీక॥ యదా = ఎప్పుడు, పుమాన్ = పురుషుడు, ఆనందసింధౌ = బ్రహ్మానంద సముద్రమునందు, నిమగ్నః = మునిగినవాడు, స్యాత్ = అగునో; తదా = అప్పుడు, అవిద్యావిలాసః = అవిద్యాకార్యమగు, సమస్త ప్రపంచః = సర్వప్రపంచము, న స్ఫురతి = తోచదు. (అట్లయ్యు) యన్నిమిత్తం = ఏకారణమునుండి, అద్భుతం= ఆశ్చర్యకరమగు ఈ కార్యరూపకల్పిత జగత్తు తోచుచున్నదో, తత్ = ఆ, నిత్యం= నిత్యమైన, పరం = సర్వ శ్రేష్ఠమైన, బ్రహ్మ+ఏవ = బ్రహ్మమే, అహం = నేను, అస్మి = అగుచున్నాను.

తా॥ ఏ ఆనంద సముద్రమునందు మునిగి యుండు జీవన్ముక్త పురుషునకు దేని నిమిత్తముచే అవిద్యావిలసిత సమస్త ప్రపంచమును గోచరింపకుండునో, అట్టి నిత్య పరబ్రహ్మము నేనే అయియున్నాను.

వెనుకటి శ్లోకములలో సాధనసహితముగ తత్త్వజ్ఞానమును, జ్ఞేయబ్రహ్మమును, ప్రతిపాదించి ఇప్పుడు ఈ ఎనిమిదవ శ్లోకముతో ఉత్తమభూమికల నధిష్ఠించిన పురుషునిచే అనుభవింప దగినదియు, సర్వసుఖములకును నిలయమును, నిర్విశేషమును నగు భూమానందమును వర్ణించుచున్నారు.

**పురుషోత్కర్షము:-** 'పుమాన్' అనగా పురుషసాధ్య ప్రయోజనమగు కైవల్య మోక్షమును సంపాదించువాడు లేదా పురియందు పూర్ణజ్ఞానమున నుండువాడు **"సంపాదయతి కైవల్యం స ఏవ పురుషోత్తమః"** అనిశాస్త్రవాక్యము. తక్కిన

నారెల్లరును నపుంసకులు లేదా స్త్రీలు "నపుంసకః పుమాన్ జ్ఞేయో యో న వేత్తి హృది స్థితం" తన హృదయమున ఆనందరూపుడై యుండు ఆత్మను తెలియని పురుషుడు నపుంసకుడే. జ్ఞానము లేక పరతంత్రులై యుండుటచేతను, చర్మ ధాతు రేతో రూప మగు గర్భముతో కూడియుండుటచేతను 'స్త్యాయతే' అనెడి వ్యుత్పత్తిచేతను అజ్ఞ పురుషు లెల్లరును స్త్రీలనియే చెప్పబడుదురు. ఒక్క జ్ఞానియే పురుషుడని చెప్పబడును. వారిలో ఒకానొక బ్రహ్మనిష్ఠుడు సమాధిపాటవముచే ఉత్తమభూమికల నధిరోహించి బ్రహ్మానందసముద్రమున మహామకరమువలె నిమగ్నుడై యుండును.

**2. సప్తజ్ఞానభూమికలు:-**

**శ్లో॥ జ్ఞానభూమిశ్శుభేచ్ఛాఖ్యా ప్రథమా పరికీర్తితా ।**
**విచారణా ద్వితీయా స్యా త్తృతీయా తనుమానసా ॥**
**సత్త్వాపత్తిశ్చతుర్థీస్యాత్తతో సంసక్తి నామికా**
**పదార్థాభావనీ షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా ॥**

తా॥ 1 శుభేచ్ఛ మొదటిభూమిక 2 విచారణ 3 తనుమానస 4 సత్త్వాపత్తి 5 అసంసక్తి 6 పదార్థభావని 7 తుర్యగ - ఇట్లీయేడు జ్ఞానభూమికలును బుద్ధి యందేర్పడు చున్నవి.

(1) వివేకవైరాగ్యశమాది సహితమగు మోక్షేచ్ఛయు, తత్సాధ్యమగు రూపా సత్తి పూర్వకశ్రవణమును శుభేచ్ఛ యనబడును.

(2) స్వయుక్తి వలన తత్త్వమును చింతించుట వలన మననము. విచారణ యనెడి భూమిక

(3) మననము చేసిన పిమ్మట నిదిధ్యాసనచే మనస్సునకు కల్గెడి సూక్ష్మావస్థలమ తనుమానస యందురు.

(4) శుద్ధతత్త్వసాక్షాత్కార రూపమును సత్త్వాపత్తి భూమిక యందురు.

(5) సమాధి చేత మనస్సునకు నిర్వికల్పావస్థ సంభవించి రాగాభాసము

క్షయించి నంతట దానినే అసంసక్తి భూమిక యందురు.

(6) సమాధియొక్క దార్ఢ్యముచేత సర్వవాసనలును క్షీణించి నంతట ఆస్థితిని పదార్థభావనీభూమి యందురు.

(7) పరమప్రకాశరూప మగు ఆనంద ఘనమునందు వృత్తి విలయము జెంది వెండియు నది సంభవింప కుండుటను తుర్యగ యందురు.

ఈ యేడు భూమికలందు మొదటి మూడింటిని జాగ్రదవస్థ యందురు **"భూమికాత్రితయం త్వేతత్ రామ! జాగ్రదితి స్థితం"** అని వాసిష్ఠరామాయణము చెప్పినది. ఎంతవరకు భేదబుద్ధి నిలిచియుండునో అంతవరకును జగత్తు జాగ్రద్రూప ముగనె తోచును. అనగా ఈమూడు భూమికలందును ద్వైతప్రతీతి గలదు. నాల్గవ భూమిక స్వప్నము వంటిది. **"పశ్యతి స్వప్నవల్లోకం చతుర్థీభూమికా మతా"**= బ్రహ్మము యొక్క అపరోక్షజ్ఞానము కలిగినంతనె జ్ఞాని ప్రపంచమును స్వప్నమువలె మిథ్యగ చూచును.

తర్వాత అయిదు ఆరు భూమికలు సుషుప్తి గాఢసుషుప్తి రూపములై యున్నవి.

జాగ్రత్స్వప్న సుషుప్తి రూపములై యున్న ఆరుభూమికలయొక్క అపేక్షతో ఏడవభూమికను తుర్యగ అని చెప్పియున్నారు. **"తుర్యతుర్యః పరానందో వైదేహీ ముక్త ఏవ సః"**- ఐదవభూమిక గలవాడు ప్రారబ్దముచే ప్రేరేపింపబడి స్వయముగ సమాధినుండి వ్యుత్థానమును చెందును. ఆరవభూమికలోని వాడు పరప్రయత్నము వలన ఒకానొకప్పుడు వ్యుత్థానమును పొందును.

తురీయావస్థయందు తుర్యగ యనెడి యేడవ భూమియందుండువాడు స్వయముగ గాని పరప్రయత్నమున గాని వ్యుత్థానమును పొందడు. అట్టివాడు విదేహముక్తుడే యని చెప్పియున్నారు.

(1) మొదటి భూమికలు మూడింటియందుండువారు బ్రహ్మజిజ్ఞాసువులు (2) నాల్గవ భూమికయందుండువాడు బ్రహ్మవిదుడు (3) అయిదు ఆరు ఏడవ భూమికల నారోహించిన వారు క్రమముగ బ్రహ్మవిద్వర, బ్రహ్మవిద్వరీయ, బ్రహ్మవిద్వరిష్ఠులని చెప్పబడుచున్నారు. మొదటి మూడు భూమికలందుండు వానికి

జ్ఞానము లభించి యుండ నందున వాడు దేహమును వదలినచో ముక్తిని పొందలేడు. యోగభ్రష్టుడు కాబట్టి తర్వాతి జన్మములందు జ్ఞానమును బడసి మోక్షమును పొందును. ఈ విషయము వాసిష్ఠమునందును భగవద్గీతయందును చెప్పబడి యున్నది.

నాల్గవభూమిక నారోహించిన విద్వాంసునకు వెండియు జన్మము లేదు. **"అవిద్యాకామకర్మాణి జన్మారంభాణి హేతవః"**= జన్మహేతువులగు అవిద్యా కామకర్మములు ఆత్మజ్ఞానముచే వానికి నశించినవి.

ఆ అవిద్యయు 1. మూలావిద్య 2. తూలావిద్య యని రెండు విధములు. స్వరూపమును ఆవరించునది మూలావిద్య. అది జ్ఞానముచే నివర్తించును. కార్యమును ఆవరించియుండునది తూలావిద్య. ఇది అకించిత్కర మౌటచే జన్మహేతువు కాజాలదు. మొదటి చెప్పిన మూలావిద్యయే కార్యక్షమము. **"కార్యక్షమం నశ్యతి చాపరోక్షతః"**= అపరోక్షజ్ఞానముచే నది నశించును.

కామము అనేకరూపమై యున్నది. అదియుకూడ తత్త్వజ్ఞానోదయ మైనంతనె సంపూర్ణముగ నశించును. **"కిమిచ్ఛన్ కస్య కామాయ"** అనెడి శ్రుతి కామ్య కాముకులను నిషేధించినది.

కర్మము 1. సంచితము 2. ప్రారబ్ధము 3. ఆగామి యని మూడు విధములు.

1. పూర్వదేహములందు చేసియుండు నట్టిదియును, ఫలారంభమునకు రానిదియు భావి జన్మమునకును హేతువైనదియు నగు కర్మమును సంచిత మందురు.

2. పూర్వము చేసినదియు, వర్తమాన శరీరస్థితికి హేతు వైనదియు, ఫలమును ఆరంభించి నదియు నగు కర్మము ప్రారబ్ధము. ఆ ప్రారబ్ధము ఇచ్ఛా, అనిచ్ఛా, పరేచ్ఛలనెడి విభేదములచే మూడువిధములు.

3. ఇప్పటి వర్తమానశరీరముచే చేయబడుచున్నదియును, ముందు వచ్చు వి జన్మములకు హేతు వైనదియు నగు కర్మము ఆగామియని చెప్పబడును. నే క్రియమాణ కర్మ మనికూడ చెప్పుదురు.

**"తదధిగమే ఉత్తర పూర్వావద్యయో రశ్లేషవినాశౌ"** అని వ్యాససూత్రము. బ్రహ్మసాక్షాత్కారమును బొందిన విద్వాంసునకు, పూర్వశబ్దముతో చెప్పిన సంచిత కర్మము నశించినది. ఉత్తరశబ్ద వాచియగు ఆగామికర్మము వానిని అంటుట లేదు. (అశ్లేషము)

**"తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేత యథా పుష్కరపలాశ ఆపో వశ్లిష్యతే"** ఈ వాక్యము ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడినది. అగ్నియందు వేసిన గడ్డిపోచవలె సంచితకర్మము నశించుచున్నది. నీటిని తామరాకువలె ఆగామి కర్మము అంటుకొనదు" అని దాని యర్థము.

ఆగామికర్మము జ్ఞానిని స్పృశించదు. **"సుహృదః సాధు కృత్యాం ద్విషం తం పాపకృత్యాం తద్ద్వేషి ప్రియవాదినః"** అని శ్రుతిస్మృతులు చెప్పినట్లు శుభకర్మము యొక్కఫలమును ప్రియులగు భక్తులును, అశుభకర్మఫలమును ద్వేషులును పొందుచున్నారు.

**"భోగే న త్వితరే క్షపయిత్వా సంపద్యతే"** అని బ్రహ్మసూత్రములు సంచి తాగాము లకు వేరై యుండు ప్రారబ్ధకర్మమును భోగము (అనుభవము) వలననే నశింపజేసి విద్వాంసుడు కైవల్యమోక్షమును పొందుచున్నాడు. ప్రారబ్ధకర్మము ప్రయోగించిన బాణమువలె ఫలము నొసగికాని నశింపదు. **"నాభుంక్తే క్షీయతే కర్మ-ప్రారబ్ధం భోగతో వశ్యేత్"** అని శాస్త్రములందు ప్రసిద్ధము ఈశాస్త్రవాక్యములు అన్యవాదుల శంకా పరిహారార్థమే చెప్పబడినవి. కాని జ్ఞానియొక్క దృష్టియందు **"క్షీయంతే చాస్య కర్మాణి జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి"** అని శ్రుతి స్మృతుల తాత్పర్యమునుబట్టి అద్వయ బ్రహ్మ జ్ఞానము కలిగినంతనె ప్రారబ్ధమునకు ఉనికి లేదు. ప్రారబ్ధము నంగీకరించినచో అనేక దోషములు ప్రాప్తించును. వాటిని ఆచార్యులవారు తమ సిద్ధాంతగ్రంథము లందు స్పష్టముగ ఉదాహరించి యున్నారు.

నాల్గవ భూమిక యందుండు వానికి మోక్షవిషయమున సందేహము లేదు. కాని సమాధిబలము కొఱతై యుండుటచేతను, విక్షేపముయొక్క ప్రాబల్యము చేతను జీవన్ముక్తియొక్క విలక్షణ సుఖము ప్రాప్తించదు. వానికి పునర్జన్మలు లేవు. వృత్తిజన్య విశేష సుఖమగు జీవన్ముక్తిసుఖము తర్వాతి భూమికలందుండు వారికి

సంభవించును. వైరాగ్యబోధోపరతులు మూడును ఫలావధి పర్యంతము వారికి లభించి యుండుటయే వారి జీవన్ముక్తి సుఖమునకు కారణము. మరియును తత్త్వబోధ మనోనాశము వాసనాక్షయమను మూడింటివి బహుకాలము వారభ్యసించి యున్నారు. కాబట్టి సమాధియుక్తుడగు జీవన్ముక్తుడు సదా బ్రహ్మానందమునందే నిమగ్నుడై యుండును.

వైరాగ్యాదులు మూడింటికి హేతు స్వరూప ఫల అవధులను చెప్పుచున్నారు.

వైరాగ్యమునకు హేత్వాదికములు:- (1) విషయులందు దోషదృష్టి కలిగియుండుట వైరాగ్యమునకు హేతువు (2) విషయములను త్యజించవలెనను ఇచ్ఛ వైరాగ్య మునకు స్వరూపము (3) తిరిగి భోగకాంక్షచే దీనుడు కాకుండుట వైరాగ్యమునకు ఫలము.

ఒక్కొక్క విషయముచేతనే మృగ మాతంగ పతంగ మత్స్య భృంగములు మృత్యుగ్రస్తము లగుచున్నవి. ఒక్కమానవుడు అయిదు విషయములకును పాల్పడుచున్నా డనిన అట్టివాని వినాశము మరి చెప్పనేల? ఈలాటి "ఏకప్రమాథీ వ కథం న హన్యతే యః సేవతే పంచభిరేవ పంచ" అనెడి శాస్త్రవాక్యములచే ప్రసిద్ధమై యున్నది. ఈ విధమున విషయములందుండెడి దోషమును తలపోయ వలెను.

మరియును "ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తే షూపజాయతే" అనెడి గీతావాక్యమునుబట్టి విషయములను ధ్యానించుట మాత్రముచే సంగబుద్ధియు వెంటవెంట కామక్రోధాది అనర్థములును సంభవించుచున్నవి.

అట్లే విషయసాధనములై యుండు స్త్రీ పుత్ర ధనాదులయందు గల బహుళ దోషములును శాస్త్రములందు చెప్పబడియున్నవి. ఇట్లు విషయములందు గల దోషములను దర్శించుట వైరాగ్యమునకు హేతువు. వివేకమును లేదా స్వధర్మ పాలనమును లేదా పరమేశ్వరానుగ్రహమును సైతము వైరాగ్యమునకు హేతువని చెప్పెదరు.

ఆ వైరాగ్యము మంద, తీవ్ర, తీవ్రతర భేదములచే మూడు విధములై యున్నది.

మరియును వైరాగ్యము పర, అపర భేదములచే ద్వివిధము. అందు అపరవైరాగ్యము యతమాన, వ్యతిరేక, ఏకేంద్రియ, వశీకార- సంజ్ఞలచే నాలుగు విధములు.

విషయములను త్యజించుటకై మిక్కిలి ప్రయత్నించుచుండుట యతమాన మను వైరాగ్యము. దీనినే మందవివేక మందురు. విషయములందు గల దోషముల యొక్క భావాభావ వివేకమునకు వ్యతిరేక మనిపేరు. బాహ్యవిషయములను త్యజించి వనూ మనస్సునందు అతిశయమగు తృష్ణ కలిగియుండుట ఏకేంద్రియసంజ్ఞ. అన్ని విధముల నాశన మగుట వశీకారవైరాగ్య మందురు. ఈ వశీకార వైరాగ్యము సంప్రజ్ఞాత సమాధికి అంతరంగసాధనమై యున్నది. పిమ్మట పరవైరాగ్యమును జెప్పుచున్నారు.

## పరవైరాగ్యము

త్రిగుణాత్మక ప్రకృతికి భిన్నుడగు పురుషుని సాక్షాత్కారమును పొంది సర్వమాయా గుణములందును ఆశ లేకయుండుట పరవైరాగ్య మనిపేరు. ఇది అసంప్రజ్ఞాత సమాధికి అంతరంగ సాధనము. ఇట్టి వైరాగ్యము కలవాడు చక్రవర్తి మొదలుకొని బ్రహ్మదేవుని పర్యంతమును గల సుఖముల నపేక్షించి దేబిరించడు. అందరికిని మించిన సంతృప్తి గలవాడై యుండును. ఇదియే వైరాగ్యమునకు ఫలము.

## జ్ఞానమునకు హేత్వాదికములు

వేదాంతశాస్త్ర విచారము జ్ఞానమునకు హేతువు- **"వేదాంతార్థ విచారేణ జాయతే జ్ఞానముత్తమం"** అని శాస్త్ర వాక్యము.

శంక:- శాస్త్రములందు పరిశ్రమ చేసియును జ్ఞానము కల్గుటలేదే?

సమా:- బ్రహ్మాత్మల యేకత్వజ్ఞానము ఇతర శాస్త్రములవలన కలుగుట లేదు. **"ఏకవేదాంతవిజ్ఞానస్వామభూత్వా విరాజతే"** అనెడి శాస్త్రవాక్యములనుబట్టి కేవల వేదాంతవిచారముననే అద్వయజ్ఞానము సిద్ధించుచున్నది.

1. అవాంతరవాక్యము 2. మహావాక్యములని ఆ వేదాంతవాక్యములు రెండు విధములు. అందు అవాంతర వాక్యములు కొన్ని త్వం పదముయొక్క అర్థమును, మరికొన్ని తత్పదార్థములను బోధించును. **"య ఏష హృదంతర్జ్యోతిః పురుషః"** అను

మొదలగునవి త్వం పదార్థమును బోధించునవి. తత్పదార్థమును బోధించు వాక్యములు సవికల్ప నిర్వికల్ప ప్రకృతి భేదములచే ముత్తెఱగు. "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాదులు సవికల్పవాక్యములు. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" ఇత్యాదులు నిర్వికల్పవాక్యములు. "నేహ నానాస్తి" ఇత్యాదులు ప్రకృతి వాక్యములు.

ఈ అవాంతరవాక్యములచే పరోక్షజ్ఞానమేకాని అపరోక్షజ్ఞానము సిద్ధింపదు. "అవాంతరేణ వాక్యేన పరోక్షబ్రహ్మధీర్భవేత్". బ్రహ్మము కలదు అని తెలియుట పరోక్షజ్ఞానము. "అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞానమేవ తత్" మహావాక్యములవలన అపరోక్షజ్ఞానము కలుగుచున్నది. నేను బ్రహ్మమునై యున్నానని తెలియుట అపరోక్షజ్ఞానము. "అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారస్స ఉచ్యతే" అని శాస్త్రవాక్యము గలదు. కాబట్టి శ్రోత్రసంబంధమగు మహావాక్య శ్రవణమే జ్ఞానమునకు హేతువు.

ఆ అపరోక్షజ్ఞానము దృఢముగ నెలకొనుటకు శ్రవణాదులను అభ్యసించవలెను. మాటిమాటికి ఆవృత్తి యొనర్చుట అభ్యాసమని పేరు. "ఆవృత్తిరసకృదుపదేశాత్- అని శ్రుతికూడ పలికినది. జ్ఞానము కొఱకు శ్రవణ మనన నిదిధ్యాసముల నొనర్చ వలెను. ఆశ్రవణాదిత్రయమే జ్ఞానమునకు హేతువు.

అది సద్వివేచన పూర్వకముగ అద్వయతత్త్వ నిశ్చయము జ్ఞానమునకు స్వరూపము. తదుపరి అహంగ్రంథి భేదనము సిద్ధించుచున్నది. హృదయగ్రంథి భేదనమే జ్ఞానమునకు ఫలము.

కర్తృత్వధర్మము గల అహంకారమునకును, జ్ఞానస్వరూపుడగు ఆత్మకును ఏర్పడిన తాదాత్మ్యాధ్యాసమే అహంకారగ్రంథి యని, హృదయగ్రంథి యని, చిజ్జడ గ్రంథియని చెప్పబడుచున్నది. ఈ అధ్యాసము కల్పితమై యున్నందున జ్ఞానముచే నివృత్తి యగుచున్నది. ఈ తాదాత్మ్యము భ్రమజ మని, కర్మజ మని, సహజ మని మూడువిధములు. అహంకారమునకు సాక్షితో భ్రమజతాదాత్మ్యము. దేహముతో కర్మజ తాదాత్మ్యము, ఆభాసముతో సహజ తాదాత్మ్యము. వీటియందు జ్ఞానము వలన భ్రమజ తాదాత్మ్యము నివర్తించుచున్నది. కాని దేహపాత

మగుచుండుటవలన తక్కిన రెండును మిగిలియున్నవి. వాటిని మిథ్యయని నిర్ణయించి యుండుటవలన జ్ఞానికి వాటివలన ఎట్టిహానియును లేదు.

## "అహం" శబ్దార్థము

"అహం" శబ్దముయొక్క అర్థము ముఖ్యమని, అముఖ్యమని రెండు విధములు. కూటస్థుడు, ఆభాసుడు, దేహమును ఈ మూడింటిని వేరు వేరుగ వివేచింపి తెలియక అన్నిటి నొకటిగా కలిపి "అహం = నేను" అని చెప్పెడి అర్థమును ముఖ్యార్థ మందురు. సామాన్యజన మంతయును ఈ అర్థమునే వ్యవహరింతురు.

శ్లో॥ అన్యోన్యాధ్యాసరూపేణ కూటస్థాభాసయోర్వపుః ।
ఏకీభూయ భవేన్ముఖ్యా తత్ర మూఢైః ప్రయుజ్యతే ॥

అహం శబ్దముయొక్క అముఖ్యార్థము రెండు విధములై యున్నది. ఆ రెండు విధములను పర్యాయముగ విద్వాంసుడు వ్యవహరించుచున్నాడు.

"అహం గచ్ఛామి" నేను పోవుచున్నాను అనెడి లౌకిక వ్యవహారకాలమునందు పండితుడు అహం శబ్దముయొక్క అర్థమును చిదాభాసునిలో జోడించుచున్నాడు.

"అసంగో౽హం । శివో౽హం" అనెడి వైదికవ్యవహారములందు అహం శబ్దము యొక్క అర్థమును కూటస్థునికి గురిచేయుచున్నాడు.

అనగా అహంశబ్దముయొక్క అర్థము శరీరాది బాహ్యవ్యాపారములందు ఆభాసు డగును. స్వరూపవిచారమునందు సాక్షి చేతన మగును.

శ్లో॥ క్షీరాత్సర్పిర్యథోద్ధృత్య క్షిప్తం తస్మిన్న పూర్వవత్ ।
బుద్ధ్యాదేర్జ్ఞస్తథా౽వర్త్యాన్న దేహపూర్వవద్భవేత్ ॥

తా॥ గ్రంథిభేదన మయినంతట పాలనుండి వెలికిదీసిన వెన్న వెండియు పాలలో కలియనట్లు బుద్ధ్యాది దృశ్యవర్గములను, జ్ఞానస్వరూపుడగు ఆత్మకును ముందటివలె తాదాత్మ్యాధ్యాసము సంభవింపదు.

శ్లో॥ శ్రవణాదిత్రయం తద్వ త్తథ్యమిథ్యావివేచనమ్ ।
పునర్గ్రంథిరనుదయో బోధస్యాతే త్రయో మతాః ॥

తా॥ జ్ఞానమునకు శ్రవణాదిత్రయము హేతువు, తథ్యమిథ్యా వివేచనము స్వరూపము వెండియు అహంగ్రంథి కలుగకుండుట ఫలము.

## ఉపరతికి హేత్వాదికములు

1. యమాది యోగాంగములు ఎనిమిది ఉపరతికి హేతువులు.
2. బుద్ధియొక్క నిరోధము ఉపరతికి స్వరూపము
3. వ్యవహారముయొక్క పరిక్షయము ఉపరతికి ఫలము

"యమాదిర్ధీనిరోధశ్చ వ్యవహారస్య సంక్షయః" అని శాస్త్రము.

1. యమము 2. నియమము 3. ఆసనము 4. ప్రాణాయామము 5. ప్రత్యాహారము 6. ధారణ 7. ధ్యానము 8. సమాధి- యివియె యమాది యోగాంగము లెనిమిది.

1. అహింసా సత్య ఆస్తేయ బ్రహ్మచర్య అపరిగ్రహములని-యమము
2. శౌచ తప స్సంతోష స్వాధ్యాయ ఈశ్వరప్రణిధానములని నియమము అయిదు విధములై యున్నది.
3. ఆసనములు ఎనుబది నాల్గని యోగగ్రంథములు చెప్పినవి. అందు పద్మ స్వస్తికాదికములు ముఖ్యములు.
4. ప్రాణాయామము రేచక పూరక కుంభక భేదములచే త్రివిధము. అందు కుంభకము ఆంతర బాహ్య భేదములచే రెండు విధములై యున్నది. మరియు ప్రాణాయామము సగర్భమని అగర్భమని యిరుతెఱుగులై యున్నది. అందు ఓంకా రోచ్చారణ సహితముగ నుండునది సగర్భమన బడును. అది లేనిది అగర్భము. వాటిలో సగర్భప్రాణాయామము శ్రేష్ఠము.
5. "ప్రత్యాహారస్సవిజ్ఞేయ ఇంద్రియాణాం వినిగ్రహః"= ఇంద్రియములను విషయములనుండి నిగ్రహించుట ప్రత్యాహార మనబడును.
6. "ధారణా మనసో జ్ఞేయా బంధనం బ్రహ్మసద్మని"= బ్రహ్మమునందు మనస్సును చేర్చియుంచుట ధారణ మనబడును.

"ధ్యానం ప్రత్యయసంతానః"= నిరంతర బ్రహ్మాకార వృత్తిప్రవాహమే ధ్యానము. "ప్రత్యయైకతాధ్యానం" అని యోగశాస్త్రము నందలి సూత్రము.

సమాధిలక్షణములు ముందే చెప్పబడినవి. ఇచ్చట సవికల్పసమాధిని ఎనిమిదవ అంగముగ గ్రహించవలెను. ఈ అష్టాంగములు ఉపరతికి హేతువులు. ఉపరతియొక్క స్వరూపఫలములు లోగడ చెప్పియున్నారు.

## వైరాగ్యాదికముల అవధిని చెప్పుచున్నారు.

1. బ్రహ్మలోకమును సైతము ఎండిన గడ్డిపోచనువలె తుచ్ఛముగ దలంచుట
2. దేహాత్మబుద్ధివలె పరమాత్మునియందు దృఢమగు అభేద నిశ్చయము జ్ఞానమునకు అవధి.
3. సుషుప్తివలె సమస్తమును మరచియుండుట ఉపరతికి అవధి.

శ్లో॥ బ్రహ్మలోకతృణీకారో వైరాగ్యస్యావధిర్మతః ।
దేహాత్మవత్ పరాత్మత్వ దార్ఢ్యే బోధస్సమాప్యతే ।
సుషుప్తివద్విస్మృతిః సీమా భవేదుపరమస్య హి ॥

ఈ వైరాగ్యబోధోపరతులు మూడును పరస్పరము సహకారులై యున్నవి. ఈమూడును లెస్సగ సిద్ధించినచో మహాతపః ఫలము సిద్ధించినట్లే. పరమేశ్వరుని అనుగ్రహమువలనను, మహాపురుషుల అనుగ్రహమువలనను ఆఫలము లభించు చున్నది. ఈ వైరాగ్య బోధోపరతులు నశించినంత మనోనాశ వాసనాక్షయ తత్త్వ జ్ఞానములు తోడ్తో చేకూరుచున్నవి. వెంటవెంట సర్వవిక్షేపములును తుదముట్ట నశించుచున్నవి. విక్షేపములు తొలగి పరమప్రశాంతుడై యుండు పురుషుడు అగాధమగు బ్రహ్మానంద సముద్రమున నోలలాడును. వానికి కల్లోల మెట్టి సమయమునను లేదు. అజ్ఞానవాసనా మనస్సులే కల్లోలమునకు కారణములు. దృఢాభ్యాసబలమున నవి తొలగి పోవుచున్నది.

## V. వాసనలు, వాటి నివృత్తియు

అవతారిక:- ఇప్పుడు వాసనాక్షయ నిమిత్తముగ వాసనలయొక్క స్వరూప విభాగమును మనోనాశనమును మనస్స్వరూపమును చెప్పుచున్నారు.

సూక్ష్మసంస్కారమునకు వాసన యనిపేరు. వెనుకముందు విచారము లేక దృఢభావనచేత పదార్థమును పట్టుకొనునది వాసన యనబడును.

శ్లో॥ దృఢభావనయా త్యక్త పూర్వాపరవిచారణమ్ ।
యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా ॥

అని శాస్త్ర వాక్యము గలదు. ఆ వాసనయు శుద్ధము, అశుద్ధము ననెడి భేదములచే రెండువిధములు

శ్లో॥ వాసనా ద్వివిధాప్రోక్తా శుద్ధా చ మలినా తథా ।
మలినా జన్మనో హేతుః శుద్ధా జన్మవినాశినీ ॥

ఆ రెంటియందు మలిన వాసన జన్మమునకు కారణము. శుద్ధవాసన జన్మ రాహిత్యమునకు కారణము. ఆమలిన వాసన సుప్తమని, ప్రబుద్ధమని యిరుతెఱగు. అందు సుప్తవాసన వృక్షాదులయందును, ప్రబుద్ధవాసన మనుష్యాదులందును విద్యమానమై యున్నది. అదియును లోకవాసన యని, శాస్త్రవాసన యని, దేహవాసన యని త్రివిధము. ఈమూడును దృఢజ్ఞానమునకు ప్రతిబంధకములు.

శ్లో॥ లోకవాసనయా జంతుః శాస్త్రవాసనయాఽపి వా ।
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే ॥

1. జనులెల్లరును తన్నె కొనియాడవలెను, ఎవ్వరును నిందించరాదు, లోక మందు నాకు ప్రతిష్ఠ చేకూరవలెను అనెడి యిచ్ఛ లోకవాసన యందురు.

2. శాస్త్రవాసనయందు పాఠవాసన, అర్థవాసన, అనుష్ఠానవాసన యనెడి అంత ర్భేదములు మూడు గలవు. ఈ మూడును క్రమముగ భారద్వాజ నారదు లను పట్టి పీడించినవి. వారు వాటిని త్యజించి జ్ఞానమును బడసిరి.

3. దేహవాసనయు గుణాధాన మలాపన మను భేదములచే ద్వివిధము. అవియు కూడ లోకశాస్త్ర భేదములచే మరియును రెండు రెండు విధములు. ఇవి యన్నియు జ్ఞానహీనుడగు విషయీ పురుషునందె ప్రవర్తించును. విద్వాంసుడు వీటికి వశుడు గాడు. శుద్ధవాసన యుదయించినంత నివి యన్నియు నశించును.

శుద్ధవాసన రెండు విధములు. మైత్రీ కరుణా ముదితాదులగు దైవీ సంపద రూపమున నొకటియు అద్వైత చిన్మయ వాసనా రూపమున వేరొకటియు నున్నది.

## మనోనాశక్రమము

స్వరూపనాశమని, అరూపనాశమని మనోనాశము రెండు విధములు.

"స్వరూపోఽపి మనోఽనాశో జీవన్ముక్తస్య విద్యతే"= మనస్సు యొక్క స్వరూప నాశము జీవన్ముక్తి దశయందు కల్గును.

శ్లో॥ మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ।
అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్॥

మనస్సు శుద్ధమని, అశుద్ధమని రెండు విధములు. అందు కామ సంకల్ప సహిత మైనది అశుద్ధము. దానిని ప్రయత్నముచే నశింపజేయవలెను. కామాది రహిత మైనది శుద్ధమనస్సు. అది విదేహమోక్ష పర్యంతము నుండును. కాబట్టి జీవన్ముక్తుని మనస్సునకు స్వరూపనాశనమని పెద్దలు చెప్పియున్నారు.

శంక:- శ్రుతిస్మృతులయందు మనస్సు మిక్కిలి చంచల మైనదనియు, విషమ మైనదనియు, దుర్నిగ్రహ మనియు చెప్పియున్నారు. అట్టి మనస్సును నిరోధించుట ఎట్లు?

సమా:- ఆ మాటలు నిజమే; అయినను మనోనిగ్రహమునకు నలయు ఉపాయములు సైతము కలవు. ప్రాణస్పందనమును, విషయవాసనలును మనసునకు బీజములు. మనోనాశమునకు యోగధ్యానములు రెండును విధాన క్రమములై యున్నవి. అందు చిత్తవృత్తి నిరోధమును యోగమనియు, సమ్యక్ తత్త్వనిరీక్షణమును జ్ఞానమనియును చెప్పుదురు. చిత్తమనినను మనస్సనినను ఒకటే. అచిత్తవృత్తి ప్రమాణ విపర్యయ వికల్పాది భేదములచే అయిదు విధములై యున్నది. అభ్యాసవైరాగ్యములచే మనస్సును నిరోధింపవచ్చును. మాటిమాటికి ఆవృత్తి యొనర్చుట అభ్యాసము. "తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః" అని యోగసూత్ర వాక్యము. అసంగుడగు పురుషునందు చిత్తమును నిలుపుటకై చేసెడి ప్రయత్నము అభ్యాసముయొక్క లక్షణము. వైరాగ్యమును గూర్చిన వివరణమును ముందే చెప్పి యున్నారు. ఇదియును గాక;

శ్లో॥ అధ్యాత్మవిద్యాధిగమః సాధుసంగమ ఏవ చ ।
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పందనిరోధనమ్ ॥

1. అధ్యాత్మవిద్యయొక్క పరిచయము 2. సాధుసాంగత్యము 3. వాసనా త్యాగము 4. ప్రాణచలన నిరోధము ననెడి నాల్గువిధములగు యుక్తులచే మనస్సును నిరోధింపవచ్చును. దీనినే క్రమనిగ్రహమని శాస్త్రములు చెప్పినవి.

ఈ క్రమనిగ్రహము కాక హఠనిగ్రహమువలన సైతము మనస్సును నిరోధించవచ్చును. అయినను క్రమనిగ్రహమే శ్రేష్ఠమైనది. మనస్సు నిగ్రహింప బడినచో సమాధిసిద్ధి కలుగుచున్నది. ఆ సమాధి సుఖము అపరిమితమైనది. కాబట్టి మనోనిగ్రహమునకై పురుషార్థపరులు అవశ్యము ప్రయత్న మొనరించవలెను.

శ్లో॥ ఉత్సేక ఉదధేర్యద్వత్ కుశాగ్రేణైకబిందునా ।
మనసో నిగ్రహస్తద్వత్ భవేదపరిభేదతః ॥

తా॥ గడ్డిపోచకొనయందలి నీటిబొట్టులచే సముద్రము వెళ్లతోడుటకు ప్రయత్నించిన టిట్టిభపక్షివలె సాధకుడు దైన్యమును బోనడచి మనస్సును నిగ్రహింప బూనవలెను.

ఇట్లు స్వరూపమనో నాశనము జీవన్ముక్తునికి కలుగుచున్నది. అరూపమనో నాశము కేవలము విదేహముక్తునకే కలుగుచున్నది. ఇట్లు జ్ఞానము వలనను వాసనా క్షయమువలనను మనోనాశము కల్గుచున్నది. ఈమూడును పరస్పరహేతువులై యున్నవి.

ఇట్లు వాసనానాశమగుడు చింతాక్రియలు నశించి, యీషణలు సమూలముగ తొలగినంతట బ్రహ్మవిత్తముడు పాండిత్య బాల్య యౌవనములయెడ విరక్తుడై భూమానందమున నిమగ్ను డగుచున్నాడు.

'బ్రాహ్మణః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయ' అని విద్వాంసునకు ఈషణాత్రయ అభావమును శ్రుతి చెప్పినది. మరియును

"పాండిత్యం నిర్విద్య బాల్యే న తిష్ఠా స బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యాథముని రమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః"

పాండిత్యమున విరక్తుడై బాల్య స్వభావమున నిలచి వెండియు బాల్య పాండిత్యముల రెంటను నిర్వేదమును బొంది యనంతరము మునియై మౌనా మౌనములను సహితము వీడి బ్రాహ్మణుడు బ్రహ్మానందమును పొందు చున్నాడు.

ఆ భూమానంద సింధువునందు నిమగ్నుడై యుండు బ్రహ్మవేత్తకు విక్షేప రూప ప్రపంచము ప్రతీత మగుట లేదు అను విషయమును ప్రతిపాదించుచున్నారు.

## VI. జీవన్ముక్తునకు ప్రపంచప్రతీతి లేదు

**"అవిద్యావిలాసం"** విచిత్రగుణక్రియా స్వభావములు గల అవిద్యయొక్క కార్యవిలాసమగు ఈ భూతభౌతికరూప ప్రపంచము భూమానంద సాగరనిమగ్ను డగు జీవన్ముక్తునకు తోచుట లేదు.

సర్వజగత్తునకును స్వసత్తాస్ఫూర్తి నిచ్చి నిర్వాహక మగుటంబట్టి బ్రహ్మమె సర్వమునకును నిమిత్తమైనది. ప్రపంచజనుల బాహ్యచేష్టలకు నిమిత్తమై సూర్యు డున్నట్లు సర్వవ్యవహారమును నిమిత్తమై బ్రహ్మ మున్నది. అది సర్వవ్యాపకమయ్యు నసంగము. కావుననే 'అద్భుత' మనబడినది.

సూర్యకిరణములం దారోపించబడిన మరు జలమువలె బ్రహ్మమునందు అవిద్యావిలాసము కల్పించబడినది. **"యత్ర సర్వాత్మైవాభూత్తత్ర కేన కం పశ్యేత్"** సర్వాత్మస్వరూపునకు అగపడున దేది? వానికి ద్వైతకల్పనమె లేదు. **"యత్ర నాన్యత్ప శ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా"** అనెడి ఛాందోగ్యశ్రుతి ప్రసిద్ధమై యున్నది. **"యో వై భూమా తత్సుఖం"** ఆ భూమాబ్రహ్మమే సుఖరూపము **"అనిర్దేశ్య పరం సుఖం"** ఆ సుఖము నిరతిశయము కాబట్టి అనిర్దేశ్యమని కఠశ్రుతి పలికినది. ఆ సుఖముయొక్క సంపూర్ణాస్వాదనము ఆరవభూమిక యందున్నవానికి కల్గును. ఏడవ భూమిక యందుండు వానికి వృత్తియే లేదు కాబట్టి ఆస్థితి అవాచ్యము.

అట్టి ఆనంద సముద్రమగు నిత్యపరబ్రహ్మము నేనై యున్నాను అని యెనిమిదవ శ్లోకార్థము.



## తొమ్మిదవ శ్లోకం

## VII. ఫలనిరూపణము

**అవ:** వెనుకటి గ్రంథమునందు జిజ్ఞాసువు చేయదగిన తెలియదగిన, పొందదగిన, తత్త్వమును విస్తారముగ చెప్పియున్నారు. ముందటి చివరశ్లోకములలో ఈ విజ్ఞాన నౌకయొక్క పఠనము వలన గలిగెడి ఫలమును ఆచార్యులవారు నుడువుచున్నారు.

**మూల శ్లో॥ స్వరూపానుసంధానరూపాం స్తుతిం**
**యః పఠేదాదరాద్భక్తిభావో మనుష్యః**
**శ్రుణోతీహ వా నిత్యముద్యుక్తచిత్తో**
**భవేద్విష్ణురత్రైవ వేద ప్రమాణాత్ ॥**

*(ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచిత విజ్ఞాన నౌకాష్టకమ్ సంపూర్ణమ్)*

టీక॥ యః+మనుష్యః = ఏ మనుష్యుడు, స్వరూపానుసంధాన = తన స్వరూపమైన బ్రహ్మానుసంధానమే, రూపాం = రూపముగా గల, స్తుతిం = స్తోత్రమును, ఆదరాత్ = మన్నన (గౌరవము)తో గూడినట్టి, భక్తిభావాత్ = భక్తి భావమువలన, పఠేత్ = పఠించునో, శ్రుణోతి = వినునో, ఇహ = ఈ లోకమున, నిత్యం = ఎడ తెగని, ఉద్యుక్తచిత్తః +వా = ప్రయత్నముతోగూడిన హృదయము గలవాడో, (సః=అతడు) వేదప్రమాణాత్ = వేదప్రమాణమువలన అత్ర+ఏవ = ఇచ్చటనే (ఈ జన్మముననే), విష్ణుః = (విశ్వం వేవేష్టి వ్యాప్నోతీతి విష్ణుః) విశ్వమంతా వ్యాపించి యుండు పరబ్రహ్మము, భవేత్ =అగును.

తా॥ స్వరూపానుసంధాన రూపమును, స్తుతిపరమును నగు ఈ విజ్ఞాననౌక యనెడి గ్రంథమును భక్తిభావితుడై ప్రయత్నశీలుడై పఠించువాడును, వినువాడును వేదప్రమాణము ననుసరించి విష్ణుస్వరూపు డగుచున్నాడు.

జ్ఞానాధికారము మనుష్యదేహములకెగాని తదితర దేహములకు లేదని సూచించుటకై మూలమున "మనుష్య" శబ్దముపయోగింపబడినది. ఆ మనుష్యు లందు సైతము అధికారి యగువాడు భక్తిభావిత చిత్తమున జ్ఞానియగు గురుని

సమక్షమున చదువుట చేతను, వినుటచేతను పరమఫలమును బొందుచున్నాడు.

## భక్తి ప్రశంస

ఈశ్వరభక్తి సగుణనిర్గుణ భేదములచే రెండు విధములు. మరియును పర అపరభేదములచే కూడ రెండు విధముల జెప్పుదురు.

"పరామరక్తిరీశ్వరే మద్భక్తిం లభతే పరాం
అహేతుక్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే
లక్షణంభక్తియోగస్య నిర్గుణ స్యేత్యుదాహృతమ్" అనెడి సూత్రస్మృతి శాస్త్రవాక్యములు సుప్రసిద్ధములు.

వెండియు సగుణభక్తికూడ అంగాంగిభావమున రెండు విధములు. ప్రేమ లక్షణమె అంగి యనబడును. శ్రవణకీర్తనాదులు తొమ్మిదియు అంగరూపములు.

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥

అని నవవిధభక్తులును శాస్త్రములందు చెప్పబడియున్నవి. వీటిని సాధించిన సాధకులు జ్ఞానమార్గమున కైవల్యమును బడసిరి.

శ్లో॥ శ్రీకాంతశ్రవణే పరీక్షితరభూత్ వైయాసకిః కీర్తనే
ప్రహ్లాదస్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీపృథుః పూజనే ।
అక్రూరస్త్వభివందనే కపిపతిర్దాస్యేఽథ సఖ్యేఽర్జునః
సర్వస్వాత్మని వేదనే బలిరభూత్ కైవల్యమేకైకతః ॥

తా॥ పరీక్షిత్తు, శుకదేవుడు, ప్రహ్లాదుడు, లక్ష్మీదేవి, పృథుచక్రవర్తి, అక్రూరుడు, హనుమంతుడు, అర్జునుడు బలిచక్రవర్తియును ఒక్కొక్కరొకొక్క అంగము నాశ్రయించి ధన్యులైరి.

ఈశ్వరభక్తిసరి గురుభక్తి సైతము మహత్త్వయుత మైనది. "యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ" అని శ్రుతి చెప్పినది. ఈశ్వరభక్తియు, గురుభక్తియు

విద్యాప్రాప్తికి అంతరంగ సాధనములు. కాబట్టి భక్తిభావమును ప్రయత్నశీలతయును గల పురుషసింహమే పరమసిద్ధిని పొందగలడు. శ్రవణాది సాధనములయందును తత్సాధ్యమగు బ్రహ్మనిష్ఠయందును ప్రమాదమును బొందరాదు. **"ప్రమాదో వై మృత్యు మహం బ్రవీమి"** అని సనత్సుజాతీయము చెప్పినది.

బుద్ధిమాంద్యమను దోషమున్నచో నిత్యమును శ్రవణము జేయవలెను. శ్రవణ బలముచేతనే జ్ఞానము కలిగి మోక్షము చేకూరగలదు. **"తేఽపి చాతి తరం త్యేవ మృత్యుం శ్రుతి పరాయణాః"** అని భగవద్గీత పేర్కొన్నది. అందుచేత వేదాంత విచారమును చెప్పువాడును, వినువాడును మోక్షమును బొందుదురు.

శంక:- ఉత్తమములగు శారీరకాది వేదాంతగ్రంథములవలన జ్ఞానము సిద్ధించును. ఈ చిన్నగ్రంథములవలన సమ్యక్ జ్ఞానము కల్గుటకు వీలులేదు.

## గ్రంథముయొక్క ఉత్కృష్టత

సమా:- శారీరకాది సర్వవేదాంత గ్రంథముల సారమంతయు ఈ "విజ్ఞాన నౌక" యందు సంకలింపబడియున్నది. ఛాందోగ్యోపనిషత్తుయొక్క ఆరవ ప్రపాఠకమువందు "తత్త్వమసి" మహావాక్యము తొమ్మిది మార్లు ఆవృత్తి చేయబడినది. ఈ గ్రంథమునందు యజుర్వేదసంబంధమగు "అహం బ్రహ్మాస్మి"యను అనుభవ వాక్యము తొమ్మిదిమార్లు అభ్యసించబడినది.

స్వరూపానుసంధానరూపమగు ఈ విజ్ఞాననౌకయందు సంపూర్ణముగ వేదాంతప్రక్రియలు శ్రీమదాచార్యులవారు సమావేశము చేసియున్నారు. సర్వసాధనలును బోధోపయోగములగు పదార్థములును 1.ఉద్దేశ 2.విభాగ 3. లక్షణ 4. పరీక్షాపూర్వకముగ వర్ణింపబడియున్నవి.

1. నామమువలన పదార్థమును చెప్పుట "ఉద్దేశము".
2. వాటి అవాంతరభేదవర్ణనము "విభాగము".
3. వస్తువుయొక్క అసాధారణధర్మము "లక్షణము". అతివ్యాప్తి, అవ్యాప్తి అసంభవ మను దోషముమ లేనిది, సల్లక్షణము తద్భిన్నమైనది అసల్లక్షణము.

4. ఆక్షేప సమాధాన పూర్వకముగ ప్రమాణయుక్తులచే పదార్థమును నిర్ణయించుటను పరీక్ష యందురు.

ఈ గ్రంథమున ప్రతి శ్లోకమునందును స్వరూపచింతన ముండుటచేత చదువుటతోడనె సర్వపాపములును నివృత్తి కాగలవు. ఈ విషయమును జ్ఞానియగు గురుముఖమున సాదరముగ పఠించువాడును, వినువాడును, జీవించి యుండగనే విష్ణుస్వరూపమును బొందుచున్నాడు.

శంక:- ఉపాసనముచే విష్ణుప్రాప్తి కలుగునని చెప్పుదురు. అంతియెగాని జ్ఞానముతో కాదు.

సమా:- వైకుంఠమునందుండెడి విష్ణుస్వరూపప్రాప్తి ఉపాసనచే కల్గునని శాస్త్రములును, పురాణములును చెప్పియుండుట నిజమే కాని ఆస్వరూపము పరమార్థమై నది కాదు. **"మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద"** అని భగవంతుడు స్వయముగనే పేర్కొనినాడు.

వ్యాపక శీలమగు పరబ్రహ్మమే విష్ణువుయొక్క వాస్తవస్వరూపము. జ్ఞాని దానిని పొందుచున్నాడు. స్వస్వరూపముచే అపర బ్రహ్మమును ప్రాప్తించుచున్నాడు. అందుకు ప్రమాణములు కూడగలవు **"య ఏవం వేద స విష్ణురేవ భవతి", "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, బ్రహ్మవిదాప్నోతి పరం, తరతి శోకమాత్మవిత్"** బ్రహ్మభావప్రాప్తి రూపమగు ఈ కైవల్యమోక్షము దేహపాతానంతరమె సిద్ధించుననుట లేదు. జీవించి యున్నప్పుడే సిద్ధించుచున్నది **"అత్ర బ్రహ్మ సమశ్నుతే"** అని శ్రుతివాక్యము **"ప్రారబ్దనాశాత్ ప్రతిభాసనాశః"**= ప్రారబ్దము నశించుటచే ప్రతిభాస నశించుచున్నది. ఆయెడ విదేహముక్తిని పొందుచున్నాడు. ఆవరణ విక్షేపములు లేక ప్రాణసహితుడగు బ్రహ్మనిష్ఠుడు జీవన్ముక్తుడని చెప్పబడును.

ప్రకాశరూపమగు బ్రహ్మమునందు అంతఃకరణప్రాణములు విలయ మగుట విదేహముక్తి. విదేహముక్తుని ప్రాణము దేహాంతరమునకును, లోకాంతరమునకును పోవుట లేదు. శరీరమందే లయించుచున్నది. వానికి వెండియు సంసారప్రాప్తి లేదు.



## IX. అధికారిప్రశంస

మూల॥ శ్లో॥ విజ్ఞాననావం పరిగృహ్య కశ్చిత్
తరేద్యదజ్ఞానమయం భవాబ్ధిమ్ ।
జ్ఞానాసినా యో హి విచ్ఛిద్య తృష్ణాం
విష్ణోః పదం యాతి స ఏవ ధన్యః ॥ 10

*ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య*
*విరచితా విజ్ఞాననౌకా సమాప్తా*

సద్గురుడను నావికుని ఆశ్రయించి యీ విజ్ఞాననౌకను అధిరోహించిన పురుషుడు అజ్ఞానకల్పితమగు సంసారసాగరమును దాటి మోక్షప్రతిబంధకములగు భోగతృష్ణలను దెగటార్చి ధన్యు డగుచున్నాడు.

ఇట్లు అనుభూతి యనెడి వివరణ ముగిసినది.

*ఓం తత్సత్ ఓం ఇతి శాంతిః సమాప్తము*



